# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఫిబ్రవరి 1971



సంపుటము : 48 : సంచిక : 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1971

# ధర్మారణ్యము

శ్రీ శనగన నరసింహస్వామి

యుగయుగంబుల వెనుకకు నెగసిపోయి
చూచు భావుక మానసలోచనముల
కగును గోచరములు నైమిశాదిపుణ్య
వన పదంబులు మునికులజనపదములు.

భోగములు రోసి తపము పెంపున సమస్త
హితము బోధించు మౌనుల కెదురువడగ
సిగ్గుపడినాడు నిర్జర స్త్రీజనంబె
కాదు మఘవుడె కాదు స్వర్గంబు కూడ!

రేపుమాపును నభిషవక్రియల కగుచు
నాపగామణి తమస శిష్యత భజింప
తత్తటోర్విని సంతతాధ్యాపనైక
తత్పరుడు పొల్చు వాల్మీకి తాపసుండు.

అంతేవాసుల మానస
సంతోషముగా దలంచి సంయమి సాక్షాత్
సంతానద్రుమమై వే
దాంతార్థామృత మొసంగి ధన్యుల జేయున్.

మదగజరాజయానమున్
మంత్రముగా పథమెల్ల మానమే
పొదువగ మానిమాళివనమున్
వెలిగించుచు నేగు నావగా

# భారతి

నదములవారి గ్రుంకి నిరుసంధ్యల
దైవత భారతీ వధూ
హృదయమునం దపూర్వమధురేహితముల్
విహరించుచుండగన్.

నిరతము దుర్గమాటవి వినిర్భయచిత్తములన్
సమిత్కుశాహరణమతిన్
సుదూరముగ సద్వటువుల్ సం
రేయి వెన్నెలల్ విరియును
దోడువచ్చు నడవిన్ మృగరాజముకూడ
తేనియల్ గురియును వృక్షముల్
గుసుమకోటుల నర్ఘ్యవిధిన్ ఘటించుచున్

ప్రాతరోష్ణహాస సామో
ద్దీప్తగతినో నవార్కకిరణవ్రాతా
పాతంబునో అంభో
జాతంబులు విరియు నచటి సరసులలోనన్.

---



# ఆధునిక భాషా శాస్త్రాభివృద్ధి

## డా. బొడ్డుపల్లి పురుషోత్తం

దైనందిన జీవితంలో భాషకున్న ప్రయోజనం ఇంతఅంతఅని ఊహింపరానిది. అందుచేత దాని ప్రాథమిక నియమాల్ని అవగాహనం చేసుకోటానికి ప్రతిఒక్కరు తగినంత శ్రద్ధ చూపించటం ఎంతైనా అవసరం.

పూర్వంలోకంటె ఇప్పుడిప్పుడే భాషా నియమాల్ని సుకరంగా తెలుసుకోటానికి తగిన మార్గాలేర్పడుతున్నాయి. భాషాధ్యయనం నేడు సజీవమైన నూత్న పద్ధతుల్లో సాగుతున్నది. ఈ మధ్యకాలంలో సామాన్యభాషాశాస్త్రం సాధించిన అభివృద్ధిని పరిశీలిస్తే ఆశ్చర్యం కల్గకమానదు. దాన్ని గ్రహించాలనే ఉత్సాహం జనిస్తుంది.

ఆధునిక భాషాశాస్త్రం సాంప్రదాయికమైన శృంఖలాల్ని విచ్ఛేదంచేసుకొని, హేతువాద సహితమైన శాస్త్రంగా అభివృద్ధిని పొందుతున్నది. దీనికి కీలకమిప్పుడు వ్యాకరణంకాదు—పదనిర్మితి ఆధునిక గణితశాస్త్రానికి, అణుశాస్త్రానికికూడ 'నిర్మితి' చాలా ముఖ్యం. నిజానికి అన్ని సామాజికశాస్త్రాల్లోను భాషాశాస్త్రమే సాంకేతిక నైపుణ్యాన్ని అధికంగా సంపాదించుకొని ముందంజవేస్తున్నది.

భాషాశాస్త్రీయ సాంకేతిక నైపుణ్యం సంపాదించిన విద్యావంతులకు తమ మాతృభాషకాక ప్రముఖమైన ప్రపంచ జీవద్భాషను మరోదాన్ని కైవశం చేసుకోటం చాలా సుకరం. ఇందుమూలాన ఎక్కువ మంది మానవులు సన్నిహితవౌతారు. అందువల్ల సాంఘికంగాను, రాజకీయంగాను, వ్యాపారరంగంలోను సమాజాభివృద్ధి బాగా ఏర్పడుతుంది.

తాత్త్వికులు, మనస్తత్వశాస్త్రజ్ఞులు ఆర్థిక సంఖ్యాగణన శాస్త్రజ్ఞులు, తమతమ శాస్త్రరచనలకు సాంకేతికభాషలను రూపొందించుకొంటున్నారు వీనినే అతీతభాష లనవచ్చును. వీరు సాధారణ ప్రజానీకంతో సంభాషించటంకూడా క్రమేణా విస్మరించే ప్రమాదం కూడా సంభవించవచ్చు. ఋజువుగా భావోద్రిక్తమొనర్చవలసిన కవులు, కళాకారులు నేడు తమ రచనల్ని అతినిగూఢమొనర్చి అయోమయస్థితిని కల్పిస్తున్నారు. ఈ విధంగా శాస్త్రాల కళల పరమావధి సాంకేతికనైపుణ్యప్రదర్శనమేనా అన్నట్లుగా ఉంది.

భావప్రకటనాని కనువైన ఉత్తమోత్తమ సాధనం భాష. ఇది కాలగతిలో మార్పులకు లోనౌతూ వుండే మెత్తని వ్యవస్థతో కూడింది. కొన్ని నిర్ణీతమైన ధ్వనులతో, ధ్వనిసమ్మేళనాలతో కూడింది. దీని మూలంగా మానవుడు తన ఆలోచనల్ని, ఆవేశాల్ని, ఆశల్ని, ఆశయాల్ని ఎదుటివారికి తెలియజేస్తూ వాటితో పంచుకుంటుంటాడు. అందుచేత భాష ప్రధానంగా మానవ సంబంధమైంది. ఇది మానవునకు సహజంగా సంక్రమించిందికాదు పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులు సహజంగా తమ తమ సుఖ దుఃఖ భావ ప్రకటనార్థం కావించే ధ్వనుల కన్న భిన్నమైంది భాష. ధ్వన్యుత్పత్త్యవయవాల సహాయంతో వక్త కావించే ధ్వనులను, ధ్వని గ్రహణ అవయవ సహాయంతో శ్రోత స్వీకరించే అర్థవంతమైన ధ్వనుల సమూహం భాష అనవచ్చు. ఈ ధ్వన్యుత్పత్తి గ్రహణాలకై మానవునిలోగల నరాలు, నాడులు, ఊపిరితిత్తులు, మేధ మొదలైనవి స్పష్టీకరించటానికి వీలులేనంత క్లిష్టంగా నిగూఢంగా పని చేస్తుంటాయి. మానవుడు తన సుదీర్ఘమైన చరిత్రలో అసంఖ్యాకములైన భాషల నుత్పత్తి చేసి

ఉంటాడు. ఎన్ని భాషలో జాడ తెలియరాకుండానే నశించిపోయి వుంటాయి. ఆధునిక జగత్తులో రెండు మూడువేలవరకైన భాషలున్నాయని చెప్పవచ్చు.

ఈనాడు భాషాశాస్త్రజ్ఞుడు కావించే వాస్తవిక పరిశీలనం భాషలోగల వర్ణ పద పదాంగ సమాస వాక్య నిర్మాణ వైఖరుల్ని గుర్తించటం. ఈతడు తన శోధనను ఒకే భాషకు పరిమితం చేసుకోవచ్చు. లేదా ఒకటి రెం డితర భాషల్ని తీసుకోవచ్చు. సహజంగా తనకు సుపరిచితమైన మాతృభాషావ్యవసను పరిశీలించుకొన్న తరువాతనే ఎవరైనా అన్యభాషా వ్యవస్థను విశ్లేష మొనర్చి గ్రహించాలని అనుకొంటారు. ఎవరైనా ఒక భాషా వ్యవస్థను సమగ్రంగా విభజించాలంటే అన్యభాషా వ్యవస్థతో కొంత పోల్చుకొంటే కాని సాధ్యపడదేమో అనిపిస్తుంది. అందుకే ఆధునిక ప్రపంచంలో ప్రతిభాషాభిజ్ఞుడు తన మాతృభాష కాక మరో జీవద్భాషనైనా సమగ్రంగా తెలుసుకోటం అత్యవసరం.

పాశ్చాత్య భాషా విద్యార్థులు తమ నాగరకతా వైభవాన్ని ప్రతిబింబించే వాఙ్మయంగల ఫ్రెంచి, జర్మన్, స్పానిష్, పోర్చుగీస్, ఇటాలియన్, స్వీడన్, మున్నగు జీవద్భాషల్లో కొన్నైనా గ్రహించాలని ఆరాటపడతారు. కాని భారతీయులు తమ ప్రాంతీయ భాషకాక ఇతర భారతీయ భాషను దేన్నీ తెలుసుకోవాలనే కుతూహలం ప్రదర్శించరు. ఇది చాలా శోచనీయం. కనీసం భారతీయ భాషల్ని అతీత పట్టభద్రస్థాయిలో అధ్యయనంచేస్తే విద్యార్థులైనా తమ భాషకు సోదర భాషల్లో ఒక్కదానైనా అధ్యయనం చేయాలని అనుకోక పోవటం, దానికి తగిన అవకాశాల్ని విద్వత్ప్రభులు కల్పించకపోవటం చింత్యం. ఉదాహరణకు ఆంధ్రభాషను అభిమానంగా పఠించే యం. ఏ. విద్యార్థులకు ద్రావిడభాషాకుటుంబానికి చెందిన ఏ తమిళమో, కన్నడమోకూడా పరిచయమైవుంటే స్వకీయభాషాకుటుంబశాస్త్రాధ్యయనం ఎంతో సౌలభ్యంగా ఉంటుం దనటంలో సందేహంలేదు. ఇదే రీతిగా వాఙ్మయాధ్యయనంచేసే విద్యార్థులు తమ అధ్యయనంతో సంబంధమున్న మరో వాఙ్మయాన్ని అధ్యయనం చేయటం అత్యవసరం.

ఈ విధంగా ఒక జీవద్భాషాధ్యయనం చేయక పోతే, పర్యాయంగా ప్రాచీన సాంస్కృతికమైన గ్రీకుగాని, లాటిన్‌గాని పాశ్చాత్యభాషా విద్యార్థి అభ్యసించి తీరుతాడు. భారతదేశంలో యం. ఏ. శ్రేణిలో సంస్కృతం కొంత నేర్పటం జరుగుతుంది. ఇది గుడ్డిలో మెల్ల. ఇది పట్టభద్రస్థాయినుండి జరగటం వాంఛనీయం.

ఆధునికభాషాశాస్త్రజ్ఞుడు ప్రాచీన సాంప్రదాయిక పరిజ్ఞానప్రభావానికి లోనుకాకుండ స్వచ్ఛము, స్వచ్ఛందమునైన మనస్సుతో భాషావగాహనం కావించుకొని దాని వ్యవస్థ నున్మీలిస్తాడు. క్రీ పూ. 4 వ శతాబ్దంలో సంస్కృతభాషను కుణ్ణంగా వ్యాకరించి పరిణతమానవమేధావికాసానికి శాశ్వతచిహ్నమనే కీర్తిగాంచిన 'అష్టాధ్యాయి'కర్తయైన పాణిని మహర్షి అలంకరించిన పీఠంవంటి పీఠాన్నే ఆధునికభాషాశాస్త్రజ్ఞు డలంకరిస్తాడనవచ్చు. మొత్తముమీద వైభవోపేతమైన ప్రాచీనభాషల్ని ఆయా భాషావ్యాకర్తలు సమగ్రంగానే వ్యాకరించారనవచ్చు. సంస్కృత భాషకు యాస్కుడు, పాణిని; గ్రీకు భాషకు డయోనీషియస్ (థ్రాక్సు), అపోలోనియస్ డైకోలస్సులు; ఇటాలియన్ భాషకు ఎలియస్ దొనతస్ ప్రీషియనులు; అరబ్బీ భాషకు సీబావహీ, అల్‌ఖలీల్, అమోఘంగా వ్యాకృతుల్ని చేకూర్చారనటంలో సందేహం లేదు. వారెట్టి సంకుచిత సిద్ధాంతాలకు లొంగిపోలేదు. దొనతస్, ప్రీషియన్లు తమకు పూర్వులైన వ్యాకర్తల్ని అంధప్రాయంగా అనుసరించినమాట వాస్తవమేకాని, అంతమాత్రాన వారివల్ల ఆ భాషల కెటువంటి అన్యాయం జరగలేదు.

లాటిన్ భాష విభక్తి విధానంలోను, క్రియా రూపాలలోను, పదనిర్మితిలోను, గ్రీకుభాష కత్యంత సన్నిహితమైంది. గ్రీకు, లాటిన్ భాషలు రెండూ విశేషంగా ప్రత్యయాత్మకమైనవి. లాటిన్ భాష

గ్రీకుభాషకన్న అనేక విధాల అక్లిష్టమైంది. లాటిన్‌లో ప్రాకృతాలకువలె ద్వివచనం లేదు. లాటిన్‌లో గ్రీకునందువలె (లుక్—ఒక విధమైన భూతార్థకం రూపాలు) మృగ్యం. గ్రీకు భాషలో సంస్కృతంలో లాగా దశవిధ లకారాలు ఉంటే లాటిన్‌లో మూడే ఉన్నాయి. గ్రీకులో లాగానే లాటిన్‌లోను సమతాగుణశోభితమైన వాక్య నిర్మాణం ఉందికాని అంతకన్నా ఇంకా జటిలంగా మారింది. ఇంతకు చెప్పవచ్చింది ఈ రెండు భాషానిర్మాణాలకు గల సామ్యమునుబట్టి లాటిన్, గ్రీకు వ్యాకృతుల్ని అనుసరించినంత మాత్రాన కల్గిన అపకారం ఏమంత లేదని. కానీ తరువాత మధ్యయుగాల్లోని ఐరోపియన్ వైయాకరణులు లాటిన్ వ్యాకరణాన్ని యధాతథంగా తమ తమ భాషల కనువర్తింప చేయటంచేతనే మహా ప్రమాదం సంభవించింది ఇదేరీతిగా సంస్కృత వ్యాకరణాన్ని ప్రాకృతాలకు అనుసరించడంవల్ల నష్టం అంతగా లేదు. ప్రాకృత వ్యాకర్తలే చెప్పుకొన్నారు కదా 'అనుక్త మన్య శబ్దానుశాసనవత్' అని. సంస్కృతం 'ప్రకృతి' అయితే ప్రాకృతాలు 'వికృతి'గా పరిగణింపబడ్డాయి. 'ప్రకృతివత్ వికృతిః' అనే పూర్వమీమాంసాశాస్త్ర నియమాన్ని వ్యాకరణ శాస్త్రానికిగూడా అన్వయం చేసుకొన్నారు. కాని భిన్నభాషా కుటుంబానికి చెందిన తమిళ కర్ణాటాంధ్ర భాషా వైయాకరణులు సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించి తమ వ్యాకృతులను తీర్చిదిద్దటంవల్లనే ఎక్కడ లేని చిక్కులొచ్చిపడింది. దీనికంతటికీ కారణం వ్యాకరణమంటే లాటిన్‌వ్యాకరణమో సంస్కృత వ్యాకరణ మనో అనుకోటం. అందులోని నియమాలు విశ్వభాషాపరివ్యాప్తాలని, తర్క సహిష్ణమని విశ్వసించటమే ఇప్పటికి అటువంటి నమ్మకం పూర్తిగా నశించిందని చెప్పలేం.

లాటిన్ వ్యాకరణ ప్రభావతీవ్రత సర్ విలియం జోన్సు మహాశయుడు కావించిన సంస్కృత భాషాన్వేషణంతో కొంత సడలింది. ఇండో యూరోపియన్ భాషలకుగల మూలభాషను పునర్నిర్మాణం చేయాలనే కుతూహలం పెంపొందింది. దీనితో ఆధునికభాషాశాస్త్రం ఆరంభమైంది. ఫ్రెడరిక్ వోన్ ష్లెగెల్ 'భారతీయుల భాషా వివేకాల'నుగూర్చిన (On language and wisdom of Indians) సిద్ధాంతవ్యాసం వెలువడింది. దీనితో తులనాత్మకవ్యాకరణావిష్కృతి జరిగింది. ఆ తరువాత అచిరకాలంలోనే 'ఫ్రాంజ్ బాప్' రచించిన 'సంస్కృత క్రియావిభక్తి విధానం'అనే మహాగ్రంథం వచ్చింది. తరువాత సరిగ్గా నూరేండ్లకు నిర్మాణ భాషాశాస్త్రానికి భానూదయ మనదగిన ఫెర్డినాండ్ దే సస్సూర్ విరచిత 'సామాన్యభాషాశాస్త్ర గ్రంథం' వ్యాప్తిలోకి వచ్చింది.

బాప్ అతని అనుచరులు; ముఖ్యంగా ఆగస్ట్ ఫ్రెడిచ్‌పాత్, జాకోబ్‌గ్రిమ్, ష్లేచర్, కారల్ బ్రగ్‌మన్, హెర్మన్ పాల్ మొదలైనవాళ్లు తమకున్న ఇండోయూరోపియన్ భాషాపరిజ్ఞానబలంతో జర్మనిక్ భాషాతత్వాన్ని మనస్సుకు హత్తుకొనేటట్లుగా చిత్రించారు. వీరి యీ కృషి నాధారించుకొని, ఎందరెందరో రోమాన్స్, స్లావోనిక్, కెల్టిక్‌భాషల్లో అద్భుతమైన పరిశ్రమ చేసారు. పశ్చిమఆసియా, యూరప్‌ఖండాల్లోని భాషలకున్న విశాలమైన సంబంధాల్ని విశదీకరించారు. ఐదువేలసంవత్సరాలనాటి ప్రాచీన ఇండోయూరోపియన్ భాషా నిర్మాణానికి సముచితము సాహసోపేతమునైన ప్రయత్నాలెన్నోజరిగాయి. ఎన్నోపదరూపాలు నిర్ణయింపబడ్డాయి. ఎన్నింటికో ప్రకృతి ప్రత్యయ విభాగాదులు కావింపబడ్డాయి. వాక్యపదనిర్మాణరీతులు విశదీకరింపబడ్డాయి. ఎన్నో ధ్వనిసూత్రాలు నిర్మితమైనాయి. ఏయేకాలాల్లో అవి అనువర్తించిందికూడా నిర్దేశింపబడ్డాయి.

19 వ శతాబ్దపు తులనాత్మక భాషావేత్తల మేధాశక్తి చాల నిశితమైంది. ప్రశంసనీయమైంది. అయినా ఆధునికప్రమాణాలనుబట్టి వారి కృషిలో రెండు ముఖ్యలోపాలు గోచరిస్తున్నాయి. (1) వారు అక్షరాలకు ఉచ్చారణలోని ధ్వనులకు భేదం గుర్తించక ఒకదానికొకటి పొరబడటం (2) పరిశీలనకన్న ఊహాపోహాలతోనే వారు సంతృప్తిపడటం.

ఉచ్చారణంలోని మార్పులు ప్రజల జిహ్వాధరాదులపై కల్గేవికాని పుస్తకాల పుటల్లోవికావు. అందువల్ల భాషాపరిణామాలంటే ఉచ్చారణనే ప్రధానంగా పరిగణించాలి. ఊహాపోహలు పదాల వ్యుత్పత్తి నిరూపణంలోను ఎక్కువగా ప్రదర్శింపబడ్డాయి. పదాల వ్యుత్పత్తి అంటే వాటి పుట్టుక పరిణామాలు; వాటి పూర్వ పూర్వ రూపాల్ని నిరూపించటం. అంతేకాని నక్కేది నక్క, కుక్కేది కుక్క అనే రీతిగా వ్యుత్పత్త్యర్థాలు ఊహించటం హాస్యజనకమౌతుంది. ఇటువంటి వ్యుత్పత్తుల్ని కల్పించి హాస్యభాజనుడు కావటానికి ఆధునికభాషాశాస్త్రజ్ఞుడుద్యుక్తుడు కాడు. అర్థనిర్ణయం చాలా క్లిష్టమైంది. అది అనేక సాంఘిక, చారిత్రక, మానసిక క్లిష్టపరిస్థితులమీద ఆధారపడిఉంటుంది. ఇదమిత్థంగా చెప్పలేం. కాగా భాషాశాస్త్రజ్ఞుడు శబ్దపరిణామాన్నే ప్రధానంగా పరిశీలిస్తాడు. ఈవిధంగా అర్థవిపరిణామశాస్త్రం (Semantics) భాషాశాస్త్రంనుండి పృథక్కరింపబడ్డది.

అట్లాని భాషాశాస్త్రపరిశీలకుడు ఊహింపటానికే సాహసించడనుకోరాదు. ఏది 'ఊహో' ఏది 'భావనో' అతడు స్పష్టంగా గ్రహిస్తాడు. తన భావనకు ఊహకు ఆధారాల్ని నిరూపిస్తాడు. సందేహాస్పదంగా ఉంటే స్పష్టంగా చెప్తాడు. లేకపోతే ఇది 'నా ఊహమాత్రమే' అని ఉద్ఘాటిస్తాడు. అత్యధికమైన ఆత్మవిశ్వాసోత్సాహాలతో 19 వ శతాబ్దపు తుల్యభాషాభిజ్ఞులు తాము వివరించలేని అంశమేలేదని అనుకొన్నారు. అందువల్ల ముఖ్యంగా వ్యుత్పత్తుల నిర్ణయరంగంలో ఎక్కువగా దుష్ఫలితాలే చేకూరాయి. మూలమాతృకాపునర్నిర్మాణం విషయంలో వారు ప్రదర్శించిన సాహసాలు విమర్శకు గురికాక తప్పలేదు. ప్రాచీన ఇండోయూరోపియన్ భాష ష్లైచర్, బ్రగ్‌మన్ల మధ్యనున్న అచిరకాలంలోనే అపారంగా గుర్తించటానికి వీలులేనంతగా మారిపోయిందనే విమర్శకు లోనయింది. ప్రతి నిరుక్త సంపాదకుడు పదంయొక్క చరిత్రను మాత్రమే స్పష్టంగా ప్రదర్శించాలని అట్లా చేయలేకపోతే అతని కర్తవ్యంలో విఫలుడైనట్లేఅని భాషాశాస్త్రజ్ఞులుద్ఘాటించారు.

అమెరికాకు ఆంగ్లదేశానికి చెందిన 19 వ శతాబ్దపు ప్రఖ్యాత లిఖిత భాషాపరిశీలకు లనేకులు జర్మనీలో సుశిక్షితులైనారు. వీరిలో విలియం డ్వైట్ విట్నీ (1827-94), హెన్రీ స్వీట్ అనేవాళ్ళు ప్రముఖులు. విట్నీ బెర్లిన్‌లో బాప్ వద్ద అధ్యయనం చేసాడు. ఈయన అమెరికా ఖండంలోని భాషాపరిశీలనానికి చక్కని ప్రాతిపదిక వేసాడు.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన హెన్రీ స్వీట్, హాఁజ్‌మన్‌వద్ద శుశ్రూష చేసాడు. ఈయన ఆజీవితం జీవద్భాషానిశితపరిశీలనాప్రాముఖ్యాన్ని నొక్కివక్కాణించేవాడు.

జీవద్భాషను గూర్చిన ప్రత్యక్ష పరిశీలనా ప్రాముఖ్యాన్ని గూర్చి ఫెర్డినాండ్ దేససూర్ (1857-1913) కూడా గట్టిగా ఉద్ఘాటించాడు పారిస్‌లోను, జెనివాలోను ఈయన ఉపజ్ఞాపేతంగా భాషాధ్యాపకత్వం వహించాడు. తన జీవితకాలంలో ఈయన ఎక్కువగా వ్రాయలేదు జీవితానంతరం ఈయన ఉపన్యాసాలన్నీ ఈయన శిష్యులచేత ప్రచురింపబడ్డాయి ఇందులో విశేషమైంది 'సామాన్య భాషాశాస్త్ర పాఠాలు' అనే గ్రంథం. ఆధునిక భాషాశాస్త్ర వ్యవస్థాపకుడు 'ససూర్' అవటంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. ఈ గ్రంథంలో ఉన్న తొలి మూడు ఉపన్యాసాలు ప్రధానంగా నాలుగు సమస్యలకు సంబంధించేవి. (1) భాషకు భాషణకు గల సంబంధం. (2) అనూచానంగా భాషకు సంక్రమిస్తున్న సంపదలు ధ్వనించిన భాషణలో వానికిగల ఉపయోగం. (3) ధ్వని విభజనం. (4) వర్ణనాత్మక లేక ఏకకాలిక భాషాధ్యయన పద్ధతికి; చారిత్రక లేక భిన్నకాలిక భాషాధ్యయన పద్ధతికి గల తారతమ్యాన్ని భాషావ్యవస్థానిర్మితిని పరిశీలించటం.

ససూర్ బోధలు, అతని శిష్యవర్గంమూలంగా బహు ప్రాంతాల్లో బహుళ ప్రచారాన్ని పొందాయి

ఈ శిష్యసంతతిలో స్మరింపదగినవారు మెల్లెత్ (1866-1936); నికోలో త్రుబెక్‌కాయ్ (1890-1938); ఎడ్వర్డు సపీర్ (1884—1939) లియోనార్డు బ్లూమ్‌ఫీల్డ్ (1887-1949) మొదలైనవారు. సఫీర్, బ్లూమ్‌ఫీల్డులు ఆంగ్ల భాష కన్న, ఇతర ఇండోయూరోపియన్‌భాషలకన్న భిన్న మైన నిర్మాణరీతులుగల్గి, పరస్పరం సంబంధంలేని పెక్కు అమెరికన్‌ఇండియన్ భాషల్ని ప్రత్యక్షంగా పరిశీలించి విశేష ప్రయోజనాలను సాధించారు. చక్కని శిక్షణాత్మకమైన పటిష్టతతో వీరు అనేక పరిశోధనల్ని గవేషణల్ని విలక్షణంగా నిర్వహించారు. అప్పుడే అంటే 1925 లోనే 'భాష' అనే పత్రిక అమెరికా భాషాశాస్త్ర సంఘంవారిచేత స్థాపితమైంది. దాని తొలి సంపుటిలో సస్సూర్ వచించినట్లుగా అమెరికాలోని ఆదిమవాసుల భాషారూపా లనేకం వర్ణ నాత్మకంగా నిరూపితమైనాయి. ఈ పత్రిక ద్వితీయ సంపుటిలోనే (1926) బ్లూమ్‌ఫీల్డు రచించిన 'భాషాశాస్త్రాని కవసరమైన కొన్ని అపూర్వ ప్రతి పాదనలు' (A set of postulates for the science of language) అనే అద్భుతమైన వ్యాసం ప్రచు రింపబడ్డది. ఇందులో గణితశాస్త్ర నియమాలు సాహసంగా భాషకు కూడా అనువర్తింపబడ్డాయి. ఎందుకంటే ఈ 'నిరాధార ప్రతిపాదన పద్ధతి' ఆధునిక భాషాధ్యయనాన్ని ముందుకు తీసుకుపోతు దని బ్లూమ్‌ఫీల్డ్ భావించాడు ఇందుమూలంగా మన అనుమానాల్నీ స్పష్టంగా ఉద్ఘాటింపబడతాయి. కల్పింపబడ్డ సంజ్ఞలన్నీ బాగా నిర్వచింపబడతాయి. ఏవి స్వతంత్రంగా నిలబడగల అంశాలో, పరస్పర సహాయంతో నిలిచేవి ఏవిటో స్పష్టమౌతాయి. బ్లూమ్‌ఫీల్డు రచించిన 'భాష' అనే ఉద్గ్రంథం (1933) భాషాశాస్త్రాధ్యయనానికి మార్గదర్శక మైంది. అంతర్జాతీయ భాషాశాస్త్రజ్ఞులు సమా వేశాల్లోను, ఇతర చర్చావేదికల్లోను, సభల్లోను ఉత్పన్నమయ్యే అనేక భాషావిషయకసమస్యల్ని ఈ గ్రంథం పరిష్కరిస్తుం దనవచ్చు.

కొన్ని భాషలు చాలా పరిమితమైన సంఘం చేతనే వ్యవహృత మౌతున్నాయి. వాటి మనుగడ అస్పష్టంగా వుంది. ఆఫ్రికాలోను, ఆసియాలోను, అమెరికాలోను అనేక భాషలు ఏ సమర్థుడైన భాషా శాస్త్రజ్ఞుడయినా తగురీతిని లిఖితం చేయకపోతే ఈ 20 వ శతాబ్దాంతంలోనే రూపుమాసిపోతాయి. ఈ ఉన్నభాషలు కూడా నిరంతరం పరిస్థితుల కను కూలంగా మార్పులకు లోనౌతున్నాయి. మార్పు అనేది భాషయొక్క జీవలక్షణాన్ని ప్రకటిస్తున్నది. ప్రపంచంలో గొప్ప భాషలుగా పరిగణింపబడుతున్న ఆంగ్లం, రష్యన్, చైనీస్, జపనీస్, జర్మన్, స్పానిష్ ఫ్రెంచ్, ఇటాలియన్, పోర్చుగీస్, డచ్, అరబిక్ మున్నగుభాషలు స్వాహిలి, తమిళం లాగానే మార్పులకు గురిఅవుతునేవున్నాయి. సనాతన హైందవులు మత సంబంధంగా ఉపయోగించుకొనే సంస్కృతంలోను; బౌద్ధమత భాషయైన పాళిలోను; రోమన్ క్రైస్తవ భాషయైన లాటిన్‌లోను మార్పు అనేది కృతకంగాను మందగొడిగాను కనుపట్టవచ్చు. కరడుగట్టిన ఇట్టి భాషారూపాల్ని నిరంతర శిక్షణ ముఖంగా వ్రాయ గల్గటంగాని చదవగల్గటంగాని లేదా వాటితో సంభా షించ గల్గటంగాని జరగవచ్చు. భాష మారేస్వభావం కలదనే సామాన్య నియమానికి సంస్కృతం, పాళి, లాటిన్ భాషలు ఆశ్చర్యకరమైన అపవాదాలుగా పరిగణింపవచ్చు. ఇట్టి అపరిణామశీలానికి కారణాలు రెండు. (1) ఇవి దైనందిన జీవితంలో సామాన్యంగా సంభాషణాత్మకంగా లేకపోవటం. అంతేగాక విశేష సౌకర్యోపేతమైనట్టి పూజారివర్గానికో లేక పండిత వర్గానికో పరిమితమై ఉండటం. (2) అత్యంత ప్రాచీనమైన వాఙ్మయం వీని కుండటం. సకల మత పూజా కార్యకలాపాలు ఈ భాషల్లోనే నిర్వర్తింప బడటం. మార్పు అనేది మహాపాతకంగా పరిగణింప బడట 'వొలపక్' 'ఎస్పరాన్టో' 'ఇడో'వంటి కృతక భాషలకు ఇటువంటి లక్షణాలు అనువర్తించవు. అవి ఎంత జాగ్రత్తగా నిర్మింపబడి రూపొందింపబడినా అవి జీవద్భాషలు కాజాలవు. అయినా అవి మార్పు చెందకుండాను ఉండలేవు. ఇంచుమించుగా ఒక వంద కృతకభాషల్ని ఈ మధ్యకాలంలో మేధావులు నిర్మిం

వారు. కాని పైని పేర్కొన్న మూడు భాషలు మాత్రమే తక్కినవాటికన్న విశేష ప్రాచుర్యాన్ని, విస్తృతిని పొందాయి. 'వొలపక్' అనే మాటకర్థం ప్రపంచభాష అని. దీన్ని కల్పించినవాడు జూహాన్ మార్టిన్ ష్లెయర్ అనే బవేయర్ చర్చి అధికారి. 1879 లో ఇది కల్పించబడ్డప్పు డిది విశ్వవ్యాప్తంగా మానవభాష కాగలదని అందరు ఉత్సాహంతో భావించారు. కాని ఎనిమిది సంవత్సరాల తర్వాత దీన్ని గాఢంగా అభిమానించినవాళ్లే విసర్జించారు. పోలిష్ జ్యూ అయిన లా జరస్ జయొన్‌హోఫ్ (1857—1917) అనే అతడు రూపొందించిన 'ఎస్పరాన్టో' భాషపట్ల వీరు ఆసక్తి చూపించారు. నిజాని కిది 'వొలపక్'కన్న మిన్నగా విరచితమైంది యనక తప్పదు. ఇందలి రూపాలు నియతమైనవి జటిలం కానివి. ఇందులో లాటిన్ ధాతువులకు ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీషు శబ్దాలు చేర్చబడ్డాయి. సమాసాలు, జన్యపదాలు స్వేచ్ఛగా చేకూర్చబడ్డాయి. నామములన్నీ ఒకారాంతాలు. విశేషణాలన్నీ అకారాంతాలు. క్రియావిశేషణాలన్నీ ఎదంతాలు. భావార్థకాలన్నీ ఇదంతాలు. మధ్యమ పురుషలన్నీ ఉదంతాలు. ఈవిధంగా నియమా లెన్నో ఏర్పఱచబడ్డాయి. అయినప్పటికి 1907 లో 'ఇడో' భాషానిర్మాణం జరిగింది. 'ఇ' అంటే 'ఇంటర్ నేషనల్' 'డ' అంటే డెలిగేషన్ అని అర్థం; 'ఓ' అనే అంతిమ స్వరం నామవాచక సూచకం. ఈ అంతర్జాతీయ ప్రతినిధుల మహాసభలో బహుముఖశాస్త్రకోవిదు లున్నారు. కాని వీరి ప్రతిపాదనల్ని ఇస్పరాన్టో భాషాభిమానులు బలపరచలేదు. అప్పటికే బాగా పరివపాతనాల్లో వున్న వాళ్ల పాఠ్యగ్రంథాలు వృథా అయిపోతాయని బాధ చెందారు. ఏమైనా నేడు 'ఇడో' కన్న ఎస్పరాన్టోయే అనేక అంతర్జాతీయ సమావేశాల్లో విశేషంగా ఉపయుక్తమౌతున్నమాట నిజం. అంతమాత్రంచేత సహజమైన భాషల్ని అణచి వాటి స్థానాన్ని ఆక్రమించాలనే ఆసక్తి ఈ కృతకభాషకు లేదు. అట్టి శక్తి ఉన్నదనికూడా భావించరాదు.

20 వ శతాబ్దంలో మానవకల్పితమైన కొన్ని యితర భాషలు:—

పియానోఅనే అతను (1903) కల్పించిన లాటినో సినిఫ్లెక్సోన్; ఆటో జస్పర్‌సన్ కల్పించిన నొ వైల్ (1928); హోగ్‌బెన్ కనుగొన్న ఇన్‌టర్‌గ్లోస్స (1943); అంతర్జాతీయ సహాయ భాషాసంఘంవారు కనుగొన్న ఇన్‌టర్ లిన్‌గ్వా (1951)–వీని అన్నింటిలో ఎస్పరాన్టోయే ప్రపంచమానవుని కొక భాషా సేతువుగా ఉండి అనేక క్లిష్టసమయాల్లో సముచితంగా సాయపడుతుందని చెప్పక తప్పదు. ఎస్పరాన్టోను నేర్చుకోటం చాలా సర్దాగా వుంటుంది. దానిలో నియతంగాజేరే ప్రత్యయాలను, ఔపవిభక్తుల్నీ, ఊహించటం బుద్ధిబలాన్ని పెంపొందించే గారడీయే అవుతుంది ఇలాంటి భాషపట్ల ఎంత మమకారం ఉన్నవాళ్లయినా సంప్రదాయప్రీతి గలవారై తదనుసారంగానే వర్తించటాని కుద్యుక్తులు కావటం సహజం. సంఘం ఎంతగా మారకుండా ఉండాలని ఆశించినా భాష ఎప్పుడు, ఎక్కడ మారుతూ ఉండటం తథ్యం. అంతులేని అవకాశాలు హద్దులేని ఉత్సాహం గల్గిన ఈ క్రొత్తజగత్తులో కొంతమంది ఎస్పరాన్టోను నిత్యం వాడుకోవటం ప్రారంభించారు. అందుచేత అది కూడా కొద్ది వ్యవధానంలోనే సంఘాని కనుకూలంగా కొన్ని మార్పులకు గురికాక తప్పలేదు అమెరికన్‌గాని, రష్యన్‌గాని ఒకరితో ఒకరు ఒక యాత్రనుగూర్చిగాని, ఆహారాన్నిగురించికాని, దుస్తులు, ఆటపాటలు మున్నగువాటినిగూర్చిగాని హాయిగా ఎస్పరాన్టోభాషలో సంభాషించుకోవచ్చు కాని శాస్త్రాన్ని గూర్చికాని, మతాన్నిగూర్చిగాని, తత్వాన్నిగూర్చికాని ఆ భాషలో వాదించుకోవాలంటేమాత్రం సాధ్యపడదు.

మానవులు ఊహించగలవారు. వారికి భాషపై కొంతఅధికారం ఉందని, ఎంతఉన్నా భాష వారి మానసికస్థాయి నతిక్రమించే ఉంటుందని బేకన్ పండితుడంటాడు. మన కిష్టంఉన్నా లేకున్నా మన సంఘంలో వ్యవహృతమౌతున్న మన ప్రాంతీయభాష పట్లనో, మాతృభాషపట్లనో, వల్లమాలిన అభిమాన

పాశాలచేత మనం బంధితులమై ఉన్నాం. మన ఈ సత్యాన్ని గుర్తించాలి. సత్యం తెలుసుకుంటే మనకు స్వేచ్ఛ లభిస్తుంది. ప్రపంచం అనేకవిధాల సన్నిహితమౌతున్నది. భాషమూలంగా అది ఎన్నడూ దూరంకాగూడదు. ఈ అవరోధాన్ని అతిక్రమించగల బుద్ధికుశలత, నైశిత్యం మానవునికి లేకపోలేదు. అట్టి కౌశలాన్ని భాషాశాస్త్రం మానవునకు ప్రసాదించగలదు. ఈ సత్యం ఎంతగా స్పష్టంగా సాక్షాత్కరిస్తే అంతగా భాషాసహజవ్యవస్థను సుకరంగా మానవుడు గ్రహించి తన సహోదరులతో చేయి కలపగలుగుతాడు. 56 గంటల్లో ఏభాషావ్యవస్థనైనా సుబోధం చేయించే పద్ధతుల్ని అమెరికాఖండంలోని భాషాశాస్త్రజ్ఞులు అవలంబిస్తున్నారు. అట్టి విధానాలు అన్నిదేశాలవారు అనుసరించాలి. అట్టి అవసరం నేడు కలిగినంతగా ఇంతకుముందెన్నడూ కలుగలేదని అనవచ్చు. దేశ సమైక్యానికి, ప్రపంచ సమైక్యానికి భాష అవరోధం కారాదు.

### ఈ రచనకు ఆధారాలు

(i) Language in the Modern world - Simeon Potter. (ii) Language - Bloomfield.

---



# కాటమరాజు కథ - చారిత్రక సంశయములు

డా. తంగిరాల వెంకటసుబ్బారావు

కాటమరాజు—నల్లసిద్ధుల గూర్చిన చారిత్రకాంశములను మొట్టమొదట తడవినవారు శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు. ఈమె 1947 లో రచించిన తన పరిశోధక వ్యాసమున అలవులపాడు యాదవులను గూర్చియు ఎఱ్ఱగడ్డపాడు యాదవులను గూర్చియు చర్చించిరి.[1] కాని యశోదాదేవిగారు కేవలము గుండ్లపాలెములో లభించిన ఒక శాసనము బట్టియు, ఇతర స్థానిక చరిత్రలనుబట్టియు ఈ యాదవ చరిత్రలను చర్చించిరి. కాటమరాజునకు సంబంధించిన వీరగాథల నీమె పరిశీలించినట్లుగా లేదు. (1947 నాటికి కాటమరాజు వీరగాథ లేవియును ముద్రింపబడలేదు). అందుచే ఈమె యిచ్చిన అంశములలో కొన్ని లోపములు దొరలినవి.

నెల్లూరుచోళరాజ్యములోనేయున్న అలవులపాడును వల్లురాజు అలపోలురాజు పాలించిరనియు, ఎఱ్ఱగడ్డపాడును కాటమరాజు పాలించెననియు యశోదాదేవిగారు వ్రాసిరి. అలపోలురాజు నెల్లూరు నేలిన తెలుగు చోళులలో మూడవ మనుమసిద్ధితో పుల్లరి విషయమై పోరాడెననియు, ఆ యుద్ధము క్రీ. శ. 1259 లో లింగాలకొండ— ఎఱ్ఱగడ్డపాడు దగ్గఱ జరిగెననియు, నల్లసిద్ధియు మనుమసిద్ధియు ఒక్కరేయనియు, అతని కాలము క్రీ. శ. 1248–1267 అనియు యశోదాదేవిగారు తెల్పియున్నారు. ఇది యంతయు అలవులపాడు యాదవుల గూర్చిన వృత్తాంతములో నిచ్చిరి. మరల ఎఱ్ఱగడ్డపాడు యాదవులను గూర్చి వ్రాయుచు కాటమరాజు మూడవ మనుమసిద్ధి లేక మూడవ నల్లసిద్ధితో పుల్లరి విషయమై పోరాడెనని తెల్పిరి. వల్లురాజుకూడా మనుమసిద్ధితో పోరాడెనని తెల్పిరి. కాని వల్లురాజునకును అలపోలురాజునకును గల సంబంధమును గూర్చికాని, వీరిరువురితో కాటమరాజునకుగల సంబంధమును గూర్చికాని తనకు తెలియదనిరి. ఎఱ్ఱగడ్డపాడు అనునది గుంటూరు మండలమున ఒంగోలు తాలూకాలో నున్నదనిరి. వ్యక్తుల నామములు కూడ తప్పుగా నిచ్చిరి. అవుల పోలురాజును 'అలపోలురాజు' అనియు, కరియావులరాజును 'కరియొరరాజు' అనియు, కాటమరాజును 'కంటమరాజు' అనియు తెల్పిరి. అలపోలురాజు కాటమరాజు కాకతి గణపతిదేవుని కాలమువారని చెప్పిరి. గుండ్లపాలెము శిలాశాసనములో ప్రతాపుని పేరుండుట పొరపాటనిరి. గణపతిదేవుడు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో అలపోలురాజునకు సహాయము చేసెనట.

కాటమరాజు కథాక్రమము పరిశీలించినచో యశోదాదేవిగారు వెలిబుచ్చిన అభిప్రాయములు చాల వఱకు నిలువజాలవు. వల్లురాజు కాటమరాజునకు పితామహుడు. ఇతడు 'యలమంచి'ని పాలించెనుగాని, 'అలవులపాడు'ను పాలించినవాడు కాడు. ఈ 'యలమంచి' నేటి విశాఖమండలమున 'ఎలమంచిలి' అను పేరుతో నున్నదికావచ్చును. వల్లురాజు కొడుకు పెద్దిరాజు పెద్దిరాజు కొడుకు కాటమరాజు. పోలురాజు పెద్దిరాజునకు తమ్ముడు; కాటమరాజునకు పినతండ్రి. ఇతడు సిద్ధిరాజుతో యుద్ధమొనర్చెననుట సరికాదు. ఈ పోలురాజు నల్లసిద్ధి పూర్వుడైన చోడానితో పోరాడి చనిపోయెను. నల్లసిద్ధితో యుద్ధముచేసినది కాటమరాజొక్కడే! ఇతని తాత వల్లురాజును, పినతండ్రి పోలురాజును నల్లసిద్ధితో పోరిరనుట అసం

---

1. చూ. రాజమండ్రి ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘమువారి పత్రిక, సంపుటము 23, పుటలు 12–14.

గతము. వీరు నల్లసిద్ధికంటె పూర్వులు. తమ పితామహుడగు ఆవుల వలురాజా పేరుతో కాటమరాజాదులే 'అలవులపాడు' గ్రామమును నిర్మించియుందురు (అదియే నేటి 'పెదఅలవలపాడు') ఇది ఎఱ్ఱగడ్డపాడునకు మిక్కిలి సమీపమున యున్నది కాబట్టి అలవులపాడు నేలిన యాదవులు వేఱనియు, ఎఱ్ఱగడ్డపాడును పాలించిన యాదవులు వేఱనియు భావించుట సరికాదు.

కాటమరాజు పాలించిన ఎఱ్ఱగడ్డపాడు కనిగిరి తాలూకాలో పెదఅలవలపాడు గ్రామమునకు సమీపమునగల పంచలింగాల కొండకు ఉత్తరభాగమున నున్న పాలేటి తీరమేకాని, ఒంగోలు తాలూకాలోనున్న ఎఱ్ఱగడ్డపాడు గ్రామమనుట సరికాదు. యుద్ధభూమియగు ఎఱ్ఱగడ్డపాడు కనిగిరిసీమలో పంచలింగాల కొండ ప్రక్కనే యున్నదికాని గుంటూరు మండలమునలేదు. మెకంజీ వ్రాతప్రతులలో రణరంగము గుంటూరు మండలమున అమరావతి దగ్గఱ అనియున్నది.[2] ఇది మిక్కిలి హాస్యాస్పదము. కనిగిరికి తూర్పుగా పదిపండ్రెండు మైళ్ల దూరములో పంచలింగాల కొండ యున్నది. ఆ కొండ దిగువనే కాటమరాజు కోట, యుద్ధభూమియగు ఎఱ్ఱగడ్డపాడును గలవు.

యశోదాదేవిగారు మనుమసిద్ధియే నల్లసిద్ధియనుట, యుద్ధకాలము క్రీ. శ. 1259 అనుట, ఇది గణపతిదేవునికాలమున జరిగెననుట, ఎఱ్ఱగడ్డపాటి యుద్ధమున ఈ గణపతిదేవుడు అలపోలు రాజునకు సహాయము చేసెననుట సంశయాస్పద విషయములు.[3] చోడతిక్కని పుత్రుడైన మనుమసిద్ధికి ముగ్గురు కొడుకులనియు అందు రెండవవాడు నల్లసిద్ధియనియు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలుపుచున్నారు[4] గుంటూరుజిల్లా నరసరావుపేట శాసనము కూడ దీనిని బలపఱచుచున్నది. వీరగాథలో నెచ్చటను మనుమసిద్ధి పేరులేదు; 'నల్లసిద్ధి'అనియే కలదు కాబట్టి మనుమసిద్ధి కుమారుడైన నల్లసిద్ధి కాలములోనే (అనగా క్రీ. శ. 1280—97 మధ్య కాలములోనే) ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట జరిగినదని చెప్పవలెను. క్రీ. శ. 1282 యుద్ధకాలమని శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు నిర్ణయించినారు.[5] కాటమరాజును నల్లసిద్ధియు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమువారనుటకు గుండ్లపాలెము శాసనమేగాక, 'కటీయావులరాజుకథ'అను వీరగాథయు సాక్ష్యమిచ్చుచున్నది. (ఈ వీరగాథయొక్క తాళపత్రప్రతి నాకు లభించినది.) తెలుగుచోళులు మొదట పల్లవసామంతులైనను తరువాత కాకతీయ సామంతులు. ముఖ్యముగా చోడతిక్కరాజును (క్రీ. శ. 1209—1258), అతని పుత్రుడు మనుమసిద్ధియు (1258 1290) గణపతిదేవునకు విశ్వాసపాత్రులగు సామంతులు. వీరికి వ్యతిరేకముగా గణపతిదేవుడు యాదవులకు సహాయము చేసెననుట సరికాదు. యాదవులకును కాకతీయులకును అనాదిగా వైరములున్నవి గణపతిదేవుని తండ్రియగు మహాదేవుని

2. 'Mackenzie Mss. say that Katamaraju was the ruler of Amaravati and yerragaddapadu and that the site of the battle was located in the vicinity of Amaravati.'

—J. A. H. R. S., Vol. xxiii, P 14.
(Taylor, Mac. Cat. I P 725, 727.)

3. 'The date of the battle is A. D. 1259. Nallasiddha is identical with Nallasiddha III alias Manmasiddha II (A D 1248—1267) and Siddiraja of the Gundlapalem record is identical with Manmasiddha III. Sewell is wrong in placing Siddiraja and the Yadavas in 12 th Century A.D......The Kakatiya ruler in the period was Ganapati. Pratapa in the Gundlapalem inscription is a mistake for Ganapati. Probably, Alapolu had the support of the Kakatiyas in opposing Manmasiddha III.'

—J. A. H. R. S., Vol. xxiii, P. 13.

4. చూ. కాటమరాజుకథ, పీఠిక, పుట xxvii, మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార ప్రచురణ, 1953.

5. చూ. భారతి, జూలై 1966.

దేవగిరియాదవులు చంపిరి. కాబట్టి శ్రీమతి వారణాసి యశోదాదేవిగారిచ్చిన చారిత్రక విషయములు— ముఖ్యముగా యాదవులకు సంబంధించినవి సందిగ్ధముగా మన్ననికాని స్పష్టముగాలేవని చెప్పవలెను. ఈమె వీరగాథలను పరిశీలింపకుండుటయే యీ సందిగ్ధతకు కారణము.

చారిత్రక విద్వాంసులు, విమర్శకులు కాటమరాజు కథాచక్రముయొక్క చారిత్రకమగు విలువను శంకించుట విచారకరము. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కాటమరాజుకథనుగూర్చి యిట్లనినారు :

'Though the story is very interesting it lacks historicity. Except the names of Nallasiddhi and Khadga Tikkana, there is nothing historical in this work. The story might be true; but there is no evidence to prove its historicity. Nor is there any evidence to show that the persons mentioned either on the side of Katamaraju or on the side of King Nallasiddhi are historical.'6

చారిత్రకు లిట్లనుమానించుటకు కారణమున్నది. ఈ కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలుండగా, ఈ చారిత్రకులకు పండితులకు తెలిసిన కథలు మూడు నాలుగు మాత్రమే. ఈ సుదీర్ఘ కథాచక్రమందలి వివిధకథలను వ్యక్తులను పరిశీలించి నిర్ణయము చేయవలెనుగాని, యేవియో రెండుమూడు కథలనుబట్టి సిద్ధాంతములు చేయరాదు. నాకు లభించిన 'కటియాపులరాజుకథ' అను వీరగాథలో ఓరుగంటి ప్రతాపరుద్రునికాలమున అయితమరాజు, పల్లికొండ, కటియాపులరాజుఅను ముగ్గురు యాదవ వీరులు శంభుని తిరునాళ్లను జూచుటకై ఓరుగల్లు నగరమునకు వచ్చిరనియు, అచట సాహసకృత్యములను చేసిరనియు, ప్రతాపరుద్రుడు వారిని చంప యత్నించెననియు స్పష్టముగా నున్నది. దీనినిబట్టి కాటమరాజు కథలు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునాటి వనుట నిస్సంశయము కదా!

ఆంధ్రదేశ చరిత్రలో ప్రధాన రాజవంశములను గూర్చియే యింతవఱకును పరిశోధన జరిగినది కాని సామంత రాజవంశములకును, చిన్న చిన్న రాజవంశములకును సంబంధించిన చరిత్ర చీకటిలోనే మూలుగుచున్నది. శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు సామంత రాజన్యుల చరిత్రపై పరిశ్రమించినట్లుగా, నేటి చరిత్రకారులు ఒక్కొక్కమండలముమగూర్చి సమగ్ర పరిశోధన జరుపవలెను అప్పుడుకాని వీరగాథలలోని సంఘటనలకు చారిత్రక ప్రామాణ్యము లభింపదు. వీరగాథలన్నియును స్థానిక సంఘటనలపై ఆధారపడి పుట్టునుగాని, పెద్ద పెద్ద రాజవంశముల మహాయుద్ధములపై వీరగాథ లేర్పడవు. (బొబ్బిలి యుద్ధముపై వీరగాథ యున్నదికాని, తల్లికోట యుద్ధముపై వీరగాథలేదు కదా!). కాబట్టి యిట్టి సూక్ష్మ చారిత్రక పరిశోధన మత్యవసరము. అట్టి పరిశోధన జరుగు వఱకును, కాటమరాజుకథయొక్క చారిత్రక ప్రామాణ్యమును శంకించుటకు ఏ చరిత్రకారునకును అధికారము లేదు!

వీరగాథలు కేవలము పుక్కిటిపురాణములైనచో ప్రజల హృదయముల నుఱ్ఱూతలూగించుచు, వీరసావేశమున శివమెత్తించు శక్తి వానికుండదు. పౌరాణిక గాథను పాడునప్పుడు, స్థానిక చారిత్రక వీరగాథను పాడునప్పుడున్నంత రసావేశముండదు. వీరగాథలలో ఎక్కువ భాగము చారిత్రకములే! అవి చక్రవర్తులకు సంబంధించిన చరిత్రలు కాకపోవచ్చును. తెలుగు గడ్డపై స్థానికముగా ప్రసిద్ధికెక్కిన కొండలు సామంత రాజన్యుల, పాళెగాండ్ర, జమీందారుల, శూరుల, సాహసుల, బందిపోట్ల వీరసాహస కృత్యముల నభివర్ణించు చరిత్రలనుటలో మాత్రము సందేహము లేదు.

నల్లసిద్ధి చోడరాజని చరిత్రలోను, స్థానిక చరిత్రలలోను, కైఫీయతులలోను నుండగా; గాథా

6. KATAMARAJU KATHA, Preface P xi, Madras Government oriental Series No. XCI, 1953

కర్త వల్లసిద్ధిని పల్లవరాజనుట [7]పొరపాటు కావచ్చును. మన కవులకు ఉత్తరాది రాజులందఱును అయోధ్యరాజులైనట్లే, దక్షిణాది రాజులందఱును పల్లవులుగనే కాన్పింతురు. గాథాకర్త చోళుడైన వల్లసిద్ధిని పల్లవరాజుగా పేర్కొనుటకుగల కారణమును డాక్టరు బి రామరాజుగారు చక్కగా నూహించిరి: 'ఖడ్గతిక్కన వల్లసిద్ధిని వలుమారీ గేయమున 'పల్లవనలసిద్ధి పట్టాభిరామ' అని సంబోధించినట్లున్నది. వల్లసిద్ధి నిజముగా చోళుడు. చోళులు పల్లవవంశముతరువాత నధికారమునకు వచ్చినారు. మొదట వీరు పల్లవులకు సామంతులై వారి బిరుదములను దాల్చియుందురు. ఇదియునుగాక, యాంధ్రదేశమందలి సామంతరాజ కుటుంబము లెన్నియో పల్లవులచే స్థాపింపబడినవని తెలియవచ్చుచున్నది. వారి గౌరవసూచకముగ పల్లవ బిరుదమును తెలుగుచోళులు దాల్చియుందురు. మొదటి కాకతీయులు తమ యేలికలైన పశ్చిమ చాళుక్య చక్రవర్తుల బిరుదావళిని దాల్చుట మన మెఱిగిన విషయమే'[8]

---

7. 'పల్లవ నలసిద్ధి! పట్టాభిరామ!!' — కాటమరాజు కథ, పుట 15.

8. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట 207.



# వాయులీనం

శ్రీమతి నాయని కృష్ణకుమారి

ఎడదతీగల సుస్వరాల్ని మాత్రమే
నీకు వినిపించడం నేర్చుకున్న
గాలి రివటలు
చల్లగా అతి మెల్లగా
నీలోపలి నాదాలను
నిపుణంగా పలికించినపుడు
లోకః ప్రస్పందిత
అవతలి గీతను దాటించి
నిన్ను నిశ్చలంగా నిలిపినపుడు
నీవు గుర్తించి
గుండెల్లో గుప్తంగా దాచుకున్న
అంకితాత్మని అంతర్యం
పొగమంచు తెరల వెనక
రేఖాచిత్రమై శోభిస్తుంది!
భయాల బరువుల ముసుగులు
సందేహాల తొందరలు
అన్నీ ఎక్కడివక్కడే పేరుకుని
అంతరంగాన్ని
యాతాయాత డోలా ఉద్వేలంగా
ఉల్లోల కల్లోలం చేసి విడిచినా
నిర్లక్ష్యాన్ని భజిస్తున్న నీవు
పొగమంచును
పొందిగ్గా గుప్పిట్లో పట్టాలని
ప్రయత్నిస్తున్నావా!

## వాయులీనం

తొలకరి తడుపుకు
పొగలుపొగలుగా పైకెగసే
మట్టివాసనలాంటి అతణ్ణి
మరింత దగ్గరగా కమ్ముకోవాలని
పరిశ్రమిస్తున్నావా!
నీ శ్రమ చూచి
నిర్విరామ తరంగ ఘోషలాంటి
నీ గుండెల్లోని ఆర్తి చూచి
నీకు కనపడని
కలువ రేకులంత కళ్ళువివళ్ళు
జాలివెలుగుల వెన్నెల దోనెలై
నీ వైపుకే పరిక్రమిస్తున్నాయని
భ్రమిస్తున్నావు కాదూ!
నీ యెడద వాయులీనమై
నిస్తంద్రంగా నినదించే
సమయం అదే సుమా!



# తెలుగులో సామ్యవాదం

"స్ఫూర్తిశ్రీ"

ఈనాడు సామ్యవాదం అనేమాట సామ్యంలేనంత ప్రచారాన్ని సాధించుకుంది అన్నివర్గాలవారూ అనన్యభక్తితో అనర్గళరక్తితో ఆరాధిస్తూ సేవిస్తూ ఉన్నారు. రాజకీయవాదుల్ని అడిగితే దీన్ని గురించి గంటల తరబడిగా, రోజుల తరబడిగా ప్రసంగాలు చెయ్యగలరు; చర్చావేదికలను అధిరోహించగలరు; వాదోపవాదాలను నిర్వహించగలరు. రాజకీయశాస్త్ర పరిభాషలో 'సామ్యవాదం' సబలమైన స్వామ్యం సంపాదించుకుంది; విస్తృతమైన పరిధిలో విహారంచేస్తూ ఉంది; వివిధ వర్గాలలో వివిధ భూమికలతో విచ్చలవిడిగా విహరించినా రిచ్చపడవలసిన అవసరం లేదు; అందువల్ల ప్రయోజనమూ లేదు.

ప్రస్తుతం నేను 'సామ్యం' అంటే 'సమత్వం' అన్న ఉద్దేశంతోనే వాడుతున్నాను భావార్థంలో త్వ. త—అనే ప్రత్యయాలు కలుగుతూ ఉంటాయి. కాబట్టి సమత్వం అన్నప్పటికీ, సమత అని అన్నప్పటికీ 'సమభావం' అనే అర్థం. రాజకీయ పరిభాషలోనూ ఈ వాదానికి వేదికగా ఉపచరించేది యీ అర్థమే. అయితే చుట్టుప్రక్కలకు విస్తరించడంలోనే కాస్త తేడాపాడాలు కనిపిస్తాయి. అయినా వాటి జోలికిపోయి, వాటి వివరాలను సేకరించి, మనం సాధించేదేమీ లేదు. కాబట్టి యీ వ్యాసానికి కేంద్రాన్ని నిర్ణయించుకుని, ఆ పరిధిలోనే పరిభ్రమించడం హద్దుల్ని కాపాడుకోవడం కాగలదన్న అభిప్రాయంతో దృష్టిని కొంచెం ప్రకృతానికి మళ్లించుకుందాము. ఎవరో మహానుభావుడు అననే అన్నాడు: 'ప్రకృత మనుసరామః పాయసం భక్షయామః' అని. అదే మనకూ కర్తవ్యం.

భాష భావవాహకమని అందరమూ అంగీకరించే విషయమే. అయితే మనకు కలిగిన భావాలను బట్వాడా చెయ్యడం వరకూ మాత్రమే భాషకున్న బాధ్యత అనుకుంటే, అదిమాత్రం సరియైనది కాదు. ఎందువల్లనంటే మన భాష మన భావాలకు రూపు దిద్దుతుంది. మన ఆలోచనలకు అద్దాన్ని పడుతుంది. మన భవితవ్యానికి కర్తవ్యాన్ని ప్రబోధిస్తుంది. మన సంస్కృతికి సంస్కారాన్ని సమకూరుస్తుంది భాషను బట్టి మన నైతిక ప్రవర్తనమూ, మన సామూహిక సౌశీల్యాన్నీ, మన సామాజిక దౌర్బల్యాన్నీ, మన మానసిక మూల్యాన్నీ నిర్ధారణ చెయ్యవచ్చు. ఇది చాలా మంది భాషాశాస్త్రవేత్తలు కంఠోక్తిగా అంగీకరించిన విషయమే. అందువల్లనే మనం భాషనుబట్టి 'సామ్యవాదం' ఎంతవరకు సాధ్యమవుతుందన్న సంగతిని మనలో మనం ఒకసారి ఆలోచించుకుందాము.

## 2

'సామ్యం' అని అన్నప్పుడు ఎక్కువ తక్కువలు లేకుండా ఉండడమని భావం. ఒకరు ఎక్కువ అనీ, ఒకరు తక్కువ అనీ అనిపించకూడదు. కాని ఆ 'కూడని యిది' మనకు అడుగడుగునా ప్రత్యక్షమవుతూనే ఉంటుంది. పెదవి కదిపినప్పుడల్లా లోలోపల ఒకరకమైన బెదురు పుడుతూనే ఉంటుంది. కొత్త వాళ్ళు ఎవరయినా ఎదురుపడితే 'నువ్వు' అనాలా? 'మీరు' అనాలా? ఏమనాలో కొంచెం ఆలోచించుకుంటేనేగాని తేలేవిషయంకాదు — అవతలి వ్యక్తి యిదేమీ పట్టించుకునే తత్వం లేనివాడయితేతప్ప. అయితే కొందరి విషయంలో అంత నిర్మమత్వం అల

వడకపోయినా, ఏదో అసహాయత్వంవల్ల కూడా వట్టించుకోకుండా ఉండవలసివస్తే రావచ్చు.

'ఏమండీ! ఏదో పనిమీద వచ్చినట్టున్నారు? ఏంకావాలి మీకు?' అని వివరినయినా అడిగామనుకుందాము. అవతలి వ్యక్తి 'అదేమిటి బాబూ! మీ కాళ్లదగ్గర బ్రతికేవాణ్ణి. నన్నంత మర్యాద చేస్తారేమిటి?' అని అంటాడనుకుందాము. అది అక్కడికి కొంత నయమే. అలా కాకుండా 'మా బ్రతుకే వేళాకోళం అయిపోయింది. మీరు అనవలసినవాళ్లూ మేము పడవలసినవాళ్లం'అని అన్నాడనుకుందాము. అంటే అవతలివ్యక్తి తప్పకుండా కష్టపెట్టుకున్నాడనే అర్థం. ఈ గౌరవవాచకం అతని పాలిటికి అగౌరవవాచకంగా మారిపోయింది.

'ఏమయ్యా! ఏమిటి క్షేమంగా ఉన్నావా?'అని ఎవరినయినా పలుకరించామనుకుందాము. మనం వేసిన కుశలప్రశ్నకు సంతోషించి అవతలివ్యక్తి 'బాగానే ఉన్నాను'అనో 'మీ దయవల్ల బాగానే ఉన్నాను'అనో అనిఉంటే సముదాచారాన్ని పాటించినట్టే. అలా కాకుండా కొంచెం ఉలిక్కిపడ్డట్టు కన్పిస్తే పొరపాటు జరిగిందనే అర్థం. కొందరయితే అసలు ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే 'నా క్షేమానికేం గాని నువ్వు క్షేమంగా ఉండాలనుకుంటే కాస్త మర్యాద నేర్చుకో'అని బాహాటంగా కుండ బ్రద్దలు కొట్టినట్టు అనేస్తారు. ఇంకా ఎంతదూరమైనా పోతారు. ఇక్కడి ఏకవచనప్రయోగం వాళ్లకు కష్టం కలిగించిందన్నమాట.

కొందరి విషయంలో బహువచనప్రయోగం కోపకారణమయితే, మరికొందరి విషయంలో ఏకవచనప్రయోగం కోపకారణమవుతూ ఉంది. 'ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు'అనీ, 'బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు' అని నమ్మి వ్యాకరణసమ్మతంగా మాటలాడినా కుమ్ములాట తప్పకపోవచ్చు. 'వ్యక్తికి బహువచనం శక్తి' అని అన్న వాక్యానికి అసలర్థం అనేక వ్యక్తులు కలిస్తే శక్తి కలుగుతుందన్నదే అయినా ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడు దానిలో అపూర్వమయిన ఒక అర్థవిశేషం ధ్వనిస్తూ ఉంది. ఒకే వ్యక్తికి బహువచనం వాడడం శక్తి కారణంగానే జరుగుతుంది. అది శారీరకమైన శక్తిమాత్రమే కానక్కరలేదు. వయసునుబట్టీ, జ్ఞానాన్నిబట్టీ, ధనాన్నిబట్టీ, కులాన్నిబట్టీ ఇంకా ఎన్నో రకాలుగా ఈ శక్తి పనిచేస్తూ ఉంటుంది.

## 3

ఇది కేవలమూ యుష్మదర్థకంలో మాత్రమే నిలిచిన స్వార్థంకాదు. అస్మదర్థకం ఏకవచనంలో 'నేను' అనీ, బహువచనంలో 'మేము' అనీ ఉంటుంది. ఈ రెండింటికీ మధ్యగా 'మనం' అనేది ఒకటి వక్తనూ శ్రోతనూ కలియ గలుపుకుంటూ ఉభయార్థకంగా వర్తిస్తూ ఉంటుంది. ఏకత్వసంఖ్యను బోధించేటప్పుడు 'నేను' అనీ, బహుత్వ సంఖ్యను 'మేము' అనీ, ఉభయార్థకమైనప్పుడు 'మనం' అనీ వాడడం సామాన్యవ్యవహారం. పైని చెప్పుకున్న శ్రీమంతులు ఈ సామాన్య సూత్రాలకు సంపూర్ణంగా విరుద్ధంగా వ్యవహరించడానికే—కట్టుబడ్డట్లై ఉంటారు. ఈసామాన్యసూత్రాలను అనుసరించే వాళ్లందరూ వట్టిసామాన్యులక్రిందనే పరిగణింపబడతారు. అందువల్లనే స్వయంగా మాన్యత్వం ఆపాదించుకున్న వాళ్లూ, ఇతరులవల్ల ఆ మాన్యత్వాన్ని సంపాదించుకున్నవాళ్లూ ఆ సూత్రాలు తమకు అపాత్రాలుగా పరిగణిస్తారు. విట్టనిలువునా ఒక్కడే కన్పిస్తున్నా 'మేము వస్తున్నాము. నువ్వు నడవ్వోయ్' అని అంటాడు. ఒక్కొక్కడు 'మేము' స్థానంలో 'మనం' అని వాడడంకూడా కద్దు. 'మనం తలుచుకుంటే కొండమీదికోతి దిగిరావలసిందే' అని ప్రతిజ్ఞలు పలుకుతాడు. ఇది అవతలివారికి తన ప్రజ్ఞ చూపించుకోవాలన్న అహంకారమేకాని, అవతలివాణ్ణికూడా తనతో కలుపుకోవాలన్న సహకారం ఎంతమాత్రమూ కాదు.

యుష్మదర్థకాలుగా ఏకవచనంలో 'నీవు'అనీ, బహువచనంలో 'మీరు'అనీ ఉన్నాయి. 'నీవు' వ్యవ

హోదాలో 'నువ్వు' అనిమారి పువ్వులాగా గుబాళిస్తూ ఉంది. కాని కొందరిని 'నువ్వు' అనిఅంటే గుమాయిస్తున్న సమయంలో తలుపులూ, కిటికీలూ అన్ని మూసిఉన్నగదిలో పెట్టినట్టే ఉక్కిరిబిక్కిరవుతారు. పోనీ! ఇందాకటినుంచీ చూచినపద్ధతిలో బహువచన రూపమయిన 'మీరు' వాడుకుంటే బాగుంటుందేమో అనుకుంటే దీనికిగూడా ముఖం ముడుచుకునేవాళ్లు ఉంటారు. అంతస్తులమీద అంతస్తులు పెంచుకుపోయే హోదాగలవాళ్ల అంతస్సును చేరి అలరించగలశక్తి 'మీరు' అనేమాటకు లేదు. 'నువ్వు' అనేది ఒక అంతస్తు వ్యక్తికి అన్వయిస్తుందనుకుంటే, ఆ పై అంతస్తు వ్యక్తికి 'మీరు' అన్నది అన్వయిస్తుంది. అంతకన్నా పై అంతస్తుమీద ఉన్న వ్యక్తికి 'తమరు' అనేది ఉపయోగిస్తేనేకాని ఉల్లాసం కలుగదు. నిజానికి ఇక్కడ హద్దులుదాటి దురాక్రమణ చెయ్యడం జరుగుతుంది. కొందరికి హద్దులు దాటితేనేకాని ముద్దుగా ఉండదు. అవధుల్లో సంచరించడం అసమర్థులు మాత్రమే చేస్తారనీ, సమర్థులైన వాళ్ళు స్వచ్ఛందంగా, యథేచ్ఛంగా విహరిస్తారనీ వాళ్ల అభిప్రాయం. అలా ఉండాలన్నదే వాళ్ల జీవితలక్ష్యం కూడా. ఇక్కడ యుష్మదర్థంలో వాడడానికి ఆత్మార్థకాన్ని కొల్లగొట్టడం జరుగుతూంది. ఏకవచనంలో 'తాను' అనీ, బహువచనంలో 'తాము' అనీ 'తమరు' అనీ ఉండగా బహువచన రూపాల్ని బలవంతంగా స్వాధీనం చేసుకుని యుష్మదర్థంలో ఊడిగం చేయిస్తున్నామన్న మాట.

అయితే యింకొక్క విషయముంది. అన్యార్థంలో ఈడు, ఇతడు, వాడు, అతడు మొదలయిన మాటలు వాడడం జరుగుతూ ఉంటుంది. వీటికింక గౌరవవాచకాలు కావాలనుకుంటే 'ఈయన, ఆయన' మొదలయిన విధంగా వాడుతూ ఉంటాము. అప్పుడు కూడా గౌరవభారం చాలదనుకుంటే చివర 'గారు' అని చేర్చి ఈయనగారు ఆయనగారు అని మాత్రమే అనడం జరుగుతుంది. పూర్వ పద్ధతిలో వీటికిగూడా బహువచన రూపమే వాటంగా వాడుకోవచ్చుననుకుంటే ఆ పాతపాట వీలుకాకుండా వచ్చింది. అంతవేటు కావాలనుకుంటే వీరు, వారు అని మాత్రమే బహువచన రూపాలు వాడడానికి వీలుంది. తక్కిన వాటికి ఆపాటి అవకాశం కూడా లేదు. అందువల్ల వాటిని అలా ఏకవచనం పాలుచెయ్యక తప్పడం లేదు.

ఇంక, పోతే, నామ స్వీకారం చేసినప్పుడు సగౌరవంగా 'గారు' అన్నది చేర్చుకోవడం జరుగుతుంది. రావుగారు, మూర్తిగారు, శర్మగారు—మొదలయిన విధంగా వాడుతూ ఉంటాము. అయితే కొందరికి ఈ గౌరవం గౌరవంగా తోచదు. వారెక్కిన అందలం దీనికి అందనంత ఎత్తున ఉంటుంది. అప్పుడు మరో మార్గాన్ని ఆశ్రయించక తప్పదు. అటువంటి సమయంలో పేరు చివర తదర్థకమైన 'వాడు' అనే సర్వనామానికి బహువచన రూపమైన 'వారు' చేర్చబడుతుంది. ఇంతమాత్రమే అయితే వారి నేర్పు తెలిసినట్టుకాదు. మన ఓర్పును పరీక్షించేవరకూ వాళ్లు విడవరు. ఇతరత్రా వాడినట్టుగానే, ఇక్కడకూడా ఏదో ఒక్క బహువచనరూపమే వాడితే అంత సంతృప్తిగా అనిపించదు. అందుచేత పేరుకో, తత్తుల్యమైన సంజ్ఞకో బహువచన రూపాన్ని కల్పించుకోవలసివస్తుంది. 'స్వామి' ఉంటే 'స్వాములు' అని కావాలి. అప్పుడు 'వారు' అని చేరిస్తే, వెనుకఉన్న ఉత్వానికి అత్వం ప్రాప్తించి 'స్వాములవారు' అన్నరూపం ఏర్పడుతుంది. అలాగే ఆచార్యులవారు, శాస్త్రులవారు మొదలయిన రూపాలు.

'ప్రభువు' వంటి కొందరు స్వయంగానే అంతటి ప్రాభవంకలవాళ్లు కావడంచేత కాబోలు 'ప్రభువువారు' అని అన్నప్పటికీ సరిపోతుంది. అయితే 'ప్రభువులవారు' అని కూడా అనవచ్చు; అన్నీ కలిసివస్తే అనిపించుకోవచ్చు. 'ప్రభువువారు' అని అన్నప్పుడు నామానికి బహువచనరూపమూ రాలేదు; ఉత్వానికి అత్వమూ రాలేదు.

ఇంక దొరవారు, రాజావారు మొదలయిన చోట్లకూడా పూర్వరూపం బహువచనాంతంకాదు; అయినా 'అకారం' చివర ఉండడంవల్ల వేరే

యింకేమీ మార్పు రాలేదు. దొరవారిని దొరగారనీ, రాజావారిని రాజాగారనీ అన్నా అనవచ్చు. అయితే కొంచెం గౌరవం తగ్గించినట్టే. శాస్త్రులు దీక్షితులు, పంతులు మొదలయిన శబ్దాలు బహువచనాంతాలే అయినప్పటికీ నామాంకితం కావడంవల్ల ఏకత్వ స్ఫురణకు లొంగిపోయాయి. అందువల్లనే 'శాస్త్రులుగారు' మొదలయిన రూపాలుకూడా ఏర్పడతున్నాయి. నిజానికి అంతగౌరవం ఇయ్యాలనుకుంటే 'శాస్త్రులవారు' అనే అనాలి. కాని కొంచెం తగ్గించి ఒకమోస్తరు గౌరవంతో నెగ్గించుకుపోదలచుకున్నప్పుడు 'గారు' చేర్చడం జరుగుతుంది; ఇప్పుడు వెనుకఉన్న ఉత్వానికి అత్వం రమ్మన్నా రాదు.

## 4

గౌరవవాచకాలు పురుషపరంగానే ఉంటాయనీ, స్త్రీలకు ఈ విషయంలో స్వామ్యంలేదనీ అనడానికి వీల్లేదు. అయితే ఒకరకమైన తేడామాత్రం ఉండనే ఉంది. పురుషులూ, స్త్రీలూ సర్వవిధాలగానూ సామ్యం ప్రకటించుకుంటున్న యీ కాలంలో నేను తేడాను తిరుగతోడుతున్నానని ఎవరూ భ్రమపడరని తలుస్తాను. సామాజికంగా ఒక వ్యవహారం సాగుతూ ఉన్నప్పుడు అది భాషలో ప్రతిఫలింపక తప్పదుకదా! దాన్ని యథాతథంగా పట్టుకోగలగడమే మన సాధన ఫలం.

ఒక విషయం చూద్దాము. పురుషవ్యక్తులను బోధింపవలసివచ్చినప్పుడు ఆ శబ్దాలను 'మహద్వాచకములు' అని అంటారు. స్త్రీలనూ, పశులనూ, జంతువులనూ, జడపదార్థాలనూ కలిపి 'అమహద్వాచకములు' అని అంటారు. 'మహత్' అంటే 'గొప్ప' అని అర్థం. అందువల్ల గొప్పవన్నీ మహద్వాచకాలనీ, అలాకానివన్నీ అమహద్వాచకాలనీ స్థూలంగా ఒక నిర్ణయం జరిగినట్టే తలపవలసి వస్తూంది. ఇందులో విచారణీయమైన విషయమేమిటంటే స్త్రీలను అమహద్వాచకాలుగా పరిగణించడమే. తరువాత యేం జరిగిందో యేమో! స్త్రీలను మహత్ శబ్దానికి స్త్రీలింగ రూపమైన మహతీశబ్దంలో పరిగణించడం జరుగుతూ ఉంది. అంటే మొదట్లో విభాగం ఏ రకంగా సాగినా, పురుషులతో సమానమైన మన్ననను స్త్రీలు కూడా సంపాదించుకోగలిగారన్నది యథార్థం.

ఇప్పుడింక గౌరవవాచకాల జోలికివచ్చి చూద్దాము. సాధారణంగా ఇది, అది అని ఏకవచనంలో స్త్రీని నిర్దేశించడానికి వాడడం జరుగుతుంది. అమహద్వాచకాలలోనూ వీటినే వాడుతూంటాము. అయితే వీటికి బహువచనంలో రెండు జంటల రూపాలు కలుగుతాయి. అమహత్తులయితే ఇవి, అవి అనేవి బహువచన రూపాలు. మహతీ వాచకాల కయినప్పుడు వీరు, వారు అనేవి బహువచన రూపాలు. అంటే స్త్రీ ఒక్కతెగా ఉన్నప్పుడు అమహత్తుతోనూ, పెక్కురతోఉన్నప్పుడు మహత్తుతోనూ జంట కలుపుతూ ఉందని తేలుతుంది. ఇది కొంచెం మెలికలు తిరిగింది. బహువచనంలో వీరు, వారు అన్న రూపాలుతప్ప ఇంకేమీ లేకపోవడంచేత ఏకవచనంలోనే అనేక దాలు గౌరవపదాన్ని అధిరోహించడానికి ప్రయత్నం చేస్తున్నాయి. 'అది' అనడానికి బదులుగా 'ఆమె' అనీ, 'ఆవిడ' అనీ వాడడం జరుగుతుంది. 'ఇది' అనడానికి బదులుగా 'ఈమె' అనీ 'ఈవిడ' అనీ అనడం జరుగుతుంది. ఇవి నిశ్చితంగా మహతీ వాచకాలు; ఏకవచన రూపాలు. వీటికింక గౌరవబోధ కోసం బహువచనలాభం కలిగించాలనుకున్నా అదివట్టి లోభం మాత్రమే అవుతుంది. ఈ శబ్దాలు బహువచనాన్ని ససేమిరా అంగీకరించవు. కాదూ కూడదూ అని అనుకుంటే 'గారు' అనే అనుబంధాన్ని చేర్చుకుని కోరిక తీర్చుకోవచ్చు. ఆమెగారు ఆవిడగారు మొదలయిన విధంగా వాడుకోవచ్చు.

అమ్మగారు అక్కగారు మొదలయిన విధంగా బంధుత్వ బోధకాల మీదకూడా 'గారు' అన్న అనుబంధం చేరుతుంది. 'అమ్మ' అనే మాటకు 'వారు' అనేది అనుబంధంగా చేరినప్పుడు అర్థంలో ఒక మార్పు కలిగి, ఒక రూఢి ఏర్పడుతుంది. 'అమ్మవారు' అని అంటే 'దేవత' అని అర్థం. 'అయ్య' శబ్దంమీదకూడా 'వారు' అనేది చేరినప్పుడు 'గురువుగారు'అన్న అర్థానికి రూఢి కలుగుతుంది.

సాధారణంగా స్త్రీ బోధకాలమీద గౌరవబోధకోసం 'వారు'అన్న అనుబంధాన్ని చేర్చడం జరుగదు. అయితే 'రాణి'అనే శబ్దంమీద 'వారు'అనేది చేరుతున్నట్టు, అప్పుడు వెనుకటి ఇత్వం నిడివిని పొందుతున్నట్టు వ్యవహారాన్నిబట్టి కొంత చెప్పవచ్చు. అప్పుడు రాణిగారు 'రాణీవారు'గా మారుతారు.

## 5

ఇంతవరకూ స్త్రీ బోధకాలయిన అన్వర్థకాలనుగురించి చూశాము. అస్మదర్థక, యుష్మదర్థకాలు స్త్రీలకూ, పురుషులకూ సమానంగానే ఉపభోగ్యమౌతాయి. స్త్రీఅయినా పురుషుడయినా 'నేను చెబుతున్నాను' అనో 'మేము చెబుతున్నాము'అనో అంటారు. 'నువ్వు వింటున్నావా?'అనో 'మీరు వింటున్నారా?'అనో అడుగుతారు. ఇంకా కావాలనుకుంటే 'మేము'కు బదులు 'మనం' అనుకున్నా 'మీరు'కు బదులు 'తమరు' అని అన్నా ఆక్షేపం లేదు

అసలు గౌరవవాచకాల గురించే మాట్లాడుకుంటున్నాముకాబట్టి యీ సంగతికూడా చూదాము. సంబోధ్యవాచకాలకుముందు 'ఓ'అని చేర్చుకోవచ్చు. అది కాస్త ఊతానికి పనికివస్తుంది దూరంగా ఉండే వాళ్లను అభిముఖీకరించుకోడానికి ఇది అవసరమే. ఇదే పురుషుల విషయంలో 'ఓయి'అనీ, స్త్రీల విషయంలో 'ఓసి'అనీ, నీచపురుషుల విషయంలో 'ఓరి' అనీ ఒకరకమైన నిందుదనాన్ని సంపాదించుకుంది. వీటికి మరింత నిడివిని చేకూర్చి ప్రయోజనాన్ని మరింత ప్రభావవంతంగా సాధించుకోవచ్చు. అయితే, యివి కూడా స్థానాన్ని మార్చుకుని, రూపాన్ని మార్చుకుని కొత్త మోజా చేకూర్చుకున్నాయి. సంబోధ్యవాచకానికిముందు మాత్రమేకాకుండా, సంబోధ్యవాచకమే లేకుండా, విడిగా కూడా వీటిని ఉపయోగించుకోవచ్చు. ఓయి'అనేది హలంతత్వాన్నిపొంది 'ఓయ్' అని రూపాంతరధారణం చేసింది. ఓరి, ఓసి అనేవి ఒరే, ఒసే అని మార్పు పొందాయి కొసకు కొంచెం హెచ్చు తగిలిస్తేనేకాని అందం చాలదనుకునేవాళ్లు మాత్రం ఒరేయ్ ఒసేవ్అనికూడా అంటుంటారు.

ఇంకొక పరమరహస్యమేమిటంటే, పురుషబోధకమయిన 'ఓయ్' ఈనాడు స్త్రీ ప్రపంచంలో మంచి ప్రచారాన్ని సాధించుకుంటూఉంది; స్త్రీ బోధకమైన 'ఒసే' అంతవిరవిగా కాకపోయినా, అక్కడక్కడ దూరదూరంగా పురుష వ్యవహారంలో తొంగిచూస్తుంది.

ఇంతకూ ఇదంతా ప్రసక్తానుప్రసక్తంగా చెప్పుకున్నాము. నిజానికి మనం గౌరవ వాచకాల గురించి మాట్లాడుకోవాలి. పైని చెప్పుకొన్న వాటిలో గౌరవ వాచకాలేమీ లేవు. ఒక మోస్తరు సామ్యాన్ని చూపిస్తూ వ్యవహరించేది 'ఓయ్' అనేది ఒకటి మాత్రమే. మరి అంతస్తులను పెంచుకుంటూ, అడుగడుగునా పునశ్చరణ చేసుకుంటూ పోయేటప్పుడు గౌరవవాచకమంటూ ప్రత్యేకంగా లేకపోతే పరిస్థితి చాలా ప్రమాదకరంగా పరిణమిస్తుందనడంలో సందేహం లేదు.

అందుకని 'ఏమి' అనే ప్రశ్నార్థకంమీద గౌరవ వాచకంగా 'అండి' అనేది చేర్చి 'ఏమండి' అని అంటున్నాము. ఇది ప్రశ్న వాచకంగా కూడా ఉపయోగపడుతున్నా, బహుజనభాషలో బహుస్థలాల్లో కేవలమూ అభిముఖీకరణ సాధనంగానే ఉపయోగపడుతుంది. అంటే ఇంతకు పూర్వం చెప్పుకున్న 'ఓయ్' మొదలయిన వాటికన్నింటికీ బదులుగా గౌరవప్రదంగా ఉపయోగపడుతున్న పదం 'ఏమండి' అనేది. నిజంగా దీని రూపమే చాలా గమత్తుగా ఏర్పడింది. అవసరం ఎన్ని నియమాలనైనా చిత్తు చేస్తుందనడానికి ఇదొక నిదర్శనం. మధ్యమ పురుష బహువచన ప్రత్యయం 'డు' అనేది. 'చదువు' అనే ధాతువుమీద 'డు' చేరితే 'చదువుడు' అని అవుతుంది. ఈ డు వర్ణానికి పూర్వం బిందువు కూడా రావచ్చు. అటువంటి సమయంలో 'చదువుండు' అని అవుతుంది. ప్రార్థనాద్యర్థాల్లో చివర 'ఇ' వర్ణం చేరినప్పుడు 'చదువుండి' మొదలయిన విధంగా రూపం యేర్పడుతుంది. ఇంతవరకూ గ్రాంథికభాషకూ సంబంధం ఉంది. వ్యవహారంలో 'చదువుండి' అనేది మధ్యలో ఉన్న ఉత్వాలన్నీ అత్వాలు కాగా 'చదవండి'

అని మారింది. ఇలాంటివే వినండి, చెయ్యండి, నడవండి మొదలయిన రూపాలన్నీ. వీటన్నింటిలోనూ సమానంగాఉన్న అంశం 'అండి' అనేది. అనుచిత విభాగం కారణంగా ఇది ఏర్పడింది. ఇది నిజంగా క్రియాపదాల చివర ఉండవలసింది మాత్రమే. అయినా 'ఏమి' అనే ప్రశ్నార్థకంమీద చేరుతూ ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని సిద్ధింపజేస్తున్నది.

'ఏమండి' అనే దాని ప్రభావంవల్లనే యేర్పడిందో, లేక మరేదయినా ప్రభావం గట్టిగా పని చెయ్యడంవల్ల ఏర్పడిందో స్పష్టంగా చెప్పలేము కాని ఏకవచనంలో 'ఓయ్' అనే దానితో సామ్యం కలుపుకుంటూ 'ఏయ్' అనే రూపం ఒకటి యేర్పడింది. 'ఏమండి' అనేది బహువచనమయితే 'ఏయ్' అనేది ఏకవచన మన్నమాట!

## 6

తెలుగులో ఉన్న రూప ప్రపంచాన్ని కొంత వరకు సందర్శించాము. కాని ఏ విషయమైనా విలువ కట్టాలనుకున్నప్పుడు సాపేక్షమై నిలుస్తుంది. అంటే మరో భాషతో పోల్చి పోలికలుగాని భేదాలుగాని గుర్తించుకుంటే. ఆ పరిశీలనకు ఒక పరిపూర్ణత లభించే అవకాశం కలుగుతుంది; అభ్యంతరం తొలగుతుంది. తెలుగుభాషలో ఉన్న లక్షణమే పొరుగుభాషలో కూడా కనబడితే, ఆ రెండు సంఘాల్లోనూ ఒకేరకమయిన మనస్తత్వం పనిచేస్తూ ఉన్నట్టు నిర్ణయం చేసుకోవచ్చు. ఒకవేళ భేదం కనిపిస్తే, ఆ భేదానికి కారణాలను అన్వేషించవచ్చు.

హిందీభాషలో అస్మదర్థకం ఏకవచనంలో 'మైఁ'అనీ, బహువచనంలో 'హమ్'అనీ ఉంటుంది. 'మైఁ బోల్తాహూఁ'అని అనడానికి బదులుగా ఆత్మ గౌరవాపాదనంతో 'హమ్ బోల్తేహైఁ'అని అనడం హిందీలో అధికంగానే ఉంది.తెలుగులో ఉన్నటు అస్మదర్థక బహువచనం రెండు రూపాల్లో హిందీలో లేదు. రెండు రూపాలు లేకపోయినా, ఉన్న ఒక్క రూపానికే రెండర్థాలూ చెప్పుకోవడం జరుగుతున్న వ్యవహారం. 'హమ్'అని అన్నప్పుడు ఎదుటివ్యక్తిని కూడా కలుపుకుని 'మనం' అని చెప్పుకోవచ్చు; కాకుంటే ఎదుటివాళ్లను విడిచిపెట్టి తనవాళ్లను మాత్రమే కలుపుకుని 'మేము'అని చెప్పుకోవచ్చు. ఇంతకుముందునుంచీ చూస్తున్నట్టు తానొక్కడే ఉన్నప్పటికీ సబహుమానంగా బహుత్వాన్ని ఆపాదించుకుని 'మేము'అన్న అర్థంలో 'హమ్'అనికూడా వాడుకోవచ్చు.

ఏకవచనంలో 'తూ' అనీ, బహువచనంలో 'తుమ్'అనీ రూపధారణం చేస్తుంది యుష్మదర్థకం. 'తూ కర్తా హై' అన్నది పూర్తిగా తనకన్నా తక్కువ వాళ్లనుగురించి అనే వాక్యం తనతో సమానులే అయితే, ఈ వాక్యాన్ని ఉపయోగించే సాహసిక్యం కలుగదు. అప్పుడు 'తుమ్ కర్తే హో'అని అనవలసి ఉంటుంది. అయితే గౌరవప్రమాణం పెరిగినప్పుడు ఈ వాక్యం పనికిరాదు. నిజానికి యుష్మదర్థంలో ఉన్న బహువచనం ఇదొక్కటే. తమదగ్గర లేకపోతే, మరొకచోటనుంచి ఎరువు తెచ్చుకోనయినా తెచ్చుకుంటారుకాని మర్యాదకు మచ్చ తెచ్చుకుంటారా? అందువల్ల ఆత్మార్థకమయిన 'ఆప్'అనే పదాన్ని అదనుకు అందంగా వాడుకుంటారు. అయితే తెలుగులో కంటె ఇక్కడ వాడుక కొంచెంభిన్నంగా ఉంటుంది. తెలుగులో కర్తృపదంగా 'మీరు'అనివాడినా 'తమరు' అనివాడినా చివరకు 'దయచెయ్యండి'అని సమానంగానే వాడతాము. క్రియాపదంలో భేదాన్ని పాటించడం లేదు. హిందీలో 'తుమ్ పధారో'అని అనాలి; 'ఆప్ పధారియే'అని అనాలి. మొత్తంమీద మనస్తత్వంలో ఏమీ మార్పులేదనే చెప్పవచ్చు.

అలాగే తదర్థకాన్నిగాని, ఏతదర్థకాన్నిగాని వాడేటప్పుడు అంతస్తుల అంతరం ఉండనే ఉంది. తదర్థకానికి 'వహ్' అనేది ఏకవచనం; 'వే' అనేది బహువచనం. ఏతదర్థకానికి 'యహ్' అనేది ఏకవచనం; 'యే' అనేది బహువచనం. ఏకవచనంలో కూడా గౌరవపురస్సరంగా 'యే ఆతే హైఁ' మున్నగు విధంగా ఉపయోగించడం జరుగుతుంది. అనార్థంలో కూడా ఆత్మార్థకాన్ని ఉపయోగించి 'ఆప్ హిందేకే మహాన్

కవి 'హ్మై' మొదలయిన విధంగా వాడడం మరింత గౌరవవంతంగా వ్యవహరించినట్టు.

ఈ సర్వనామాలన్నీ నిజానికి సంస్కృత భవాలే. సంస్కృతంలో ఉన్నవే. వాడుకలో అరుగుదల పొంది కొంచెం రూపు మార్చుకుని హిందీలో స్థిర పడ్డాయి. సంస్కృతంలో 'అహమ్' అని అంటే 'నేను' అని అర్థం. అదే మొదటి వర్ణాన్ని జార విడుచుకుని 'హమ్' అని మారి బహువచన బోధక మయింది. 'త్వమ్' అని అంటే నీవు అని అర్థం. తకారం మీద వకారం ఉకారంగా మార్పుపొందింది. సాధారణంగా జనసామాన్యం సంయుక్తాక్షరాలను పలక డంలో శ్రద్ధ చూపదు అందువల్ల సంయుక్తాక్ష రాల్లో ఏదో ఒక అక్షరంగాని, ఒక్కొక్కప్పుడు రెండూకాని తదనుకూలమైన మార్పును పొందడం జరుగుతుంది. ఇక్కడ అలాగే 'వకారం' దంతోష్ఠ్యం కావడంచేత దాని స్థానంలో 'ఉకారం' వచ్చి చేరుతుంది. ఇది ఓష్ఠ్యం కాబట్టి తదనుకూలంగా ఉచ్చారణను సరిపెడుతుంది. అప్పుడు 'తుమ్' అన్నరూపం ఏర్పడుతుంది. అస్మదర్థక విషయంలో జరిగినట్టు గానే యిక్కడకూడా ఇది బహుత్వ బోధకంగానే స్థిరపడింది. వీటికి రెండింటికీ ఏకవచన రూపాల అవసరం ఉండనే ఉంది అందువల్ల మహ్యం, తుభ్యం మొదలైన విధంగా ఉన్నరూపాలనుంచి 'మ్మై' అనీ 'తూ' అనీ రూపాలను స్వీకరించడం జరిగింది. కొందరు హిందీయులు 'హమ్' అనేది 'అస్మ' అనే దానినుంచి వచ్చిందనీ, మయా అనే సంస్కృత తృతీయాంతానికి 'ఏన్' అని చేరడంవల్ల 'మ్మై' అనే రూపం ఏర్పడిందనీ, 'త్వమ్'నుంచి 'తూ' ఏర్పడిందనీ, 'యుష్మ'నుంచి 'తుమ్' ఏర్పడిందనీ అంటున్నారు. కాని ఆ ప్రణాళిక అత్యంత క్లిష్టం మంగా ఉండడమేకాక, వ్యవహారంలో రాగిన మార్పులే ఆ మార్పులో వచ్చినట్టు నిరూపించడం కష్టం. అందువల్ల మనం మొదట చెప్పుకున్న ప్రకృతులే ప్రక్రియకు అనుకూలమైన ప్రకృతిని కలిగి ఉన్నా యని నమ్మడం మంచిది.

ఇంక 'ఆప్' అనేది 'ఆత్మ' అనే దానినుంచి ఏర్పడింది. ఇక్కడి తకార మకారాలు రెండూ సంయోగంచెంది, మకార బలంవల్ల ఓష్ఠ్య ద్విత్వంగా పరిణామం చెందాయి. తకారం బలంవల్ల పరుషత్వం ప్రాప్తించి ఉండవచ్చు. అందువల్లనే 'అప్ప' అని ఏర్పడుతుంది. అదే 'ఆప్'గా స్థిర త్వాన్ని సాధించుకుంది.

సంస్కృతంలోఉన్న 'అదస్' అనేది ప్రథమైక వచనంలో 'అసౌ' అవుతుందనీ, దానినుంచి 'వహ్' వచ్చిందనీ హిందీ భాషాశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. వాళ్లే 'ఏషః' అనే దానినుంచి 'యహ్' వచ్చిందని అంటున్నారు. 'ఏతత్' శబ్దం ప్రథమైక వచనంలో 'ఏషః' అవుతుంది. అదే 'యహ్' అని రూపాంతరం పొందగలుగుతుంది. ఇదే సామ్యాన్నిబట్టిచూచినప్పుడు 'తత్' అనేది 'సః' అవిమారి, అదే 'వహ్'కు మూల రూపమవుతుందనుకోవడం బాగుంటుంది. బహువచ నంలో 'ఏతే' అనీ 'తే' అనీ ఉండే ఈ రూపాల్లో చివరి అంశం 'ఏ' అనేది. అది 'యహ్+ఏ' అని ఉండి హకార లోపంతో 'యే'గా మారింది. అలాగే 'వహ్+ఏ' అనివి 'వే'గా మారుతాయి. ఇవి రెండూ బహువచన రూపాలు. వీటికి గౌరవ వాచ కాలగా ఉపయోగం ఉందన్న సంగతిని ముందు గానే చూశాము.

## 7

మనకు ఎంతోదూరంగా ఉండి రెండువందల యేండ్ల సాంగత్యంతో ప్రత్యంగంలోనూ తన ప్రభా వాన్ని ప్రత్యక్షం చేస్తున్న ఆంగ్ల భాషనే చూద్దాము. ప్రస్తుతం ఆంగ్ల భాషలో ఉన్న పద్ధతినిబట్టిచూస్తే పైని చెప్పుకున్న గౌరవవాచకాలకు ఏ మాత్రమూ తావులేదనే చెప్పాలి. పోనీ! సత్యానికి మరీ సన్నిహి తంగా ఉండాలంటే యింకొక రకంగా చెప్పుకుందాము. అంతస్తులనుబట్టీ, అర్హతలనుబట్టీ ఎక్కువ తక్కువ లను పట్టియిచ్చే వ్యవహారం ఆంగ్లభాషలో మనకు కానరాదు. కనీసం సర్వనామాలను సాధారణీకరించడం

వలనయినా ఒక సామ్యాన్ని సాధించుకున్నట్టు పమ్మతించక తప్పదు.

అస్మదర్థకం ఏకవచనంలో 'ఐ' అనీ 'బహువచనంలో 'వియ్' అనీ ఉంటుంది. బహువచనరూపం కేవల వక్తృపక్షాన్నీ సూచించవచ్చు; శ్రోతృపక్షాన్నీ తనతో కలుపుకోనూవచ్చు. కేవల గౌరవ వాచకంగా బహుత్వాన్ని పొందటంకూడా ప్రభువుల విషయంలో, ఇంకా అలాంటి వాళ్ల విషయంలో విన వస్తూనే ఉంది. అంత ధారాళంగా మాత్రం లేదనే చెప్పాలి. అలాగే అన్యార్థకంలో ఏకవచన బహువచనాలకు విభాజకరేఖ విస్పష్టంగా కానవస్తుంది. యుష్మదర్థంలో ఏకవచనంలోనూ, బహువచనంలోనూ కూడా 'యూ' అన్న ఒక్కరూపమే ప్రావును గడించుకుంది. ఇది నిజానికి బహువచన రూపమే; అయినా ఎదుటివాని మనస్తత్వాన్ని అవగాహనం చేసుకుని ఆదరించడానికేమో అన్నట్టు ఏకవచనంలో కూడా ఏలుబడి సాగించడం మొదలుపెట్టింది. ఏమయినా, ఇది మొదటినుంచీ ఉన్న వ్యవహారం కాదు; అవసరాన్నిబట్టి మధ్యలో వచ్చిన మార్పు మాత్రమే.

అసలు నిజానికి ఆంగ్ల భాష అంతదూరంగా ఉందా? అని ఆలోచించడం అవసరం. పైని చెప్పుకున్న సర్వనామాలను కొంచెం వెనక్కుపోయిచూస్తే, మనకు పరిచితమయిన రూపాలే ప్రత్యక్షమౌతాయి. పైని యుష్మదర్థక బహువచనంగా చూచిన 'యూ' అనేదానికి మూలరూపం సంస్కృత భాషలో ఉన్న 'యూయం' అనేది. ఇంకా వెనక్కిపోతే ఈ రెండింటికీ మూలమైన ఒక రూపం దొరకవచ్చు. ఆ భాషను 'ప్రాచీనార్య భాష' అని అంటారు. దాని స్వరూపాన్ని నిరూపణ చెయ్యగల సాధన సామగ్రి యిప్పట్లో మన దగ్గరలేదు. అందువల్ల ఊహామీదనే ఆధారపడి భావవ్యూహాన్ని రచించవలసి వస్తుంది. ప్రస్తుతానికి సంస్కృత రూపమే సరిపడుతుంది. అందువల్ల వెనక్కుపోయి అన్వేషణ చెయ్యవలసిన అవసరం అంతగాలేదు. 'యూయం' అనే రూపంలో చివరి అంశానికి లోపంరాగా 'యూ' ఏర్పడింది. సంస్కృతంలోని 'యూయం' అన్నదానికి 'మీరు' అనేది అర్థం. అదే అర్థం ఆంగ్ల భాషా పదానికి అన్వయక్రమంగా సంక్రమించింది.

పోలికకోసమని యిక్కడే యింకొక రూపం కూడా చూద్దాము. సంస్కృతంలో అస్మదర్థక బహువచనం 'వయం' అనేది. ఇది చివరిఅంశను కోల్పోవడంవల్ల 'వ' అని మాత్రమే మిగులుతుంది. సంస్కృతంలో అకారాదిగాఉన్న అనేకపదాలు ఇకారాదిగా మారుతున్నాయి. సంస్కృతంలోఉన్న 'అద్' ధాతువు 'ఈట్'అని రూపాంతరం చెందుతుంది; 'అస్'ధాతువు 'ఈజ్' అవుతుంది; 'స్వాదు' అనేది 'స్వీట్' అవుతుంది. ఈ సామ్యాలనుబట్టి చూచినప్పుడు 'వ'అనేది 'వి'గా మారుతుందనడాని కాక్షేపమేమీలేదు. ఇదే ఉచ్చారణలో 'వియ్' అనేదానికి కొంచెం సన్నిహితంగా వినిపిస్తుంది.

యుష్మదర్థకం ఏకవచనంలో 'త్వమ్' అనేది. ఇదే ఆంగ్లంలో 'దౌవ్'అనే పరిణామాన్ని పొందింది. అంటే చివరిఅంశమైన మకారానికి లోపం వచ్చింది. వకారం దంతోష్ఠ్యం కావడంవల్ల ఓష్ఠ్యమైన ఓకారంగా పరిణామం చెందింది. అయితే 'ఈ' దీర్ఘాన్ని 'ఇయ్' అనేదానికి సన్నిహితంగా పలికినట్టుగానే, 'ఓ' అనేదాన్ని 'ఒవ్' అనేదానికి సన్నిహితంగా పలకడం జరిగింది. అందువల్లనే 'త్వమ్'అన్నరూపం 'దౌవ్'గా మారి వినవస్తూఉంది. ఇది ప్రస్తుత భాషలో కనిపించదు. ప్రాచీన భాషలో ధారాళంగా ఉన్నదేఅయినా, తరువాత కేవలం పద్యకావ్యాల్లో తలదాచుకుంది. ఇప్పటికి అక్కడనుంచికూడా తప్పుకుందనే చెప్పవచ్చు. ఎదుటివాడు ఎవ్వడైనాసరే! సగౌరవంగా సంబోధించడం సముచితంగా ఉంటుంది. అందువల్లనే యుష్మదర్థంలో బహువచనరూపమైన 'యూ' మాత్రమే మిగిలి ఏకవచనరూపమైన 'దౌవ్'అనేదానిని తొలగించివేసింది.

సంస్కృతంలో అస్మదర్థకైకవచనం 'అహం' అనేది. దీనిలోని చివరిఅంశం 'హం' తొలగిపోగా 'అ'

అనేది మాత్రమే రికామీగా మిగిలింది. మనం ముందు చెప్పుకున్న ప్రకారంగా ఇది 'ఈ'గా మారాలి. ఈ ఉచ్చారణను వ్యక్తం చెయ్యడానికి ఆంగ్లంలో 'ఐ' అన్న అక్షరాన్ని ఉపయోగించడం జరిగింది. అంటే వ్రాతలో 'ఐ'అనిఉన్నా ఉచ్చారణలో 'ఈ'అనే ఉండేదన్నమాట! మధ్యకాలం వచ్చేసరికి 'ఐ' తన రూపానికి అనుకూలమైన ఉచ్చారణను సంపాదించుకుంది. అంటే దాదాపుగా 'అయ్' అన్నట్లుగా పలుకబడుతుందని అర్థం.

అన్యార్థాన్ని చెప్పవలసివచ్చినప్పుడు ఏకవచనంలో 'తత్'అనేరూపం సంస్కృతంలో ఉంది. దీనికి 'అది'అని 'వాడు'అని అర్థం. అయితే 'వాడు'అనే అర్థం చెప్పుకునేటప్పుడు ఇది రూపాంతరం ధరించి 'సః'అని అవుతుంది ఆంగ్లంలో 'దట్' అనేది ఈ ఉభయార్థాలనూ చెబుతుంది. అయినా 'అది'అనే అర్థంలోనే ఎక్కువ ప్రచారంఉంది. ఇంకా భిన్నభిన్న ప్రయోగప్రకారాలకు ఆకారం దిద్దుకున్నట్టుకూడా ఆంగ్లంలో చూడవచ్చు. 'సః'అనేదానికి బహువచన రూపం 'తే' అనేది. అదే ఆంగ్లంలో 'దే' అనే రూపంతో కన్పిస్తూఉంది.

ఇంక ఆంగ్లంలోని ఇట్, హీ, షి, దోజ్, దీజ్ మొదలయిన రూపాలకు సంస్కృతరూపాలకు అనురూపత కనిపించదు. తవ్వితే లోతులు కనిపించక పోవుగాని ప్రస్తుతానికి ఆ అవసరంలేదు. ఇంకొక విషయం. సంస్కృతంనుంచి ఆంగ్లానికి మనం ఒక్క దూకుదూకి సామ్యాన్ని సరిపెట్టుకున్నాము. ఈ రెండింటికీ పూర్వమున్నభాషను స్పృశించడం మానుకున్నట్టుగానే, మధ్యలో ఉన్న కొన్నిసోపానాలను విడిచిపెట్టి సుకరంగా విడిదిని చేరుకున్నాము. శాస్త్రీయంగా చెప్పుకోవాలంటే వాటినికూడా చెప్పుకోవాలి. చెప్పుకున్నా చెప్పుకోకపోయినా ఫలితార్థం మాత్ర మొక్కటే.

## 8

ఆంగ్లంలోనూ అధికారిక పదవులను గౌరవించడం బాగానేఉంది. అందువల్లనే యువర్ ఎక్స్‌లెన్సీ, యువర్ మేజెస్టీ మొదలయిన సంబోధనలూ— హర్ ఎక్స్‌లెన్సీ, హిజ్ ఎక్స్‌లెన్సీ మొదలయిన గౌరవ వాచకాలూ ప్రసిద్ధిని పొందాయి. సంస్కృతంలోనూ ఏకవచన బహువచనాల్లో యుష్మదర్థకం పైని చెప్పుకొన్నట్టుగానే ఉన్నప్పటికీ 'తమరు'అన్న అర్థంలో పుంలింగంలో 'భవాన్'అనీ స్త్రీలింగంలో 'భవతీ'అనీ ఉపయోగించడం జరుగుతుంది. అర్థాన్నిబట్టి 'తమరు' అన్నట్టుగా బహుత్వస్ఫూర్తిఉన్నా, నిజానికి ఇవి రెండూ ఏకవచనరూపాలే. వీటికి కావాలనుకుంటే 'భవన్తః'అనీ, 'భవత్యః'అనీ బహువచన రూపాలు తయారుచేసుకోవచ్చు. అంతేకాక యింకొక చిత్రమేమిటంటే ఎదుటివాళ్ళను సంబోధించడానికి ఉపయోగించే ఈ పదాలతో అన్వయంగల క్రియాపదం ప్రథమపురుషలో ఉంటుంది. ఇది ఎదుటివాళ్లకుమాత్రమేకాక అన్యార్థకాలకుకూడా వాడుకోవచ్చు అప్పుడు దగ్గరవాళ్లయితే అత్ర భవాన్, అత్రభవతీఅనీ, దూరంగా ఉన్నవాళ్లనయితే తత్ర భవాన్, తత్రభవతీఅనీ వ్యవహరించడం జరుగుతుంది. ఇప్పుడెలాగూ క్రియ ప్రథమ పురుషలోనే ఉంటుంది.

మొత్తంమీద సంస్కృతంలోనూ, ఆంగ్లంలోనూ కూడా నిమ్నోన్నతవిరూపకరూపాలు చాలా తక్కువగానే ఉన్నాయి. తెలుగు మొదలయిన దేశభాషల్లో ఎక్కువగా కనిపిస్తూఉన్నాయి. అయితే యిప్పుడున్న పరిస్థితినిబట్టి, యెల్లప్పుడూ ఇలాగే ఉన్నాయని నిర్ణయించడం కూడనిపని.

మన భాష సారస్వతరూపాన్ని సంతరించుకుంటున్ననాటికి ఈ యెత్తు పల్లాలు లేవనిపిస్తుంది. భారతాన్ని చూడగా ప్రభువూ, బంటూ ఏకవచనంలోనే ఏకరీతిలోనే వ్యవహరించబడినట్లు కనిపిస్తుంది. ఎవరు ఎవరిని సంబోధించినా, ఎంతగౌరవంగా వర్తించినా, ఏకవచనంమాత్రమే ఏలుబడి చేసింది. అయితే అప్పటికే గౌరవవాచకం కొంచెం తలయెత్తడంకూడా లేకపోలేదు. 'మీరలు మీరల విద్యాసారము చనుదెంచుగ వలయు'అని మహాభారతంలో నన్నయభట్టారకుని రచన. ద్రోణుడు కుమారవర్గంయొక్క అస్త్రవిద్యా

పరిశ్రమను పరిశీలించవలసిందని కోరుతూ ధృత రాష్ట్రునితో అన్నవాక్యం. ఇక్కడ ధృతరాష్ట్రునికి సబహుమానంగా 'మీరు'అన్న బహువచనం వాడ బడింది. ఇంకొకచోట పరిహాసపూర్వకంగా బహు వచనం వాడడం జరిగింది అర్జునుడు ద్రుపదుడిని యుద్ధంలో నిర్జించి బంధించి గురువుకు దక్షిణగా సమర్పించాడు. ద్రుపదుడు తాను గొప్పవాడైనట్లు, ద్రోణుడు తనతో చెలిమికి పనికిరానివాడైనట్లు పలికి అవమానపరిచాడు. అందువల్ల ద్రోణుడు ఆ పరా భవానికి బదులుగా 'వీరెవ్వరయ్య ద్రుపదమహారాజులె యిట్లు కృపణులై పట్టువడన్ వీరికి వలసెనె యహహ మహారాజ్యమదాంధకార మదివాసెనొకో' అని ద్రుపదుడిని పలుకరించాడు. ఇక్కడ చివరంటా బహు వచన ప్రయోగం జరిగింది. ఇలాగే ఇంకా కొన్ని చోట్ల బహువచనం చోటుచేసుకుంది. సమాజంలో ఏర్పడ్డ హెచ్చుతగ్గులనుబట్టి యివి యింకా పెరి గాయి. అయినా వ్యవహారంలో ఉన్నంత ధారాళంగా కావ్యంలో ఏనాడూ గౌరవవాచకాలకు స్థానం కల్పించ బడలేదు.

అడిదం సూరకవి పూసపాటి సీతారామరాజు గారిని ప్రశంసచేస్తూ పద్యంలో ఏకవచనప్రయోగం చేశాడు. రాజుగారికి ఆగ్రహం కలిగింది. అప్పుడు సూరకవి కవితాస్వాదము ఆయనకు తెలియజేస్తూ మళ్ళా ఒక పద్యం చెప్పాడు. అది యిది—

'చిన్నప్పుడు రతికేళిని
మన్నప్పుడు కవితలోన యుద్ధములోనన్
వన్నెలుమీ రాకొట్టుట
చెన్నగునో పూసపాటి సీతారామా!'

ఈ పద్యంలో కేవలమూ ఏకవచన ప్రయో గమేకాదు. 'రా'అని కూడా అనవచ్చుననీ అంటేనే అందమనీ తెలియజేశాడు: సూరకవి స్వతంత్ర ప్రవృత్తిగలవాడు కావడంచేత అలా చెప్పగలిగాడు. అంతకుముందుగా తంజావూరుకు విచ్చేసిన 'చౌడప్ప' రఘునాథరాయలను ప్రశంసిస్తూ

'నేరుతునని మాటాడగ
వారిజభవునంతవాని వశమా? తంజా
పూరి రఘునాథరాయని
గారి వలెన్' అని 'గారు'అన్న అనుబంధాన్ని చేర్చి వాడుకున్నాడు. మొత్తంమీద కవిత్వంలో గౌరవవాచకాలు తక్కువగానే ఉన్నాయి.

తెలుగుదేశపు వ్యావహారికంలో మొదటిరోజుల్లో ఈ గౌరవవాచకాలు లేవనీ, క్రమంగా తలయెత్తా యనీ నా విశ్వాసం. అందువల్లనే భారతంవంటి మహా గ్రంథంలోకూడా ఏవో ఒక పిడికెడు ప్రయోగాలు మాత్రమే చెయ్యడం జరిగింది. అయితే, తరువాత సమాజంలోవచ్చిన చారిత్రక, రాజకీయ, సాంఘిక పరిణామాలనుబట్టి ఏర్పడిన వ్యత్యాసాలు కారణంగా ఏకవచనాన్ని నిమ్నత్వస్ఫోరకంగానూ బహువచనాన్ని ఔన్నత్యస్ఫోరకంగానూ ప్రయోగించడం జరిగింది. ఇప్పుడవి భాషలో బాగా పాతుకుపోయాయి. అందు వల్లనే అడుగడుక్కీ తడబాటుపడడమూ తడుపు కోవడమూ జరుగుతుంది.

ఇతరవిధంగా ఎంత సామ్యాన్ని సాధించినా భాషలో సామ్యాన్ని సాధించకపోతే, యీ వైషమ్యం యిలాగే మిగులుతుంది. మొదటఉన్న సామ్యం మధ్య కాలంలో లోపించింది. ఇప్పుడున్న భాషాప్రయోగ వైఖరినిబట్టి 'సామ్యం'పేరు తలపడానికైనా వీలు లేదు. అయినా సబలమైన సామూహికభావన ఎంతటి ప్రభావమయినా ప్రదర్శింపగలుగుతుంది. స్వాభావి కంగా భావంలో ఒక పరిణామం వచ్చినట్టయితే, భాషలోకూడా అది ప్రతిఫలిస్తుంది; అంతేకాదు, భాష దాని కనుకూలంగా ఒదిగిపోతుంది. వెయ్యానికయినా వియ్యానికయినా సమత్వం కావాలి. సమత్వం లేకపోవడం విషమత్వం. ఆ విషమత్వమే వైషమ్యం. అది దూరాన్ని పెంచి అనుబంధాన్ని త్రుంచివేస్తుంది. అంతేకాని దూరాన్ని త్రుంచి అనుబంధాన్ని పెంచదు. కాబట్టి వైషమ్యాన్ని ఉత్తరించి, సామ్యాన్ని ఉద్ధ రించడం ఉత్తమకర్తవ్యం. అటువంటి సమదృష్టి గలవాడే నిజమైన పండితుడని 'గీత' ప్రబో ధిస్తున్నది. 'సమబుద్ధి ర్విశిష్యతే'.

# వక్రరేఖలు

## శ్రీ పరిగి రాధాకృష్ణ

చివరికిలాగే అవుతుంది
కన్నీళ్లు కరువైనప్పుడే
కష్టాలొచ్చిపడతాయి.
కలలేవో కవ్విస్తున్నప్పుడే
చావండదే నీళ్ళొస్తాయి.
కొండల్ని కరిగించేవాడికే
కాళ్లకింద భూమి కంపిస్తుంది
విశ్వసించినవాడే
చెయ్యి విరిచేస్తాడు
నీడకోసం చెట్టుకిందికి
నీవు చేరుకునే సరికలా
గాలి విసురు ఎక్కువై
శివమెత్తిన మనిషిలా
చెట్టూగుతుంది.
నిజాయితీనా!
నడిసంద్రాన నావే అవుతుంది.
జడివానలో గొడుగు లేకుండా
గంటలకు గంటలు నడుస్తున్నా
నిన్నెవరూ గమనించరు
గమనించినా గొడుగు పట్టరు!

ఇంతే మరి
నీ పాటింటికీ
వీణ మోసుకు తిరిగినా
సంగీతం వినేవాళ్ళుండరు.

నీవెంతో సాహసంతో
సముద్రపు లోతుల్ని తరచి
మణుల్ని వెలికితీసి
తీరానికి తిరిగొచ్చినా
నత్తగుల్లల్లాంటివాళ్ళు
వెక్కిరింతలు గుప్పిస్తారు.
నీలో సహస్రాంశం చేయనివాడు
ఏనుగుపై ఊరేగుతుంటే
మెటాఫిజికల్ గా నవ్వేసి
నీవు ఎక్కడికి తప్పుకోవాల్సి వస్తుంది!

ఇసుకదిబ్బలపై లేపిన మేడలు
గట్టివని ఎదుటివాడు వాదిస్తే
నీవు విస్తుపోయి వినాల్సొస్తుంది.
సముద్రాన్నాపోశన పట్టేస్తానని
ఎలుగెత్తి అరిచేవాళ్ళ కంఠాల్లో
పూలదండలు పడితే
నీవు గుడ్లప్పగించి చూడాల్సొస్తుంది.
మొండికత్తులు ఝళిపించేవాళ్ళపై
మోజు పెంచుకునే అమాయకుల్ని చూసి
లోలోపల నీవు నవ్వుకోవాల్సివస్తుంది.
కాగితపుపూవుల్ని కత్తిరించి
మిడిసిపడే మహామహుల ముందు
నిజమైన తోటమాలి
కట్టిన చేతులతో నిలబడాల్సివస్తుంది!
అలాంటప్పుడు నీకు
అడవుల్లో కొండల్లో కోనల్లో
మసలుకునే ఏనుగులే
మెరుగనిపిస్తారు!

ఇంకా
చరిత్రగూటిలో

చిత్రవిచిత్రమైన చిలకలు చేరతాయి.
అవి పలికే పలుకులు
బలే గమ్మత్తుగా వుంటాయి.
భవిష్యత్తు ఆకాశంలో మెరిసే
ఆశల చుక్కలు కనబడకుండా
అవివేకపు మబ్బులు మూసేస్తాయి.
మనసు చెట్టుమీద
గూళ్లు కట్టుకున్న నిజాల పక్షులు
నినాదాల ఎత్తుల్లో ఎగిరినంతసేపూ
చెట్టు వునికినే మర్చిపోతాయి!

మరో తమాషావుంది.
పిచ్చిముదిరి పాకానపడి
మహాకవుల పదవిన్యాసం
సైన్ వేవ్‌లా కదలుతుంది.
పైత్యం ముదిరి చెడిన కవిత్వం
బురద చిమ్ముకునే స్థాయికి దిగుతుంది
అరిస్టోటిలూ ఆనందవర్ధనుడూ
వెక్కి వెక్కి ఏడుస్తారు!
అవును నిజం
చివరికిలాగే అవుతుంది.

---



# సమగ్ర దర్శనము

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కాళిదాసుని కవిత్వమును చైతన్యమయమును మాధురీమయమును చేసినవారు అతని స్త్రీ పాత్రలు. 'స్త్రీతి నామాపి మధురమ్' అనుసూక్తి మధురిమ నెరిగినవాడు కాళిదాసు. అతని స్త్రీలు భవభూతి స్త్రీలవలె ఆదర్శ అమృత రేఖలు కారు. బాహిర సౌందర్యమును నిర్లక్ష్యముచేసి ఆంతర శోభతో వెలుగొందు దేవీమూర్తులును కారు. వారు వాస్తవ ప్రపంచమున తారుణ్య లావణ్యములతో వినయ విశ్వాసములతో సౌమనస్యసౌశీల్యములతో ప్రత్యక్ష మగు నారీమూర్తులు. వారు ఇల్లాండ్రుగా, తల్లులుగా, కోడండ్రుగా, వదినలుగా, ప్రేమతపస్వినులుగా పతిదేవతలుగా, అతని కావ్యలోకము నలంకరించిరి. గార్హస్థ్యపక్షమిట్లుండగా వేఱొకవైపు కళాలావణ్యముతో జీవనోల్లాసముతో వెలుగొందు రమణీమణుల శృంగారలోకమున్నది. ఈ రెండు పక్షములును కలసి ఇతని కావ్యప్రపంచమును సమగ్ర శోభావంతము చేయుచున్నవి. ద్వివిధమైన ఈ స్త్రీ మాధుర్యమును చిత్రించుటలో కవీంద్రుని ప్రజ్ఞా పరిపాకము కానబడును.

స్త్రీ పురుషులలో ఒకరెక్కువ ఒకరు తక్కువ అను భేదభావన మితనికి లేదు. కనుకనే. 'స్త్రీ పుంసా వాత్మభాగౌ తే భిన్నమూర్తే స్సిసృక్షయా' 'స్త్రీ పురుషు లిరువురును సృష్టి సంపూర్తికై ఒకే భగవంతుని రెండు రూపములు' అని బ్రహ్మ స్తుతిలో ఈతడు పల్కెను.

పరస్పర ప్రేమ, విశ్వాసము నీరికి ఈశ్వర ప్రసాదములు. ప్రేమకు రూపాతిశయమే ప్రధానము కాదు. కేవల రూపాకర్షణమునే మోహమును ప్రేమగా భ్రమింపరాదు. ఉత్తమ ప్రియుడు హృదయ హార్యుడుగాని, రూపహార్యుడుగాడు. కనుకనే పార్వతి పరమేశ్వరుని లోగొనలేని తన రూపమును నిందించుకొని తపస్సుచేసి పతిప్రేమకు పాత్రురాలైనది. అట్లే ఉత్తమ ప్రియుడు, ప్రియురాలి ఆంతర్య మెరుగక బింబాధరములకు లొంగిపోడు. వక్ర హృదయులైన ఇద్దఱి స్త్రీ పురుషుల వియోగ వేదనను చిత్రించి, కవీంద్రుడు ప్రేమపరముగా వారి హృదయౌన్నత్యమును వెల్లడించెను.

అజునకు భార్యావియోగము తటస్థించెను. వెంటనే అతని జీవితము రిక్తపాత్రయయ్యెను. లోకమంతయు శూన్యమయ్యెను. అతని హృదయమును కవి ఇట్లు వెల్లడించెను.

'ప్రియా! నీవు నా గృహిణివి, నా మంత్రివి, నా సఖుడవు. నా లలితకళాశిష్యురాలవు. దయాహీనమైన మృత్యువు నిన్నెత్తుకొనిపోయి నా కింకేమి మిగిల్చినది? (రఘు. 8.)

ఇదియొక ఉత్తమ ప్రేమికుడైన పురుషుని హృదయోద్గారము. ఇక పురుషునియెడల స్త్రీ ఆంతర్య మెట్టిదో ఇందు చూడవగును. శివ ఫాల నేత్రమున భస్మమయిన ప్రాణపతినిగూర్చి రతీదేవి ఇట్లు పలవించెను.

'శశితోకూడ చంద్రికపోవును. మబ్బుతో మెఱపు మాయమౌను. చేతనా హీనములుగూడ భర్తతోడిదే స్త్రీ జీవితమని చెప్పుచుండగా నేనింకనూ జీవించియే యున్నాను.' నరనారీహృదయముల ప్రేమపార మిదియని కవీంద్రుడు వ్యాఖ్యానించెను.

తక్కిన జీవిత రంగముల స్త్రీ నిర్వహించిన పాత్ర నించుక చూతము.

దిలీపుని భార్య సుదక్షిణ రఘువంశమున మొదట దర్శనమిచ్చు ఇల్లాలు. ఆమె యజ్ఞ దక్షిణ వంటిదను ఉపమానమే ఆమె పవిత్రతను చాటును. ఇరువదియొక్క రోజులు భర్తకు తోడునీడగా నందినీ ధేనువును పరిచరించెను. రాజు ఆవునమేపి అరణ్యమునుండి అలసి సొలసి వచ్చుచుండగా ఆప్యాయముగ ప్రేమతో ఎదురేగి ఈమె పలుకరించును. దప్పికగొన్న కన్నులతో అతనిని త్రాగివేయును. ఈమె నందిని ప్రసాదమున ప్రతిసాధనశక్తి అర్థముమ కన్నట్లు రఘురాజును కని, రఘువంశమును విస్తరించిన మాతృమూర్తియయ్యెను.

ఇందుమతి అయోధ్యాంతఃపురమున కాలు మోపిన ముద్దుకోడలు. బ్రతికిన మూడునాళ్లలో పతికి అరచేతిలో స్వర్గము చూపిన అచ్చరకన్య. రామాయణ మూలపురుషుడు దశరథకుమారుని భర్తకు సమర్పించి వెన్నెలవలె అదృశ్యయైన సాధ్వీ రత్నము. తరువాత అయోధ్యాంతఃపురము నలంకరించుచు దర్శనమిచ్చు నవవధువులు సీతా, ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తులు. వారు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను చెట్టబట్టి ప్రత్యయములతో కూడిన ప్రకృతులవలె ప్రకాశించిరి. ఎంత చక్కని ప్రకృతులైనను ప్రత్యయములతో కూడనిదే వాక్యమున శోభింపవు అట్లే ఆ రమణీమణులు పురుషోత్తములనుగూడి అన్వయసౌధమును వెలిగించిరి. చిత్ర మేమనగా? ఇంతవరకు రఘువంశ స్త్రీపాత్ర లెవ్వరును పెదవివిప్పి మాటలాడరు. కాని పొదరింటిలోని పూలగుత్తులవలె వారి గుణపరిమళము కావ్యమంతటను గుప్పుమనుచుండును. ఆ మౌనభాషలో వారు మాటలాడుచున్నట్లే యుండును.

రాఘవుల ఇంటిదీపము సీతమ్మ ఒక్కసారి పెదవి విప్పినది ఆ వాక్కులో ఎంత కులవధూ వినయము! ఎంతటి క్షత్రియాణి అభిమానకీల! ఈతని సీత వాల్మీకి సృష్టికి ప్రతిబింబము.

లక్ష్మణుడు అడవిలో విడిచిపుచ్చినపుడు ఆమె అంజలిపట్టి 'లక్ష్మణా! ఆ రాజుగారితో నిటు చెప్పుము. మీ కంటియెదుట అగ్నిపరీక్ష జరిగినది. అయినను లోకాపవాదము విని నన్నిట్లు పరిత్యజించితిరి. ఇది తమ పరిజ్ఞానమునకు తగినదా? లేక తమ వంశమర్యాదకు తగినదా?' (రఘు. 14.61.)

'ఇందు మీ తప్పులేదు. ఇది నా దురదృష్టము'. (14.62)

'పూర్వము చేజిక్కిన లక్ష్మిని తిరస్కరించి నన్ను తీసికొని అడవి కేగితిరి. ఇప్పు డామె మిమ్ములను చేజిక్కించుకొని నన్ను వెడలగొట్టినది' (14.63) అని పల్కెను.

ఈ వదినయందు ఆమె మరదులకు దేవీ గౌరవము. పుష్పకమునుండి దిగగానే, భరతుడు వదిన పాదములకు నమస్కరించెను. 'లంకేశ్వరుని ప్రణామమును తిరస్కరించు ఆమె పాదయుగమునకు తపస్వియై జడలు పెంచుకొన్న భరతుని 'తల' నమస్కరింపగా అవి రెండును పరస్పరము పవిత్రములైనవి. (14 78)

మేఘునకు యతునిభార్య భ్రాతృజాయ అట: ఈ వదినయను మాటయందు కవీంద్రుడు ఎంత భక్తి మాధుర్యమును నించెనో అనిపించును.

పార్వతి తల్లి మేనాదేవియును వసిష్ఠపత్ని అరుంధతీదేవియును పెదవివిప్పరు. గౌరీదేవి సరేసరి. తపస్విని. కాని కపటబ్రహ్మచారి ఆమెను కవ్వించెను. అప్పుడును సఖి విజయయే గౌరికథ చెప్పెను. కాని బ్రహ్మచారి విడువలేదు. తుదకు గౌరి ఎర్రనికన్నుల నుండి తగిన ప్రత్యుత్తరమును బడసెను. వారి అభిమానము గాయపడినప్పుడుగాని మాటలాడరు కాబోలు.

రతీదేవి దుఃఖాలాపములలో స్త్రీ హృదయ సౌకుమార్యము ప్రతిధ్వనించును. ఇట్టి స్త్రీ పురుష ప్రవృత్తులేగాక అతని కావ్యములందు నాటి సమాజస్థితి సంప్రదాయములు నాగరికత లీలగా కనుగొనవచ్చును.

కవి కథా సందర్భమున వర్ణించిన సమాజ రూపమునందును,. ఆచారాభిరుచులందును, అతని నాటి సభ్యతా సంస్కారములును అభిరుచులును ప్రతిబింబింపక మానవు. తన దేశకాలములను మరచి ఆతడు క్రొత్తలోకమును సృష్టింపలేడు. అతని సృష్టి తన దేశకాలముల భూమికయందే నిలిచి వలసినంత వికాసము నొందును. కనుక కవీంద్రుడు వర్ణించిన నగరములు, జనులు, ఆచార వ్యవహారములు, మర్యాదలు, మనోవ్యాపారములు సమస్తమును అతని లోకవ్యవహారమునకు నీడలే యనుట సత్య దూరముకాదు. ఆతడు వర్ణించిన అయోధ్య, ఓషధిప్రస్థము, అలకాపురమును ఆతడెరిగిన ఉజ్జయినికిని విదిశకును దూరములు కావు. అతని దిలీప రఘు, అజ, అగ్నివర్ణులు తననాటి ఆదర్శరాజుల శృంగార పురుషుల ప్రతికృతులేయని సురక్షితముగ చెప్పవచ్చును.

కవీంద్రుడు చిత్రించిన రతి, ఇందుమతి, పార్వతి యక్షపత్ని మున్నగువారు ఏ ఉజ్జయినీ పురాంతఃపురములనుండియో, విదిశా భవనముల నుండియో, తొంగిచూచు చుందురనుకొందును. అలకా సౌధ గంధర్వ రమణీమణులు, అభిసారికలు, అగ్నివర్ణు కళావతులు అచ్చముగ అతని దృష్టిలోని రస రూపిణులేగాని ఊహాలోకమునుండి ఊడిపడిన వారు కారు.

ఓషధి ప్రస్థమును, అలకయును అతని ఊహానగరములైనను అతడెరిగిన పట్టణములే అట్టి రూపు ధరించినవని. ఆతడు చూచిన పట్టణములు స్వర్గమునకు అనుబంధనగరము లన్నట్లున్నవి. (కు. 6.37.)

'వానికి పెద్దపెద్ద అగడ్తలును, ప్రహరీలును ఉండును. (6.38.)

సౌధశిఖరములు మేఘములు సంచరించునంత ఎత్తు. (6.40.)

భవనములందు విధిగా పతాకము లెగురుట ఆనాటి నగరశోభ. (6.41.)

నగరములు రాత్రులందు ఎడతెగని దీపకాంతులతో ప్రకాశించును. (6.43.)

సౌధగవాక్షములనుండి స్త్రీలు కేశపాశముల తడియార్పుటకు వేసికొన్న సుగంధధూపములు తీగలు సాగి వచ్చుచుండును. (మేఘ. 1.36.)

భవన కుడ్యములు శూన్యములుగ నుండరాదు. గోడనిండ రకరకముల పురాణగాథల శృంగారక్రీడల చిత్రములుండును. (రఘు. 14.25.)

చనిపోయినవారి ప్రతిరూపములను పూజ్యభావముతో నింట నుంచెదరు. (రఘు. 14. 15.)

సాధారణముగ సౌందర్య రసికుల భవనము లిట్లుండును.

ఇంటిముందు రంగురంగుల తోరణములు (Arches) (ఆర్చెస్) ఉండును. వానికి దగ్గఱగా చేతికి పూవులు అందు ఒక పుష్పవృక్షము. దానికి నాతిదూరమున ఒక దిగుడుబావి యుండవచ్చును. దానిలో తెల్లని బాతు లీదుచుండును. ప్రక్క నొక క్రీడాపర్వతము. దాని పై గోరింటచెట్లు ఆవరణము గల బంగరువెందపాద. దాని కిరువైపుల ఒక అశోకము. ఒక వకుళము. దాని మధ్యను ఒక సొగసైన స్తంభము. సాయంకాలమున దాని పై పెంపుడునెమలి నివసించును.

ద్వారమునకు ఎడపెడ శంఖ పద్మ చిత్రములు. ఇవి నిధులు. ఈ గృహయజమానున కింత ధనము కలదని అతని తాహతును చెప్పు చిత్రము లివి యని ఒక వ్యాఖ్యాత వల్కెను. (మేఘ. 2.14—19.)

ఇవి కుబేరనగరమునందలి యక్షుని ఇంటి గుర్తులే కావు. కాళిదా సెరిగిన భాగ్యవంతుల భవనము లిట్టివని ఊహించుట పొరపాటు కాజాలదు.

కాళిదాసునాటి నగర నిర్మాణము, విపణి వీధులు, నౌకా సంచారములు, సాయంత్రపు వాహ్యాళులు ఎట్టివో అతని కావ్యములనుబట్టి పసికట్ట వచ్చును.

రాజమార్గములలో వస్తుసమృద్ధిగల అంగళ్లుండును. నదులందు నౌకలు స్వేచ్ఛాసంచారములు చేయును. ప్రయాణములకు కావచ్చును, వాణిజ్యమునకు కావచ్చును. ద్వీపాంతరములనుండి లవంగములు మున్నగు సుగంధద్రవ్యములను దిగుమతిని చేసికొనుట వారెరుగుదురు. (రఘు. 6.57.)

విలాసపురుషులు పురబాహ్యోద్యానములందు సంతోషముగ కాలము పుత్తురు. (14.30.)

ఒక్కొక్కచోట వేశ్యలు స్వచ్ఛందముగా ప్రియులతోకూడి గిరికందరముల క్రీడించుట నాటి రసికతాసమృద్ధిని తెల్పును. (మేఘ. 1.26.)

మాగధీకుసుమములు త్రుంచుకొనుటకు పూలపడుచులు వత్తురు. వారి చెవులలో కలువపూలుండును. అవి వారి ముఖములతోబాటు వాడిపోవుచుండును. దానిని చూచి రసికజనులు నొచ్చుకొందురు. (మేఘ. 1.27.)

నాటి స్త్రీలు విలాసముగా రత్నసువర్ణాలంకారములకు బదులు సకలాంగములందును పుష్పాలంకారము చేసికొనుటయును కనబడును. (మేఘ. 2.2.)

నేటివలె పూర్వమును స్త్రీలు ముఖశోభకొరకు, ముఖమార్జనము వద్దుకొనుట చెప్పదగిన విశేషము. అలకాపురస్త్రీలు! లొద్దుగపుప్పొడి నద్దుకొని ముఖశోభ నినుమడింపచేసిరట. (మేఘ. 2. 2.)

ఉత్సాహాతిశయమునకు స్త్రీ పురుషులు మధువు సేవించుట తప్పుగాదు. ఈ మధుసేవనము గౌరీశంకరులనుగూడ విడువలేదు. (కు 8.75.)

అక్కడక్కడ అమాయికలగు పల్లెపడుచులు కాన్పించుదురు. వారు శరత్కాలమున చెఱకుతోటల నీడలకూర్చుండి పాటలు పాడుదురు. (రఘు. 4.20.)

కనుబొమ్మవిరుపు లెరుగని కాపుపడుచులు పంటలకు మూలములని మబ్బులను ఆశతో చూచుట ముచ్చట గొల్పును. (మేఘ. 1.16.)

నేటివలె నాడును ఎక్కడిపను లక్కడ విడచి, పెండ్లి ఊరేగింపులు చూడ పరుగెత్తుట స్త్రీల హక్కు. (రఘు. 7.6 మొదలు 11.)

వసంతమున అన్నిక్రీడలతోబాటు ప్రేయసీ ప్రియులు ఊయల లెక్కి ఊగుట ఒక చెప్పదగిన ముచ్చట. (రఘు. 9.51.)

కుమారసంభవములోని కల్యాణోత్సవము, బంధుసమాగమము, ఎదురుసన్నాహము, పలుకరింపులు, చిలుకరింపులు, అచ్చముగా నేటి పెండ్లిసందడును జ్ఞాపకముచేయును. ఆ పురాణకథకు 'అక్షరములా' మానవహృదయ మిచ్చి, కవీంద్రుడు అద్భుతముగ నిర్వహించెను.

సమావేశములందు ఆయాజనుల స్థాయినిబట్టి పలుకరింపులోని గడుసుదనమును ఈ సన్నివేశమున చూడనగును. వివాహోత్సవమున శివు నభినందించుటకు బ్రహ్మ విష్ణులును, ఇంద్రాదులును వచ్చిరి. పెండ్లికొడుకు శంకరుడు తలయూచి బ్రహ్మదేవుని, మాటలాడి విష్ణుమూర్తిని, చిఱునవ్వుతో దేవేంద్రుని, ఒక ప్రియమైనచూపుతో సకలదేవతలను పలుకరించెను.

తలయూపులో పూజ్యభావము, మాటలో మన్నన, చిఱునవ్వులో ఆప్యాయనము, చూపులో ఆదరమును ఔచిత్యముతో నొలికించిన, కవీంద్రుని లోకజ్ఞత మెచ్చదగినది.

కన్యను పెండ్లికూతును చేయుట ఒక చక్కని ఆచారము. దాని సొగసు కుమారకావ్యమున హృదయదఘ్నముగ నున్నది. (కు. 7.6 మొదలు 21.)

తలపై తెల్లావాలతో కూడిన దూర్వాంకురములు. నాభి నతిక్రమించిన, పట్టువస్త్రము. చేతిలో బాణము. (కు. 7.7) క్రొత్తపెండ్లికూతురు పార్వతి రూపమిది.

రాబోవు సాఫల్యవైఫల్యములకు, శకునములు నమ్ముట స్వప్నములను పరిగణించుట, కాళిదాసుని నుండియు వచ్చుచున్న సంప్రదాయ మనుకొందును.

సుదక్షిణాదిలీపులు సంతానార్థులై పోవు చున్నప్పుడు, సారసపక్షులు బారులుకట్టి రమ్యముగ కూయుచున్నవి. (రఘు. 1.41.)

మనోరథసిద్ధిని దెల్పుచు అనుకూలపవనములు వీచినవి. (1.41.)

ఈ బెగ్గురుల బారులును, అనుకూలపవనములునుకాక ఎడమప్రక్క చాతకము కూయుటయు మేఘదూతమునందు మేఘునకు శుభశకునములైనవి (మేఘ. 1. ?.)

సంతానప్రాప్తికై నందినిని సేవింపుమని వసిష్ఠుడు రాజుతో చెప్పెను. మాటలోనే నందిని వచ్చెను అది శుభశకునమని సంతసించిరి. (రఘు. 1.86, 87.)

దశరథుని రాణులు గర్భవతులై గదా, శంఖ, చక్రాంకిత హస్తులగు వామనమూర్తులు తమ్ము రక్షించుచున్నట్లును, గరుత్మంతుడు తమ్ము వహించుచున్నట్లును, లక్ష్మి పద్మహస్తయై తమ్ము సేవించుచున్నట్లును బ్రహ్మర్షులు స్తుతించుచున్నట్లును కలలు గనిరి (రఘు. 10.61—64) దీని వలన దశరథపుత్రులకు విష్ణువు చతుర్విధముగ పుత్రభావము నందుచున్నాడని కవి సూచించెను. ఇట్టివెన్నియో వాటి సమాజస్థితిగతులను, అతని రచనలందు గమనింపగలము.

**రాజకీయములు :**

కాళిదాసుని రెండు ప్రముఖకావ్యములందును రాజులే నాయకులు, రఘువంశమున మానవరాజులు: కుమారకావ్యమున గిరిరాజ దేవరాజులును మనకు దర్శనమిత్తురు మానవరాజులు తమ లోకోత్తర గుణాతిశయముచే కథానాయకులైరిగాని, వంశాధిక్యముచేగాని కేవల పారంపర్యముచేగాని, కాకుండుట గమనింపదగిన యంశము. ఒకవేళ పారంపర్యము నాయకత్వమిచ్చినను దానినుండి ఒకడు ఎట్లు విచ్యుతుడు కావచ్చునో కవి నిరూపించెను.

గిరిరాజులో వైభవమును, దేవరాజులో రాజసమునుమాత్రమే చూతుము కవీంద్రుడు మానవరాజుల జీవితచిత్రమును సమగ్రముగ చిత్రించి మన యెదుటబెట్టెను.

పట్టాభిషేకము రాజచరిత్రలో ప్రధానమైనది. కుశుని కుమారుడు అతిథి సందర్భమున రమ్యమైన అభిషేకదృశ్యము కానవగును. శిల్పులు నాల్గు స్తంభములును, ఎత్తైన వేదికయునుగల ఒక చక్కని మండపమును నిర్మించిరి. రాజకుమారుని భద్రపీఠమునందుంచి, భృత్యులు బంగరుకలశములతో తీర్థోదకము తెచ్చిరి. తూర్య వాద్యధ్వనులు మ్రోగగా దూర్వాయవాంకురములు జావిబెరడు లేజివుళ్లతో గూడిన నీరాజనములను కులవృద్ధులయిన పురోహితులు అథర్వమంత్రములతో తని నభిషేకించిరి. (రఘు. 17.9—13.)

అటుతర్వాత, ఆ రాజు రాజనీతి వైశారద్యమును కవి విపులముగా ప్రస్తావించెను. అందు పూర్వరాజుల రాజనీతియే భంగీభేదమున విస్తరింపబడినను అందు కొన్ని విశేషాంశములును ఉన్నవి.

దిలీపుని పాలనమున క్లుప్తముగ హృద్యముగనున్న రాజనీత్యంశములు చూచినచో కాళిదాసు రాజకీయ పరిజ్ఞానము విశదమగును.

దిలీపుడు రాజ్యపాలనము చేయుచుండగా అతని భీకర, మనోహర లక్షణములను చూచిన ప్రజలకాతనియందు భయమును భక్తియునుకూడ నెలకొన్నవి. (రఘు. 1.16.)

రాజ్యరక్షకు ప్రముఖమైన ఈ లక్షణమును కవీంద్రుడు మరి మూడుచోట్ల వొక్కివొక్కి చెప్పెను.

1. రఘువు నేరముచేసినవారికి చేయుదండనము యుక్తమగుటచే ఆతడు అత్యుష్ణమును, అతిశీతలమునుకాని దక్షిణానిలమువలె ప్రజల మనములను చూరగొనెను. (ర. 4.8.)

2. అజుడు మిక్కిలి కఠినుడు, మిక్కిలి మెత్తనివాడుకాక మధ్యేమార్గము నవలంబించి

వాయువు వచ్చెల్లమువలె శత్రువులను పెకలింపక వంచి, వదలెను. (రఘు. 8.8.)

3. అతిథి కేవలశాస్త్రము నవలంబించుట పిరికితనమనియు, కేవల శౌర్యము మృగచేష్టయనియు తలచి రెండిటిని జోడించి పరిపాలించెను. (రఘు. 17. 47.)

నాటిరాజు, తన ప్రజలను మనురాజునుండియు వలిగిన ధర్మపథమును వంతగూడ తప్పకుండ నడిపించెను. (రఘు. 1.17.)

అతని ఆలోచనము గుప్తము. అతని ఆకార, ఇంగితములు గూఢములు ఫలితములనుబట్టి అతని ఆలోచనములను ఊహింపవలసినదేగాని రాజకీయ రహస్యము పైకిపొక్కుట అసంభవము. (రఘు 1.20.)

అతడు భయములేకున్నను ఆత్మరక్షణపరుడు. క్లిష్టసమయములందుగాక, ఎల్లప్పుడును ధర్మాసక్తుడు. దురాశలేకుండ ధనము నంపాదించును. పరవశుడు గాకుండ సుఖముల ననుభవించును. (రఘు. 1 21 )

బిడ్డలను కనుట మాత్రమే తల్లిదండ్రుల వంతు వారి విద్యా శిక్షణ, పోషణ, భారము వహించి రాజే వారికి జన్మైనతండ్రి యగును. (రఘు. 1.24.)

రాజు దండార్హులనే దండించి, లోకస్థితి నిలుపును. ప్రజాతంతు వర్ధనమునకే పెండ్లియాడి అర్థకామములను ధర్మముతో లంకెవేసి యుంచెను. (రఘు. 1.35.)

యోగ్యుడైన జనుడు శత్రువైనను, రోగి మందువలె స్వీకరింపవలసినదే. దుష్టుడు ఆత్మీయుడైనను పాముకరచిన వ్రేలినివలె ఖండించవలసినదే. (ర. 1.28 )

రాజు ధర్మస్థులకు మిత్రుడై వాది ప్రతివాదుల తగవులను తొందరపడక న్యాయముగనే తీర్చునుగని, ప్రాడ్వివాకులకు విడువడు. (రఘు. 17.39.)

రాజు పలికినది పొల్లుకాదు. ఆత డిచ్చినది మరల పుచ్చుకొనడు. (రఘు. 17.42 )

వయోరూపసంపదలలో ఒక్కొక్కటియే తలను త్రిప్పివేయును. అన్నియు కలపియు ఆ రాజు మనసునకు గర్వమును కల్పింపలేకపోయినవి (రఘు. 17.43 )

వర్తకులు నదులందును, అడవులందును, కొండలందును స్వేచ్ఛగా సంచరించుచు, వాణిజ్యము చేయుచుండిరి. (17.64)

భూమి తన్ను రక్షించుచున్నందులకు రాజునకు గనులనుండి రత్నములను పొలములనుండి పంటలను అడవులనుండి ఏనుగులను సమృద్ధిగా ఇచ్చుచుండెను.

ప్రజలు కృతజ్ఞులై తమ సంపాదనములోని ఆరవవంతును రాజునకు పన్నుగా కట్టుచుండిరి. లౌకికజనులేకాక అడవిలోని మహర్షులు సైతము తాము సంపాదించుకొనిన నెవరి ధాన్యమునుండి ఆరవపాలు పన్నుగా రాజు నుద్దేశించి విడుచుట మిక్కిలి ఆశ్చర్యము కల్గించును. (రఘు. 5.7.)

రాజప్రజా సంబంధము సంప్రీతికరముగ నుండెను. రాజు తాను దానముగా నిచ్చిన బ్రాహ్మణాగ్రహారములందు యూపస్తంభములు విరాజిల్లుచుండగా వానిని చూచుచు సంతృప్తినందును. ఆ యగ్రహారబ్రాహ్మణులు వచ్చి అర్ఘ్యపాద్యములతో ఆశీస్సుల నిత్తురు. (రఘు. 1.44.)

తమ ప్రభువు తమ పల్లెలచెంతనుండి పోవుచుండగా ముసలిగొల్లలు భక్తిపూర్వకముగా హైయంగవీనములను తెచ్చి సమర్పింతురు. (రఘు, 1.45.)

ఆ అమాయకప్రజలను పలుకరించు నెపమున ఆ రాజు దారిప్రక్కనున్న అడవిచెట్లపేర్ల నడుగును.

ప్రయాణమధ్యమున రాజు గుడారములు వేసికొనియుండగా జానపదులు వచ్చి ప్రేమపూర్వకముగా కానుక లిత్తురు. (5.41)

క్రొత్తగా రాజ్యమునకు వచ్చినను ప్రతిదినమును ప్రజానురాగమును పెంపొందించు రాజు క్రొత్త చెట్టువలె దృఢముగా పాదుకొనును. (17.44) దీనికి విరుద్ధముగా రాజు ప్రజలను నిర్లక్ష్యముచేసి వారు తన దర్శనము కోరగా గవాక్షమునుండి పాదము చాపి, దానిని చూచిపొమ్మనినచో ఆ రాజునకు ప్రజల దృష్టిలోనున్న గౌరవము అంతటితో నంతరించిన దన్నమాట. వానికి వినిపాతము దగ్గఱలోనే ఉన్నదనుట నిక్కము. 19.7.

రాజకుటుంబములందు సాధారణముగ స్వయంవరములు జరుగును. వాని స్వరూపస్వభావము లను కవీంద్రుడు కన్నులకు గట్టినట్లు చెప్పెను.

స్వయంవర ప్రారంభమున వందిమాగధులు రాజుల గుణవిశేషములను ప్రస్తుతింతురు. ఇంతట అగరుధూపములు రేగి తీగలు సాగును. పిమ్మట మంగళసూచకముగా శంఖములు మ్రోగును ఆ వెనుక పల్లకిలో రాజకుమారి వచ్చి రాజపుత్రశ్రేణులందు నెమ్మదిగా నడచుచుండగా చెలికత్తె వారివారి గుణవిశేషములు నుగ్గడించును. ఆ రాచకన్నియ కోరిన వానిని వరించును. తర్వాత పెద్దలు వారికి పెండ్లి చేయుదురు. నిరాకృత రాజకుమారులు అసూయతో నవవధూవరుల నడ్డగింపగా పెండ్లికుమారుడు వారిని గెలిచి నవవధువును దక్కించుకొనుట అప్పుడప్పుడు జరుగుచుండును రాజకుమారి వరించుటకు రూపాతిశయ మున్నంతమాత్రమున చాలదు. ఒక్కొక్కచో శౌర్యాతిశయమును మూల్యముగా చెల్లింపవలసి యుండును. (రఘు. 6)

రాజులు బహుపత్నీకు లగుటనాడు దోషము కాదు. దిలీపునకు అవరోధజనము అధికముగనే యున్నను, సుదక్షిణాదేవినే ధర్మపత్నిగా భావించెను. ఆమెతోడనే ధర్మకార్యములు నెరవేర్చెను.

రఘురాజును, దక్షకన్యలు చంద్రుని వరించినట్లు, పలువురు రాజకన్యలు వరించిరి. (రఘు. 3.33.)

రాజకుమారుని గుణవిశేషమునుబట్టి రాజులు తమతమ కన్యల నియ్యవత్తురు. వారిని తిరస్కరించుట రాచమర్యాద గాకపోవచ్చును. అప్పుడు ఆ రాజకుమారుడు వారిని సమానముగ నాదరించుచు, తాను వరించిన యామెను ధర్మపత్నిగ స్వీకరించుట న్యాయమే యగును. వారును సాధారణముగ తమలో తమకు పొరపొచ్చెములు లేక సరిపెట్టుకొని, భర్తయందు అనురక్త లగుదురు. ఈ సామాన్య రాజ సంప్రదాయమునే కవి తన కావ్యమునందు చిత్రించెను. ధర్మోత్తరులగు ఈ రాజులు భార్యలందు ప్రేమ, విశ్వాసము, ఆత్మీయత చూపుటయే మనకు కాన్పించును కాని, భోగలాలసత, కామపరాయణత్వము కాన్పింపవు.

మహారాజులు జైత్రయాత్రలకు పోవుటకు ముందు గుఱ్ఱములకు హారతు లిచ్చి పూజింతురు. (రఘు. 4.25.)

ఊరేగురాజుపై ముత్తైదువలుగాని, కన్యకలు గాని పేలాలు జల్లుదురు. (4.27.)

రఘువు దిగ్విజయము చేసెను. అది తన సార్వభౌమాధికారమును స్థాపించి, దేశమును ఒక గొడుగుక్రిందకు తెచ్చుటకేకాని, దేశీయరాజులను కొల్లగొట్టుటకుకాదు. అతడు ఎదిరించినవారినే వంచెనుగాని, మన్నించినవారిని బాధించలేదు. (4.35.)

రఘువు తన్నెదిర్చిన కళింగనాథుని జయించి అతని ధనముమాత్రమే స్వీకరించి, రాజ్యము నాతని కిచ్చివేసెను. అట్టిరాజు ధర్మవిజయి. (4.43.)

విజేతలగు రాజులు నదీగర్భములందును పర్వతములందును, జయస్తంభముల నాటుదురు. (4.36,59.)

రఘుమహారాజు సర్వదిగ్విజయము చేసి తెచ్చిన ధనరాశిని విశ్వజిద్యజ్ఞమున మృణ్మయపాత్రావశేషముగ దానముచేసి రిక్తుడయిన మహాత్యాగి. ఈ త్యాగమువలననే వారు ప్రజాప్రీతికి పాత్రులై వన్నె కెక్కిరి

ఉత్సవవేళలందు కారాగారబద్ధులను విడిచి పుచ్చుటయే నాటి రాజుల ఔదార్యముగాదు; పంజర ములలోని పక్షుల బంధములను, వధార్హుల మరణ శిక్షలను రద్దుచేయుదురు. ఎద్దుల మెడలందలి భారమును, ఆవుల పాలుపితుకుటను మాన్పింతురు. 17.19.

పుత్త్రోదయవార్త తెచ్చిన పరిచారకులు పుత్రవంతుని యొద్ద గొప్పకానుకలను తీసికొందురు. దిలీపుడు తనకు కల్గిన పుత్త్రోదయవార్తను వినగానే ఆ వార్తతెచ్చిన అంతఃపుర పరిచారకునకు తన రాచరికమునుతప్ప ఇక నేమడిగినను ఇచ్చివేయుటకు సిద్ధముగా నుండెనట

ఎట్టిభయమును లేక స్త్రీలు ఏరాజ్యమున ఒంటరిగా సంచరించుటకకు వీలుకలుగునో అట్టిది సౌరాజ్యము. దిలీపుని రాజ్యమున ఒక సుందరాంగి ఒంటరిగా పోవుచు త్రోవలో నిద్రించినను, గాలి సైతము ఆమెవలువను తాకుటకు వెఱచును. ఇక మనుజు లెవ్వరును ఆమెను బాధింపరని చెప్పుట ఎందులకు? (రఘు 6 75)

ఇట్టి ఆదర్శమహారాజుల యుగమును కవీంద్రుడు చిత్రించెను.

## సందేశము—సమాప్తి:

మహోత్సాహముతో బయలుదేరి లోకోత్తర కౌశలముతో వస్తువిన్యాసముతో విరాజిల్లు కాళిదాస కళామందిరమున ప్రవేశించి, ఇంతవరకు, యథావకాశముగ, యథాశక్తిగ సర్వవిభాగములను పరికించితిమి. ఆతడు శాశ్వతముగ సృష్టించిన రసప్రపంచమున తన్మయులమై సంచరించితిమి

యుగయుగములకు మానవ జీవనమార్గమును కాంతివాహినులతో నింపి, వీరులై, భోగులై, త్యాగులై విరాగులై అలరారిన పురుషోత్తములను దర్శించితిమి. గుణపరిమళముతో లోకమును, రూపాతిశయములతో అంతఃపురములను వెలిగించిన గృహలక్ష్ములను కనుగొంటిమి. హోమధూమ సుగంధిలములగు పుణ్యాశ్రమములను, శిష్యవత్సలులగు గురుదేవులను, గురువినీతులగు శిష్య శిరోమణులను కన్నారగా చితిమి. చెంగుచెంగున దుముకు లేళ్లను ముద్దాడితిమి. వృక్షసేచనములో నిమగ్నలై చెట్లను పిట్టలను తోబుట్టువులట్లు ప్రేమించు మునికన్యకలను చిఱునవ్వులతో పలుకరించితిమి.

నాటి పట్టణములు, పల్లెలు, నదులు, కొండలు, నాగరికతలు, సభ్యతలు, రమణీమణులు, రాసక్రీడలు, వాసంతోత్సవములు, నృత్యసంగీతములు, యుద్ధ దుందుభులు ఒకసారి మన కన్నులయెదుట తమ విశ్వరూపప్రదర్శనముచేసి, ప్రక్కల కొత్తిగిల్లినవి. ఒక్కమాటలో చెప్పవలయును, యావద్భారత పటము, ఒక్కచో ప్రఫుల్ల వదనముతో మనకు సాక్షాత్కరించినది. అరవింద యోగీంద్రు డన్నట్లు కాళిదాస పాఠకులు అమృత పుత్రులు. తత్కావ్య ప్రవచనములు సర్వేంద్రియ సంతర్పకములు.

కాళిదాస మహాకవి ప్రపంచ పౌరుడు. విశ్వకవి ఆతని మధుర వచనములను మననముచేసి ధన్యులగుటకు, ఆతని అద్భుత కళాసృష్టిని చూచి తన్మయులగుటకు ఒక్క భారత జాతియే పెట్టి పుట్టలేదు. సర్వప్రపంచమును బద్ధాంజలియై తన ప్రశంసా నీరాజనముల నెత్తినది.

గురుదేవుడు వాల్మీకిమహర్షి ఇచ్చిన ఉద్దీపనముతో ఉత్సాహముతో కవీంద్రుని కావ్యదీపికలు వెలిగినవి భాసుని చేతితాకున అవి యింకను దీప్తిమంతములైనవి. కావ్యదేశికుడు వాల్మీకియైనచో, నాటక గురువు భాసుడు. అయినను, కాళిదాసు తన వ్యక్తిత్వ వికాసములతో గురువులను మించిన శిష్యు డనిపించుకొని, తక్కినవారికి తాను మార్గదర్శకుడయ్యెను. భారవి, మాఘ భవభూత్యాది ఉత్తరకవులలోని కాళిదాస ప్రభావము దీనికి నిదర్శనమగును.

కాళిదాస దివ్యకళామందిరమును దర్శించి, తీయని కవితాస్మృతులతో ఇక మనము తిరిగి పోదము. పోవుచున్న మనకు శ్రవణసుభగముగ చల్లని

వీణా స్వనములవలె వినిపించు నీ కావ్యధ్వనులేమి? అవి మహాకవి మానవజాతి కిచ్చు నీ క్రింది సందేశములై మనవెంట నంటుచున్నవి గాబోలు!

'మానవజీవితము మధురము. ఈ సుందర సృష్టి ఆనందపూర్ణము. అజ్ఞానమువలనను, అకాల వైరాగ్యమువలనను మానవుడా! వానిని దుఃఖమయము చేసికొనకుము.'

'రక్తివిరక్తులు సుఖదుఃఖములు వెలుగు నీడలు. వాని సమన్వయములోని జీవితసమగ్రతను గుర్తింపుము.'

'ప్రకృతి నీ జీవనతరణి. స్త్రీ నీ జీవనసఖి, రసాధిదేవత. శుష్కహృదయముతో వానిని తిరస్కరించి జీవితమును శూన్యపాత్రము చేసికొనకుము.'

'అర్థకామములను ధర్మచ్ఛత్రము క్రింద నుంచి, జీవనమాధుర్యము ననుభవింపుము.'

'స్త్రీ పురుషప్రేమ యమృతమయము కాని, ఒకరికి రక్తియు, వేరొకరికి విరక్తియు కలజంట, ఆ ప్రేమామృతము ననుభవింపలేదు. అట్టివారి కలయిక రుచిహీనము. సమానానురాగము వరప్రసాదము. అట్టిదాంపత్యము ఒకవేళ వియోగమున మగ్గ వలసివచ్చినచో, అదియే ఉత్తమము' (మాళవిక)

'మరణమునకు వెరువనేల? మరణమే స్థిరమైనది. బ్రతుకే తాత్కాలికము. అట్టియెడ క్షణకాలము జీవించుట ఘటస్థించినను, దానికే సంతసింపుము.' (రఘు 8.87.)

'స్వజాతిని, స్వజాతీయతను కన్నుల కద్దుకొనుము. మాతృభూమి గుణసంకీర్తనముతో వివశుడవు కమ్ము. విరోధి దురాక్రమణమును మహోత్యాగముతో శౌర్యముతో ఎదిరించి నిలువుము.'

పక్వహృదయుడగు మహాకవి శాకుంతల నాటక భరత వాక్యమే ఈ నా ప్రసంగమునకు స్వస్తి వాక్యమగుగాక.

ప్రవర్తతాం ప్రకృతిహితాయ పార్థివః
సరస్వతీ శ్రుతమహతీ మహీయతామ్।
మమాపి చ క్షపయతు నీలలోహితః
పునర్భవం పరిగతశక్తి రాత్మభూః॥

'ప్రభువు, ప్రజాశ్రేయస్సుకై ప్రవర్తించుగాక. వాగ్దేవి సర్వోత్కృష్టముగా నుండుగాక. ఆత్మసంభవుడును, శక్తియుక్తుడు నగు పరమేశ్వరుడు నాకు పునర్జన్మము లేకుండ చేయుగాక!'



# కాకతీయ బాంధవ్యములు - ఒక పరామర్శ

## శ్రీ తురగా కృష్ణమూర్తి

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు 'భారతి' (సంపుటం 47—సంచిక 10) లో 'కాకతీయ బాంధవ్యములు'అను శీర్షిక క్రింద నొక అమూల్య వ్యాసరాజమును పాఠకజనమనోరంజకముగా రచించి ప్రచురించియున్నారు. ఆ వ్యాసరచనలో వారి లక్ష్య మేమియో తెలియరాలేదు. కేవలము విషయప్రచుర ణకేయని యనుకొన్నరో, కాకతీయులు సంబంధబాంధ వ్యము లందుకొన్న నతవాటిసీమ ప్రభువుల విష యము, వెలనాటిసీమవారి విషయము, అమరావతీ ప్రభువుల విషయములను వదలివైచి నిడదవోలు చాళుక్యులతోను, కోనహైహయులతోను వారికిగల బాంధవ్యచరిత్రనే తడిమి విడిచినారు. ఇందులకు ప్రత్యేక కారణమేమైనను యున్నదా? విషయోద్ఘాట నలో నూత్నచరిత్రాంశముల వెల్లడించుట జరుగలేదు, ఇరికదా! యదార్థచరిత్రకు భిన్నముగు వాతలనే ప్రద ర్శించినారు. కాకతీయులతో కోనహైహయులకు ప్రత్యక్షబాంధవ్యసంబంధము లేకున్నను, నిడదవోలు చాళుక్యుల బాంధవ్యమునుబట్టి వారుకూడ నీ వ్యాస రాజమున ప్రస్తావింపబడుట కర్హతను సంపా దించినారు.

బహుగ్రంథద్రష్టలు. విద్యావేత్తలు, ఆచార్య పీఠాధిపతులు శ్రీ లక్ష్మీరంజనంగారు ఆంధ్ర రచ యితల సంఘమువారు 1967 సంవత్సరములో ప్రచు రించిన కాసె సర్వప్ప ప్రణీతమైన 'శ్రీ సిద్ధేశ్వర చరిత్ర'యను కాకతీయరాజుల చరిత్రకు ఆంగ్లమున పీఠిక వ్రాయుచు యేవి చారిత్రకసత్యములని నమ్మి యుద్ఘాటించియున్నారో, ఆ సత్యములనే యిప్పటికినీ నమ్మిచు, పది సంవత్సరములు గడచిపోయి, నూత్న చరిత్రాంశములు బయల్పడి, పూర్వచరిత్రను తారు మారుచేయు పరిస్థితు లేర్పడినను. వాటిని సరకు గొనక ఈనాటికినీ ఆ నమ్మకములతోనుండుట నిజ ముగా ఆశ్చర్యజనకముగానే యున్నది.

చరిత్ర చతురాననులు, కీర్తిశేషులైన శ్రీ చిలు కూరి వీరభద్రరావుపంతులుగారు చరిత్ర రచనోద్యో గులైయుండి, శ్రమించు కాలమున కుపలబ్ధమైన సాధనసామగ్రితో చరిత్ర నన్వయముచేసి, తమ శేముషీవిభవమున కొన్ని యూహల వెలార్చి చరిత్ర సృష్టించి. నాటితరమువారికి మార్గదర్శకులై మేటి కీర్తి గాంచిరి. ఆ వెన్కవచ్చిన చరిత్ర రచయితలు, వారి సమకాలీనులుగూడ శ్రీ పంతులుగారి నిర్ణయ ముల ద్రోసిరాజనలేక, త్రోసిరాజని భిన్నసిద్ధాంత ములచేసి నిల్పుకొనలేక, సూచనప్రాయముగ తమ యుద్దేశముల దెల్పి యూరకుండిరి. కాలము గడచిన కొలదినీ చారిత్రకపరిశోధన రంగము విస్తృతమై, నూత్నసామగ్రి లభించి, శాసనములు వెలుగుమాచి, పూర్వసిద్ధాంతముల తారుమారు చేయుదగు అవసర మును సృష్టించినది. తదనుగుణముగ చారిత్రక పరి శోధకులు తమతమ నిర్ణయముల ప్రచురించుచు, పూర్వమున్న చారిత్రకాంశములకు వలయు సవరణ లను ప్రతిపాదించుచు యదార్థచరిత్రమ వెల్ల రించుచు వచ్చుచున్నారు.

ఓరుగల్లు రాజధానిగా కాకతీయాంధ్రరాజ్య

మును పాలించినవారిలో కాకతిగణపతిదేవచక్రవర్తి యెన్నిదగినవాడు. ఈ గణపతిదేవునకు పురుష సంతానములేదు. అందుచేత కాకతీయవంశ మంతటితో నశించిపోవు దుస్థితి యేర్పడుటకు గణపతిదేవచక్రవర్తి ఆందోళనచెంది, తన రెండవకుమార్తె రుద్రమదేవి యందు కుమారభావముంచి 'రుద్రదేవుడ'ను పురుషనామమునబెంచి రాజ్యపాలనలోను, రణకౌశలములోను పారంగతురాలినిగా నొనర్చి, యువరాజపట్టాభిషేకముగూడ నొనరించెను. అయినను గణపతి దేవుని అంతరాంతరములలో తన వెన్క నోరుగల్లు సింహాసన మధిష్ఠించి పాలించు నాథుడు లేడను చింతమాత్రము వేధించుచునేయుండ, రుద్రమ వివాహ వయస్సునకు వచ్చుటచే నిరవద్యపుర ప్రభువగు చాళుక్య యిందుశేఖరుని జ్యేష్ఠ పుత్రుడు వీరభద్రునకిచ్చి వివాహము గావించెను. ఈ విషయములను కొలనుపాక[1], జుత్తిగ[2] గ్రామములలో లభించిన శాసనములు వ్యక్తీకరించుచున్నవి. ఆపైన నడచిన చరిత్రను గురించి వాదోపవాదములు, తర్జన భర్జనలు, ఖండనమండనములు బహుకాలమునడచి యేకవాక్యత కుదరక, అపరిష్కృతముగానే నిలిచిపోయినది. ముమ్మడమ్మ చాళుక్య వీరభద్రేశ్వరునకు రుద్రమకు ప్రభవించిన ఔరస పుత్రికగాక, పెంపుడు కూతురుగా విశ్వసింపబడెను. ముమ్మడమ్మ గర్భవాసమున జనించిన ప్రతాపరుద్రుని రుద్రమ స్వీకృతపుత్రభావమున పెంచి, తన యనంతరము వోరుగంటి సింహాసనార్హునిగా నియమించెను.

ఈ ప్రతాపరుద్రుని తల్లిదండ్రుల విషయమై విద్యానాథునినుండి వీరభద్రరావు పంతులుగారి వరకు వివిధములగు కథలు ప్రచారము నందినవి. విద్యానాథుని 'ప్రతాప రుద్రీయము'లోని "కౌసల్యాసీ త్ప్రథమ జననీ దేవకీ చ ద్వితీయా' అను శ్లోకమునుబట్టి తల్లి 'ముమ్మడమ్మ'యని, 'మురారేః పూర్వం జలనిధి సుతాయా ముదభవ'యను శ్లోకమునుబట్టి తండ్రి 'మహాదేవుడ'నియు స్పష్టమగుచున్నను, యీ మహాదేవు డెవ్వరో తెలియక చరిత్రజ్ఞులు తమ తమ యూహాకొలది నిర్ణయముల చేయుచు వచ్చిరి. వాదోపవాదములకు దిగిరి. వ్యాస పరంపరల పెంచిరి. విషయమును క్లిష్టతర మొనర్చి విడచిరి. ఆ వాదసరళి క్రింది విధముగా నున్నది:—

(1) 1935 లో ఆంధ్రేతిహాస పరిశోధక మండలి తరపున శ్రీ మారేమండ రామారావుగారి సంపాదకత్వమున ప్రచురింపబడిన 'కాకతీయ సంచిక'లో ప్రతాపరుద్రుని తల్లిదండ్రులు ముమ్మడాంబ, మహాదేవులని అంగీకరించుచు 'యీ మహాదేవరాజెవ్వరో నిర్ణయించుటకు ఇంతవరకు సరియైన యాధారములు కానరావనీ, 'దక్షిణ హిందూదేశ శాసన సంపుటములో ప్రచురింపబడిన నిడుదవోలు పాలకులైన చాళుక్య వంశీయులలో క్రీ॥ శ॥ 1218—1228 మధ్య రాజ్యమేలిన మహాదేవుడే యుండవోపు'ననీ యూహ చేసి, 'యీ నిర్ణయము చేయుటకొక ప్రతిబంధకమున్నది. చాళుక్యాన్వయుడగు వీరభద్రునకు కాకతి రాజపుత్రి రుద్రమకు కూతురగు 'ముమ్మడమ్మ' మంకొక చాళుక్యాన్వయుడగు మహాదేవరాజు మద్వాహమాడుట నిషిద్ధ విషయమగుట'యని వా రూహించిన ప్రతిబంధకమేమియో వివరించిరి.

(2) 1936 లో 'కాకతీయాంధ్ర రాజయుగ చరిత్ర'ను వ్రాయుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు 'ప్రతాప రుద్రీయము'లోని రచనలను, 'కాకతీయ సంచిక'లోని వ్రాతలను సవిమర్శగా ప్రస్తావించుచు, కొన్ని గణపతిదేవకృత 'శివయోగసార' గ్రంథావతారికలోని విషయములతో సమన్వయించి, ప్రతాపరుద్రుని తండ్రియగు మహాదేవుడు రుద్రమదేవి మరదియు, నిరవద్యపురాధీశ్వరుడును, చాళుక్య విష్ణువర్ధన వంశీయుడునగు మహాదేవుడేయై యుండునని నిరవద్యపురాధీశ్వరుల శాసనము లాధారముగా విపుల పరిశోధనచేసి నిర్ణయించినారు. ఆ నిర్ణయము చేయుటలో 'కాకతీయ

1. కొలనుపాక శాసనము - తెలంగాణా శాసన సంపుటము 1; కాకతీయ శాసనములు నెం. 39రు.
2. జుత్తిగ శాసనము—Ep. R of 1921 No. 343; S. I. I. Vol X. No. 360.

సంచిక' సంపాదకులు వెలిబుచ్చిన యభ్యంతరములను 'శివయోగసార గ్రంథము'లోని 'అకుపిత రుద్రమాంబి కకు నాత్మజనా బొగడొందు ముమ్మడమ్మ'యను పద్య పాఠమును వివరిస్తూ సమాధాన మొసగి, రుద్ర మ్మకు ముమ్మడమ్మ ఔరసపుత్రికగాదు, కావున యీ వైవాహిక సంబంధమాక్షేపణీయముగాదని వాదించిరి.

శ్రీ వీరభద్రరావు పంతులుగారి వాదన కొంత కాలమువరకు చారిత్రక రంగమున నిలదొక్కుకొని ప్రచారమందినను, ఆ పిదప లభించిన కొన్ని శాసనము లాధారముగానే ముమ్మడమ్మ రుద్రమ కౌరసపుత్రికయే యనితెలి, చాళుక్య మహాదేవుడు ముమ్మడమ్మ భర్త యగుట పొసగని విషయమని, శాస్త్రవిరుద్ధ మని తేలిపోయినవి. దీనికారణంగా వివాదము మొదటికి వచ్చినది.

శ్రీ కె. హెచ్. వి. శర్మగారు తమ 'భాస్కర రామాయణ విమర్శ పరామర్శ'[4]యను వ్యాసమున ప్రసక్తానుప్రసక్తముగా వచ్చిన చర్చలోని 'ముమ్మడమ్మ' భర్త నిర్ద్వంద్వముగా కాకతి మహాదేవుడుగాని చాళుక్య మహాదేవుడు గాడనియు కాకతి మహాదేవ—ముమ్మడమ్మలకే ప్రతాపరుద్రుడు జనించెననియు నా యంశమును బుజువు చేయగల శాసనములో[5] యీ క్రింది శ్లోకముల నుదాహరించిరి.

ఆసీత్పురీ కాకతీయా
రాజ్ఞాం లోకే యశస్వినీ
ఆంధ్రదేశ ధరాపద్మ
మధ్యే కోశవ దాస్థితా॥

సౌధమాలాగ్ర కనకకలశైః
కేసరై రివ
ఉద్యాన శత సాహస్రైః
పత్రై రివ సువేష్టితా॥

తాం పురీం వోరుగల్లాఖ్యా
మావస ద్రాజవల్లభః
కాకతీయ మహారాజవంశ
దుగ్ధాబ్ధి చంద్రమాః॥

మహాదేవ ఇతి ఖ్యాతో
రాజా సర్వగుణాన్వితః
సో ప్యుమాం శంభువ త్కన్యాం
ముమ్మడాంబాం మనోరమాం
భూధరేంద్ర సుతాం స్నిగ్ధాం
ముపయేమే మహామతిః॥

తస్యా మావిరభూ చ్ఛ్రీమా
న్మహాదేవః ప్రతాపవాన్
ప్రతాపరుద్ర రాజాసౌ
కందర్ప ఇవ మూర్తిమాన్॥

ఆ పైని మరి కొన్నాళ్లకు శ్రీ కే. యస్. కోదండరామయ్యగారు 'కకుద్గిరి క్షేత్రము—కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి.'[6] యను వ్యాసములో ప్రతాపరుద్రుడు ఇప్పటి మైసూరు రాష్ట్రములోని 'నెలమంగలము' తాలూకాలోని 'కకుద్గిరి క్షేత్రము'నకు మహారాజబిరుదులతోను, యించుమించుగ చక్రవర్తి స్వాయిలోను, మంత్రి పురోహితులతోను మహావైభవముగా తీర్థయాత్రకు వెడలి, అచటినొక గ్రామమును 'అనంతపురము'అనునామముతో అగ్రహారముచేసి, బ్రాహ్మణుల కిచ్చెననియు నా సందర్భమున నొక శాసనము వ్రాయించుచు 'ఆంధ్రదేశ ధరాపద్మమధ్యస్థకోశమువలె నున్నదియు, సౌధమాలా విరాజితమైనదియు, ఉద్యానవనశతములతో వొప్పినట్టిదియు నగు వోరుగంటిపురములో కాకతీయవంశ దుగ్ధాబ్ధిచంద్రుడును, సర్వగుణోపేతుడునగు మహా

---

3. (a) రాజరుద్రుని గొరవెంకవల్లి దాన శాసనము—భారతి సంపుటము 39. సంచిక 9.

(b) పానుగల్లు శిలాశాసనము—తెలంగాణా శాసనములు—సంపుటము – నె. 34 రు. పుట 75.

4. భారతి—సంపుటము 37—సంచిక 12.

5. ఎపిగ్రాఫికా కర్నాటికా—సంపుటము XII (1921—22) సంఖ్య 14 పుట 27.

6. భారతి—సంపుటము 43 సంచికలు 3–4.

దేవరాజు నివసించుచుండెను. ఆతనికి ఉమాంశసంభవయగు ముమ్మడాంబయనుభార్య యుండెను. ఆ దంపతులకు మహాదేవ ప్రతాపరుద్రుడు జనించెనని' నిజ జననీజనకుల వివరముల దెల్పియుండెనని యుట్టంకించియున్నారు. ఈ విధిని ముమ్మడాంబ కాకతీయ మహాదేవుని అర్ధాంగియని తేలిపోవుచున్నది.

పలువిధములగు పై ఉపపత్తులతో ముమ్మడాంబ కాకతీయమహాదేవుని ధర్మపత్నిగా స్పష్టీకరింపబడియుండ, శ్రీ లక్ష్మీరంజనంగారు తమ ప్రస్తుత వ్యాసములో 'రెండవ మహాదేవరాజే (మొదటి మహాదేవరాజు మనుమడు—చాళుక్య ఇందుశేఖరనరేంద్రుని ద్వితీయ పుత్రుడు) ముమ్మడమ్మయందు భవిష్య చ్చక్రవర్తియైన ప్రతాపరుద్రుని గన్న ధన్యశాలి. ఈ యంశమును నిరాక్షేపముగా స్థాపించు శాసనాధారము లింతవరకును. లభింపకుండుటయే ఇందలి స్వల్పదౌర్బల్యము. ముమ్మడమ్మ రుద్రమదేవి ఔరస పుత్రికయైనచో ఆమెను రుద్రమదేవి మరదియైన చాళుక్యమహాదేవునకు పెండ్లిచేయుదురా? నిషిద్ధబాంధవ్యముగదాయను శంక మాకును కలిగెను కాని రాణి ముమ్మడమ్మ రుద్రమదేవి కడుపునపుట్టిన కుమార్తె కాదనియు, ఆమె పుత్రికా సదృశముగ చూచుకొన్న యువతియనియు, 'శివయోగసారము'ను ప్రాచీనగ్రంథ సాక్ష్యముండుటచే ముమ్మడమ్మను రుద్రమదేవి మరది పరిణయమాడుటలో దోషములేదు. రెండవ చాళుక్య మహాదేవుని కుమారుడు ప్రతాపరుద్రచక్రవర్తి. కుమార్తె పినఉదయమహాదేవి అని తేలినది. కావున కోనగణపతిదేవుని యగ్రమహిషి కాకతిప్రతాపరుద్ర చక్రవర్తికి సాక్షాత్సోదరియో, సవతిచెల్లెలో కాదగియున్నది' అని అతిసాహసముతో నిర్ణయమును ప్రకటించినారు! ఈ ప్రకటనము బట్టి శ్రీ లక్ష్మీరంజనంగారు శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు చారిత్రక పరిశోధనచేయు కాలమున నెట్టి నమ్మకములతోను, సిద్ధాంతములతోను యుండిరో, అప్పటికీ యిప్పటికీ ఆ సిద్ధాంతములను, నమ్మకములను విడనాడక పట్టుకొని యుండిరని తేలుచున్నది! సుమారు మూడున్నర దశాబ్దములు గడచినను, క్రొత్త క్రొత్త శాసనములు బయల్పడి పురాతనసిద్ధాంతములను మార్చుచున్నను, పరిశోధనరంగమున క్షణక్షణమునకు నూత్నపరిణామములు సంభవించి, చరిత్రగతినే మార్చుచు ప్రగతి పథమున పయనించుచున్నను, మారుచున్న లోకముతో మారలేక, పూర్వవాసనలతోనే తమ చారిత్రకరచనా వ్యాసంగముల కొనసాగింప నుద్యమించువారల నేమనుకొనవలె? ముమ్మడమ్మ చాళుక్యమహాదేవుని భార్యయను నమ్మకముతో నున్నందుననే శ్రీ లక్ష్మీరంజనంగారు కోనగణపతి యర్ధాంగి కాకతీయప్రతాపరుద్రుని సహోదరియో లేక సవతిచెల్లెలో యగునని వక్కాణింప సాహసించి, తమ వ్యాసమునకు పెట్టుకొన్న పేరును సార్థకపరచయత్నించినారు! లేకున్న కోనహైహయులకును కాకతీయులకు నెట్టి ప్రత్యక్ష సంబంధ బాంధవ్యములు లేనప్పుడీ బలవంతపు బాంధవ్యానుసంధాన సంరంభ మెందులకు?

కోనగణపతి యర్ధాంగి కాకతీయప్రతాపరుద్రుని సహోదరియో లేక సవతిచెల్లెలోయగునని చెప్పసాహసించిన శ్రీ లక్ష్మీరంజనంగారు తమ దృష్టిని కొంచెము నిశితముగా ప్రసరించియుండిరేని, తమ వాదము నిస్సారమని వారే గ్రహించియుండెడువారు!

కోన గణపతి అగ్రమహిషి ఉదయాంబాదేవి దానశాసనములు పాలకొల్లు ఆలయములో మూడు లభించుచున్నవి. (1) శక 1218 (క్రీ॥ శ॥ 1296) దుర్ముఖి సంవత్సర మేష సంక్రాంతి పుణ్యకాలమున తమ పురుషులైన శ్రీ వన్మహామండలేశ్వర కోనగణపతి దేవమహారాజునకున్నూ, తమకున్నూ పుణ్యముగా క్షీరారామేశ్వరదేవునకు ప్రకటించిన ధర్మములుగల శాసనము.[7] ఇందామె సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులైన మహాదేవ చక్రవర్తి 'కూంతురు' అని ప్రకటించుకొన్నది. (2) శక 1222 (క్రీ॥ శ॥ 1300) శార్వరి సంవత్సర పౌష్య శుద్ధ పంచాదశి సోమవారము,

7. South Indian Inscriptions Vol V. No, 125, Page 47.

ఉత్తరాయణ పుణ్యకాలమందు ఈమె పాలకొల్లునందు వేయించిన శాసనము.[8] ఇందు యీమె తన తండ్రి మహాదేవ చక్రవర్తిని, పెనిమిటి కోన గణపతి దేవరాజును స్మరించినది. (3) శక 1228 (క్రీ॥శ॥ 1306) పౌష్య బహుళ సప్తమి మంగళవారాన ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున క్షీరారామేశ్వరున కీమె అఖండ దీపమును సమర్పించి వేయించిన శాసనము[9]. ఇందు ఆమె 'శ్రీ విష్ణువర్ధన మహారాజులైన నిడుదప్రోలి మహాదేవ చక్రవర్తి 'కూంతురు' పినఉదయ మహాదేవి అమ్మవారు' అని సంబోధించుకొని యీ దానము తన తల్లిదండ్రుల పుణ్యమునకు చేసితినని వాకొన్నది. ఈ మూడు శాసనములందును తండ్రి పేరు మాత్రమే చెప్పి తల్లి పేరును వివరించకుండుటకు హేతువేమియో తెలియుటలేదని శ్రీ లక్ష్మీరంజనంగారు కూడ విచికిత్సకు లోనైనారు! ప్రతాపరుద్రునంతటి వానికి చెల్లెలై, కాకతి రుద్రమ్మకు మనుమరాలై, ముమ్మడమ్మకు కూతురై యున్నచో నామె సగర్వముగా తన తల్లి పేరు చెప్పుకొనుటకేల వెనుదీయవలసి వచ్చెను? పోనీ—ఆమె తన శాసనము లన్నింటిలోను తనకును తమ పురుషులైన కోనగణపతిదేవరాజుల పుణ్యార్థమిచ్చి యున్నవిగాన తల్లిదండ్రుల ప్రసక్తి నెత్తుకొని యుండలేదందుమా? అట్లు కాదే! ఇచ్చిన శాసనము లన్నిటిలో తన జనకుని పేరుదాహరించి, అతనికిని తన తల్లికిని పుణ్యార్థమనియే చెప్పుచు తల్లినామమును మాత్ర ముదాహరింపక మానినది. వానిలో తండ్రిపేరుదాహరించి, తల్లి పేరు విడిచి వేయుటకేదో యొక బలవత్తరమైన కారణముండి యుండవలెను. రుద్రమ తనయ ముమ్మడమ్మయే పినఉదయాంబిక తల్లియై యున్నచో ఆమె తల్లిపేరుదాహరింప సంశయింప బనిలేదు. మీదు మిక్కిలి సగర్వముగా ప్రకటించుకొనదగిన విషయమది! అట్లేల ఒనరింపలేదో తెలియబడదు. అందుచేత శ్రీ లక్ష్మీరంజనంగారు పొసగించిన యీ బాంధవ్యబంధము యే దృష్టితో ని విమర్శించినను నిలుచుటలేదు. ఆ కారణమువలన పినఉదయమహాదేవి ముమ్మడమ్మ 'కూంతురు' అని, ప్రతాపరుద్రుని చెలియలని వ్రాయు వ్రాతలు సమగ్రహణీయములుగావు.

శ్రీ లక్ష్మీరంజనంగారింతటితో నూరకొన్న సమంజసముగా నుండియుండెడిది. ఒకనేళ పినఉదయాంబాదేవి ప్రతాపరుద్రుని సాక్షాత్సోదరి గాకున్నను సవతిచెల్లెలు అయినాయై యుండవలెనని శాసించుచున్నారు! ఇదెట్లో వారు వివరింపలేదు. అయినను మనము విమర్శించి చూతము.

కోనపినఉదయాంబాదేవి శాసనములబట్టి ఆమె తండ్రి చాళుక్యమహాదేవుడనుట నిర్వివాదాంశము. ఆమె తల్లి యెవరో తెలియరాలేదు ముమ్మడమ్మ మాత్రము ఆమె తల్లి కాదని పై విమర్శవలన తేలినది. అట్టి పక్షమున పినఉదయాంబాదేవి తండ్రి చాళుక్యమహాదేవుడు ఆమె తల్లిని, మరి వేరొకతెను పరిణయమాడియుండునని యూహించుకొన్నను పినఉదయాంబిక కాకతిప్రతాపరుద్రుని సవతిచెల్లెలగుటయు గూడ పొసగని విషయము! కావున శ్రీ లక్ష్మీరంజనంగారి యూహ పొరబాటని చెప్ప విచారించుచున్నాను.

శ్రీ లక్ష్మీరంజనంగారి వ్యాసంలో పరామర్శింపదగిన రెండవ అంశము: తోలేటి ఇందుశేఖరుని గూర్చి వారు చేసిన నిర్ణయము. కొలనుపాక శాసనములో ప్రస్తావింపబడిన ఇందుశేఖరుడీ తోలేటి ఇందుశేఖరుడా? అన్న విషయచర్చ చేయుటలో శ్రీ లక్ష్మీరంజనంగారు సహేతుకదృష్టినే ప్రదర్శించినారు. అయితే— తోలేటి ఇందుశేఖరుని చాళుక్య ఇందుశేఖరుని కుమారుడు మహాదేవరాజా కుమారుడని ప్రతిపాదించి, సమన్వయించు ప్రయత్నములో వారు ప్రదర్శించిన హేతువాద మంత బలముగా కన్పించుటలేదు. ఆ విషయమై విమర్శింతము.

ఈ సందర్భమున శ్రీ లక్ష్మీరంజనంగారి వ్రాత యిట్లున్నది: 'ఈతడు తనను గూర్చి సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులైన తోలేటి

8. South Indian Inscriptions Vol V. No. 127, Page 48.
9. ,, ,, ,, 124, ,, 46.

ఇందుశేఖర చక్రవర్తి తన తలిదండ్రులు విష్ణువర్ధనదేవ చక్రవర్తులకున్నూ భీమదేవిగారికిన్నీ పుణ్యముగాను దానముచేసినట్లు శాసనములో10 నుదాహరించి నాడు 'అని తెలుపుచు యీ శాసనములో నుదాహరింపబడిన 'విష్ణువర్ధనదేవచక్రవర్తి' వ్యక్తిత్వ నిరూపణకు యత్నించు సందర్భమున తమ వాదనకు బలస్ఫోరకముగానుండుకొరకు 'వేదుడవోలు చాళుక్య వంశమునందలి మహాదేవనామకభూపతులకు 'విష్ణువర్ధన'అను వంశప్రతిష్ఠానామము చేర్పబడినట్లు కన్పించుచున్నది. చాళుక్య వీరభద్రుని తల్లియైన ఉదయాంబ, తన మామగారిని విష్ణువర్ధన' నామముచేతనే వ్యవహరించినది.11 ఈయన మొదటి మహాదేవరాజని గుర్తించితిమి. కోనగణపతిదేవుని పట్టమహిషి పినఉదయమహాదేవిఅమ్మగారును తమ తండ్రిని గూర్చి 'విష్ణువర్ధన మహారాజులైన నిడుదప్రోలి మహాదేవచక్రవర్తి' అని వ్రాయించినది. ఈతడు చాళుక్యవీరభద్రుని తమ్ముడు రెండవ మహాదేవునిగా నిరూపించితిమి. కాలమునుబట్టి తోలేటి ఇందుశేఖరుడు ఈ రెండవ మహాదేవుని కుమారుడని ప్రతిపాదించుచున్నాము. అనగా ఈతడు పినఉదయమహాదేవి సోదరుడగుచున్నాడు'అని హేతువాదన మొనర్చినారు.

నిడుదవోలు చాళుక్యవంశమునందలి మహాదేవనామకభూపతులకే 'విష్ణువర్ధన'అను వంశప్రతిష్ఠానామము ప్రత్యేకముగా చేర్పబడలేదు. వేంగీచాళుక్యులలో నధికసంఖ్యాకులీ వంశప్రతిష్ఠానామమును తమ పేర్లకు చేర్చుకొనుచునేయున్నారు. దీనికితోడు వారి జన్మనామములనుగూడ జోడించి వాడుచూ వచ్చినారు. శ్రీ లక్ష్మీరంజనంగారు వారి వ్యాసములో వేరొకచోట నీ విషయము నంగీకరించియున్నారు. ఇందు విషయమై వారి అభిప్రాయమిది 'విష్ణువర్ధనుడు' అనునది చాళుక్యరాజులు అవలంబించు వంశపరంపరాగతనామము. జన్మనామము వేరుగా నుండును. రాజరాజనరేంద్రునకుగూడ విష్ణువర్ధన వ్యపదేశము కలదు'అని వారులేఖించియున్నారు. ఇక్కడ మరొక యుదాహరణము నిచ్చుట అప్రస్తుతము కాదనుకొందును. రాజరాజనరేంద్రుని సవతితమ్ముడు విజయాదిత్యునకుగూడ నీ విష్ణువర్ధననామము జంటించబడి యున్నది. విజయాదిత్య విష్ణువర్ధనుడని యాతని పూర్తినామము. కావున చాళుక్యవంశాగ్రణియని సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజులని, విష్ణువర్ధనులని యన్న, వారు చాళుక్యవంశజులని తెల్పుటకు మాత్రమే యుద్దిష్టమైనదిగా యెంచుకోవలెనేగాని అవియే వారి నామధేయములని పొరబడరాదు. చాళుక్యవీరభద్రుని తల్లియైన ఉదయాంబ తన మామగారిని 'విష్ణువర్ధన' నామముచేతనే వ్యవహరించినదని చెప్పుచూ శ్రీ లక్ష్మీరంజనంగారు వారిని మొదటి మహాదేవరాజుగా గుర్తించినామనినారు. ఈ గుర్తింపు యెట్లు జరిగినది? వారు సూచించిన శాసనములో 'దేవ'యనిగాని 'మహాదేవ'యనిగాని శబ్దమే కనపించదు. అయిన ఇందుశేఖరుని తండ్రి మహాదేవరాజని యెట్లు గుర్తించినారు? ఈ శాసనమును కొలనుపాక శాసనములో సమన్వయించి, ఇందుశేఖరుని తండ్రిపేరు మహాదేవరాజని గుర్తించుట జరిగినది. అయితే తోలేటి ఇందుశేఖరుని శాసనములోని 'దేవ' శబ్దము 'మహాదేవ'శబ్ద పర్యాయముగా వాడినట్లు రూపించగల ఇతర శాసనములుగాని రచనలుగాని కనిపించుటలేదు!

శ్రీ లక్ష్మీరంజనంగారు నుడివినట్లు పినఉదయాంబాదేవి శాసనములలో ఆమె తండ్రియగు మహాదేవరాజు స్పష్టముగా 'మహాదేవరాజు'అని యుదాహరించియేయున్నడుగాని 'విష్ణువర్ధన'నామము నుదాహరించి మహాదేవరాజను యథాస్ఫురణ మిచ్చియుండలేదు. ఈ సందర్భమున ఆయా శాసనపాఠభాగములపాఠకుల తెలివిడికై యీ క్రింద నిచ్చుచున్నాను.

(i) శకవర్షంబులు 122 [ ] గునేంటి వవుష్య బ 7 మంగళవారన శ్రీ విష్ణువర్ధన మహారాజులైన నిడుదప్రోలి మహాదేవ చక్రవర్తి కూతురు పినఉదయమహాదేవి [మ్మ] [రు] తమ తల్లిదండ్రులకు ధర్మువుగాను.........

(ii) శకవర్షంబులు 1218 గు నేంటి దుర్ముఖి సంవత్సర మేషసంక్రాంతి పుణ్యకాలమునయందు క్షీరారామేశ్వర శ్రీమ[హా]మహాదేవంకు

10. South Indian Inscriptions Vol V. No. 147, Page 56.
11. ,, ,, ,, 122, ,, 45.

స్వస్తి సర్వ్వలోకాశ్ర[య] శ్రీ విష్ణువర్ద్ధన మహారాజులైన మహాదేవచక్రవర్తి కూఁతురు ఉదయ మహాదేవి అమ్మంగారు...........

(iii) [శకవర్షం]బు]లు 1222 గు నేంటి శార్వ్వరి సంవ్వత్సర పౌష్య శుద్ధ పంచ్చా[దె]శియు సోమవారమునాండు ఉత్తరాయణ సంక్రాంతికాలమందు క్షీరారామేశ్వర శ్రీ మన్మహాదేవునికి స్వస్తి సర్వ్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ద్ధన మహారాజులైన మహాదేవ చక్రవర్త్తి కూఁతురు ఉదయమహాదేవి అమ్మంగారు............

పై యుదాహరణలబట్టి చాళుక్య ఇందుశేఖరుని రెండవ కుమారునిపేరు శాసనములలో స్పష్టముగా మహాదేవరాజని యుట్టంకింపబడుచూ వచ్చెనే గాని వేరొకవిధమున వ్యవహరింపబడుట కానరాదు. అట్టియెడ తోలేటి ఇందుశేఖర నృపాలుడు తన శాసనములో 'స్వస్తి [1] శ్రీ శుభకర శకాబ్దంబులు 1222 నేంటి ఆషాఢ శుద్ధ దశమి సోమవారాన దక్షిణాయన సంక్రాంతి పుణ్యకాల సమయమున సర్వ్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ద్ధన మహారాజులైన తోలేటి ఇందుశేఖరదేవ చక్రవర్త్తి తమ తల్లిదండ్రులు విష్ణువర్ద్ధనదేవ చక్రవర్త్తులకును ఛిమిదేవింగారికిన్ని పుణ్యముగాను'అని తన తండ్రి పేరును పూర్తిగా నుదహరింపక 'దేవ' పదముచే సూచించుటచే నాతడు 'మహాదేవచక్రవర్తి' యగునా? యను సంశయము తలయెత్తినది. అయితే శ్రీ లక్ష్మీరంజనంగారు 'కాలమ'నుబట్టి యీతడు మహాదేవరాజేయని చెప్పవచ్చుననుట కొంత సమన్వయ సాధనకు తావొసంగుచున్నది. శకవర్షము 1222 సంవత్సరమున సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజులుగా నుట్టంకింపబడువారు నిడుదప్రోలి మహాదేవ చక్రవర్తి యొక్కడే కానుపించుచుండుటచే పక్షాంతరమున నీ నిర్ణయమును సమర్థింప వీలున్నది. అదియునుగాక తాతపేరు మనుమనికుంచు సాంప్రదాయమునుబట్టి చూచినను తోలేటి ఇందుశేఖరుడు చాళుక్య ఇందుశేఖరుని కుమారుడు మహాదేవరాజు కుమారుడనియే నిర్ధారింపవలసియున్నది. అందుచే 'దేవ'పద ప్రయోగము మా మహాదేవరాజునే సూచించునని మనము సరిపెట్టుకొనవచ్చును.

ఈ పైన నడచిన చర్చ ననుసరించి శ్రీ లక్ష్మీరంజనంగారిచ్చిన వంశవృక్షముల నీ క్రింది విధముగా సవరించనలసియుండును.

## నిడుదవోలు చాళుక్యలు



## కోన హైహయులు




మహాసామ్రాజ్యాధిపతియైన కాకతి గణపతి కూతురు రుద్రమ, సాధారణ సామంత నృపాలశ్రేణికి చెందిన చాళుక్యవీరభద్రు నుద్వాహమాడు పరిస్థితు లేల వచ్చెనో, నాటి రాజకీయపరిణామ ప్రభావము లేమేని యీ కళ్యాణగాథలో ప్రాముఖ్యము వహించె నేమోయను అంశముల విమర్శింపకయే శ్రీ లక్ష్మీ రంజనంగారు విడిచిపుచ్చినారు. అదియునుగాక కాకతీయరాజ్యరమా ప్రాభవోన్నతులకు మూలకందములై నిలిచిన ఇందులూరి సోమయ, అన్న మంత్రుల వంశమునకుచెంది, నిడదవోలు చాళుక్య ప్రభువులకడ నమాత్యపదవీస్థితులైన ఇందులూరి నూకయ, బల్ల ప్రెగ్గడ, నాగమంత్రివర్యుల మంత్రాంగము లేమేని యీ కాకతీయ, చాళుక్య వైవాహికబాంధవ్యబంధములకు దోహదకారులయ్యెనేమో యోచింపవలసియున్నది.

---



# జిలుగు తలపు

## "సాంధ్యశ్రీ"

ప్రతి ఉదయము నా హృదయము భక్తిపార
వశ్యత తపించు—సాంధ్య మవశ్య మావ
హిల్లు? సంధ్యమ్మ నెగసూయి! ఇంతియయ్యె
నిలువదే హ్యామిష్టి ఎద; తులువయయ్యె...!

సంతసమము—సంతసమును—సమరమ్ము
బూని సమసాళ్ళ నా పర్వభూమికయయి
ఆర్తి దీప్తి మిశ్రితముగ అవరించు
వెలుగునీడలు కల్మలేములను బోలె...!

గ్రీష్మము—శరత్తు లోకసారి కెంలి మండు
ఎండలున్ పండువెన్నెల్ పది కాచి
నాదుభావ విముత్పథాన వెలిగెడిని
తరుణ, తరళ హృత్పాసమంత కలగెడిని...!

కొట్టుమిట్టాడుచుంటిని కుదురని యొద
తలపు లేదన్న కలవ, సుంతకలదన్న
లేద—శింద్రీ! వెలుంగును కాదు మఱి తి
మిరముగా నా—నాదు బ్రతుకు మిపులవింత...

మనసులో మనలెడి ఒక మంజులోహ
యూప మేర్పడ దిదమిత్థమూఢభావ
మద్ది వంతరించుకొందు ఐన నెంత
తీపియో కొగుబాళింపకో తెలుపలేను.

సర్వసావహారిణి యో నిశావధూటి
తిమిరఘాలస్థ శంపాలటకవిధమ్ము

## జిలుగు తలపు

వివృతి పొందగాను నాదు శ్రుతిహృదయ
వీథిపై జిలుగు తలపు వెలుగు మెలగ...!

నాదు ప్రాణగత సకలస్వాదు లక్ష
ణమ్ము—తద్భావవశత తనరి మృదులత
నొదిగి వినయ పునీతమై యూహా—దరుల
ముట్టు తన్మయత మునింగిపోదు నపుడు...!

ఒనర స్వామి అంచదేశ్వరుని కనుగొన
చల్లు చల్లచూపుల జల్లు జాలునందు
తమ్మి నోచు రేకులు విప్పి తావి బరపి
స్వామి చరణాల పొరలాడ భావ మొదవు.



# "ఆత్మ యెరుక"

## శ్రీ కపిలవాయి లింగమూర్తి

ఇదియొక కొరవంజి. దీనికి మాతాపుత్రికలగు రెండు తాళపత్రులు నాకు లభించినవి. మొదటి దాని ముఖపత్రము భ్రష్టమైనది. రెండవదాని యందు రెండు దరుపులు మాత్రము శిథిలమైనవి. కడమ భాగమంతయు రెండు ప్రతులందు సురక్షిత ముగా నున్నది.

శ్రీ యస్వీ జోగారావుగారు తమ పరిశోధనా గ్రంథమున తమ కిరువదియొక్క కొరవంజాలు లభించి నటుల దెలిపిరి అందిది చేరలేదు గనుక దీనిని గురించి వ్రాయుచున్నాను.

ఈ కొరవంజి కర్త సిద్ధన. అతడు తనను గురించి

'సాంబయ భ్రమరాంబ సుతుడు సగుణుండు.
పంచాననుడు పరవిద్య సాధకుడు
సరస సువర్ణసగోత్రోద్భవుండు
కాత్యాయన సూత్ర ఘనుడు ప్రణవశాఖ
ఈశాన్య ప్రవరుడు యోగ పురుషుండు
అత్తలూరి పురీశుడాత్మ ప్రకాశ
కలితుడు సిద్ధనాహ్వయుడు
రచియించె యోగరసామృత సుధాబ్ధి

ఈ కథ...' అని గ్రంథాంతమున వివరములు తెలుపుకొనినాడు. గోలకొండ కవుల సంచిక యం దత్తలూరి కవులుగలరుగాని వారి కది గృహ నామమగుటచే దానినిబట్టి అత్తలూ రే ప్రాంతమున నుండునో యెరుగ వీలుగాదు. ఈ ప్రతినిబట్టి కవి కాలాదులనుగూడ నెరుగు నవకాశము లేదుగాని కొరవంజాలు కావ్యపరంపరయందు చివరవి గనుక నీ కవి నూరేండ్లలోపువాడై యుండునని యూహించు చున్నాను. కొరవంజి, 'కొరవ+అంజి' అనుపద చ్ఛేదము ననుసరించి ఇది ప్రథమమున పర్వత ప్రాంతీయుల నృత్యవిశేషమై యుండి కాలక్రమమున నాగరికతా ముద్రవడసి కావ్యరూపమందెనని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగా రనగా, 'కొరవంజి యనగా నెరు కత; ఎరుకత ప్రాధాన్యముగల యక్షగానములను కొరవంజి యందురు. ఇట్టివి ద్రావిడ వాఙ్మయమునను న్నవి. వీనివలన మనకు ద్రావిడ వాఙ్మయముతో గల సంబంధము వెల్లడియగుచున్నది' అని శ్రీ చింతా దీక్షితులుగారు నుడివి పార్వతి కొరవంజి, అర్జున కొరవంజి, కృష్ణకొరవంజి యని కొన్ని కన్నడ కొర వంజాలను పేర్కొనిరి.

నాకు మా ప్రపితామహుని తాళపత్ర గ్రంథ సంచయమున నామమాత్రావశిష్టమైన పార్వతి కొరవంజి యొకటి లభించెను అది యాంధ్రమున నుండెనుగాని క్రిమిదష్టమై త్రాడు దూర్చెడు రంధ్రములవరకు విరిగి చెల్లాచెదరై యుండుటచే ప్రతి సమగ్రముగా లభింపక విడువవలసి వచ్చెను. అది లభించియుండిన ఆ కొరవంజి స్వతంత్ర రచ నయో లేక కన్నడానువాదమో తెలిసికొన వీలయ్యెడిది. పరిశోధకుల దృష్టికి రాక ఇంకను మన తెలుగు దేశమున మూలలందిటుల హస్తలిఖిత ప్రతులెన్ని మగ్గుచున్నవో, అట్టివాని నెల్ల సేకరించి రక్షించు కొనవలసిన బాధ్యత మనపై నున్నది

'కొరవంజి' యను పేరు కదిరీపతి కాలమున ఎరుకచెప్పువారికి జెల్లుచుండెనేమోకాని నేడా పేరు

మహబూబునగరమండలమున మరియొక జాతికి జెందియున్నది. కొరవ లేక కురవ యనగా మలకురవ గొఱ్ఱె. అనగా నిడుపాటి యున్నిగల గొఱ్ఱె. కురువ లనగా గొల్లలవంటి యొకజాతి. శబ్దరత్నాకరము కురువ పదమున కీ యర్థమునే యంగీకరించినది.

యక్షగానములందు ఎరుకల పాత్రము సింగి—సింగడను నామములతో కవులు వ్యవహరించిరి. నృసింహమూర్తి చెంచితను పెండ్లియాడి వారికి బంధువైన కతన నా పేరు వారికి సాంప్రదాయమై చెల్లుచున్నదని ప్రతీతి. అయిన ఆచార వ్యవహారము లందు చెంచులచే పూర్తిగా భేదించు ఎరుకులకీ నామము కవులెట్లుపయోగించిరో! నాకు జూడ యక్షగాన కవులు కురవంజి కుంచిన ఈ నామము జాతి సంబంధమైనదిగాగాక, శృంగగ్రాహికాన్యాయమున దూచిన వారి లక్షణములు జెప్పెడు జాతి కుంచిన సంకేత నామమేమోయని దోచును.

ఎరుకులకుగల ప్రజానన్నిహిత లక్షణమే పామరజనోపయోగమగు యక్షగాన శాఖయందు వారి కొక ప్రత్యేక స్థానము గల్పించినదనుట వింతగాదు. కనుక అటుల ఎరుకత ప్రధానమైన యక్షగానము 'కొరవంజి' యని పిలువబడినది.

కొరవంజి కావ్యశాఖలోనిదే గనుక అందలి ఎరుకతయు కావ్యనాయకులతోపా టలౌకిక యైనది. ఆమె సామాన్య మానవకాంతగాదు. ఒక్కొక్కపు డా రూపమున హరిహరులు, లక్ష్మి పార్వతి సరస్వతులు యోగమాయ ఇటులెవరో యొక వేల్పు లవతరింతురు గనుక యామె వేల్పుసాని.

ఎరుకయనగా తెలివి లేక జ్ఞానము. కనుక కావ్యమునందలి యెరుకత యెరుగని స్తంభన, వశీకరణ, ఉచ్చాటనాదితంత్రముండదు. గజాశ్వలక్షణము లందు, స్త్రీ సాముద్రికమునందు, రత్నపరీక్షయందు ఆమె యెరుగని మర్మముండదు. పరకాయ ప్రవేశ





వ్యోమా మనాదులుగూడ నేర్చియుండును. ఇటు లామె సమస్తవిద్యలు మూర్తీభవించిన చెలువ. జ్ఞానమునకు ప్రతీక. నాయికానాయకులకు సంయోగవియోగము లందు అగతానాగతములు జెప్పి, వారి యాశా బంధము ద్రెవ్వకుండ. మనోద్యోగమునకు బూన కుండ గాపాడుచు కథను సాగించును. అట్టి పట్టు లందే కవులు సామాన్యముగా నీ పాత్ర నుపయో గింతురు.

కావ్యము రసాత్మకముగాన నందీ పాత్రమునకు సముచితస్థానమున్నదిగాని నీరసమైన వేదాంతమున నీ సోదికి చోటెక్కడయని కొందరికి శంక గలుగ వచ్చును. ఆధ్యాత్మవిషయము జ్ఞానపూర్వమైనది. దానిని జనరంజకముగా నిర్వహించుటకు వివిధశాస్త్ర పరిజ్ఞానమున్న తప్ప సాధ్యముగాదు. కనుక గహన మైన వేదాంతవిషయమును పామరులకు సులభముగా బోధింపనెంచిన కవులందుకు జ్ఞానవాహికయైన యెరుకతను నెన్నుకొని కొరవంజి రచించుట యౌచిత్య మెరిగి చేసినపనే యనవలెను.

మాటవరుసన మనము మిక్కిలి దూరము వచ్చితిమి. కనుక ఇక ప్రస్తుతమునకు వత్తము.

ఈ కొరవంజియందలి విషయము సర్వాంగ పరిత్యాగురాలైన మనఃకాంతకు నాత్మకాంత ఎరు కతయైవచ్చి సాంఖ్యతారకామనస్కము లుపదేశించుట. కథయంతయు నొక వృద్ధకుడు ఎరుకత ఈ రెండు పాత్రలచేతనే సాగునది. సంవాదముల నడుమ నడుమ చిన్నచిన్న ముచ్చటలు, సూచనలతోగూడిన వాక్యము లున్నవి.

ఆరంభమున గురుస్తుతి యనంతరమున

వచ: ఓంకార మహత్యంబు. సర్వయోగ ష్ణ్మత అంతరంగ భావంబని, సద్గురు కృపవల సంగని, నిగమార్థసంచర ప్రభావంబు. సాంఖ్యతారకా మనస్కంబుల, ఆత్మయెరుక కురంజి యక్షగాన కథా క్రమం బెట్టిదనిన' అనుసూత్రధార సూచనా వాక్య ములో కథారంభమగుచున్నది. ఆ పిమ్మట

ద్వి: శృంగారముగ నాత్మ చెలరేగి యపుడు
పొంగుచు నెరుకల పోలిక వేషంబు
భావించి దాల్చియు...

ఇది హంగుదారుని సూచన కాబోలును. ఆ పిమ్మట తెర లోపలి కేతెంచిన ఎరుకత—

ద్వి: పంచభూతంబుల పట్టి బంధించి
పంచవింశతితత్వ భావంబుగాంచి,
.....................
సాత్వికమను చీర సత్తను రవిక,
స్థిరముగా ధరియించి...
యోగ్య జనులకు యోగ విధి నేనుదెలుప,

వచ్చితినని తెరలోపలి నుండియే ప్రేక్షకుల నుద్దే శించి విన్నవించును. పాత్ర తెరవెడలిన పిమ్మట

వచ: "ఇట్లు ఎరుకలసాని సర్వాంగ పరి త్యాగియైన మనఃకాంతకు యోగరహస్య ముద్ర సాధకక్రమనిర్ణయంబులు. యెరుకజెప్పు సమయం బున ప్రమథగణాధీశ్వర పరమ భాగవత పూర్వదేవతా ప్రార్థనంబు జేసెనట యెటువలెను.'' అని మరల సూత్రధార ప్రసూచన గేదు. తదనంతరమున ఎరుకత

ద్వి: శ్రీవిష్ణుమూర్తియో శిష్టరక్షకుడ,
ఆదిశేషుడ నిన్ను ఆత్మలో దలతు,
బ్రహ్మ విష్ణు మహేశ్వరుల—
—ప్రణుతించె దాను
అరయంగ భూదేవి ఆకాశవాణి
యాగంటి లక్ష్మీశ యామునాచార్య
యా మనయం బెరు దత్త వేంకటరాయ?
రామదాసు కబీరు భల్లాణరాయ
చల్లమాంబా నీకు శరణు జేసెదను
బోయకన్నప్పాది భక్తులందరకు
కిన్నర బ్రహ్మయ్య కల్యాణ బసవ
పోతులూరి పురీక ప్రార్థింతు విన్ను
శ్రీశైల మలయ్య చిరుతొండ భక్త
మీకు సాయముగానె మలయాళదేవి
కోరి వాక్కివ్వవే కొల్లాపురమ్మ.

అని తన యిష్టదేవతలను స్తుతించినది. ఇందు చల్లగాంబ, కన్నప్ప, కిన్నర బ్రహ్మయ్య మున్నగు శివభక్తుల స్మరణ కవి శైవాభిమానమును చెప్పక చెప్పుచున్నది. కాని కొరవంజి కొల్లాపురమ్మను దలచుట ఆనవాయతీగాక అందేదైన రహస్య ముండునేమో.

కొల్లాపురమ్మ ఎవరు? ఆమె అగతానాగత వేదియా! వాగ్దేవతయా! కొరవంజికి ఈ కొల్లాపురమ్మకుగల సంబంధమెట్టిది! ఇది కొరవత పేరువలెనే పరిశీలనీయవిషయమని భావించుచు తెలిసిన వారి విషయమును గురించి వ్రాయగోరుచున్నాను.

కావ్యమున ద్విపదల పేరున నన్నియు మంజరీ ద్విపదలే గూర్చబడినవి. దరువులేగాక సీసగీతములు నడుమ నడుమ ముచ్చటలు నున్నవి. ప్రపంచోత్పత్తి, పంచీకరణ విధము దెల్పు సందర్భమున ప్రసిద్ధములగు శ్లోకము లుపయోగించి వానికి వివరము జెప్పబడినది.

కవి తాను పరవిద్యాసాధకుడనని జెప్పుకొనినాడు. అయిన నగుగాక కాని కవితాసాధకుడు గాడు అందునను నిది శాస్త్రము గనుక దానికి కావ్యవేషము దొడుగుట కష్టము.

యక్షగాన కర్తలు సాధారణముగా ప్రజానురంజనమే యుద్దేశించిన వారు గాన పెక్కురు లక్షణ పరీక్ష ను జేసినవారు గారు. అట్టిదోషము తన యందు గలదని కవియే స్వయముగా నొప్పుకొనినాడు. శ్రీ యస్వీ జోగారావుగారు తమ పరిశోధనా గ్రంథమున నిట్టి కవులను గురించి, "అల్పసంస్కారులైన కవుల చేతిలోబడి యక్షగానరచన ప్రౌఢి యంతకంతకు దిగజారిపోయినది కాని యిది సామాన్య జనరంజక ప్రదర్శనోద్దిష్టమై కొంత క్షంతవ్యమైనది." అని సెలవిచ్చినారు. కనుక కవి లాక్షణికుడు గాకున్నను గహనమైన వేదాంత విషయమును తేటతెల్లముగా పామర జనులకు జెప్పినవాడుగాన నతని కొరవంజి కవితాదృష్టిని గాకున్నను విషయదృష్టిచే నాశాఖ యందలి లోపము బూరించుటచే రక్షించుకొనవలసినదై యున్నది.



# తిలక్ కవిత్వంలో భావ ఔన్నత్యం

శ్రీ కళింకోట ప్రభాకరదేవ్

ఆధునిక కవులలో లబ్ధప్రతిష్ఠులైన బహుకొద్ది మందిలో దేవరకొండ బాలగంగాధర తిలక్ ఒకరు. వచన కవిత్వంలో ఇతడు అందెవేసిన చేయి. ముఖ్యంగా కవిత్వం సమాజ వికాసానికి దోహదం కావాలని. నేటి యువకవులు తత్కార్యానికి నడుం కడుతున్నారు. సాంఘిక సంక్షేమం దృష్ట్యా ఇది ప్రోత్సాహనీయమే. సమకాలీన ప్రజా జీవితాలకు చేరువకాని రచనలు ఎక్కువకాలం సాహిత్య సీమలో మనుగడ సాగించలేవు. ఈ విషయం గ్రహించి, తన రచనలద్వారా ప్రజలకు అతిసన్నిహితుడుగా రాగలిగి ప్రజల ఆదరణను సంపాదించుకున్నారు తిలక్. వీరి 'అమృతం కురిసిన రాత్రి' కవితా సంకలనానికి సాహిత్య అకాడమీ బహుమతి లభించింది.

తన కవిత్వం గురించి తిలక్ వ్రాసుకున్న మాటలు మనల్ని కొంత ఆలోచనలోను, ఆశ్చర్యం లోను ముంచెత్తుతాయి.

'నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు.
నా అక్షరాలు ప్రజాశక్తులు వహించే విజయ ఐరావతాలు.
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు.'

కవిత్వం అన్నది హృద్యంగా వుండాలి. ఆకలి మీద చెప్పినా, ఇంకా దేనిమీద చెప్పినా కవిత్వం సుగంధ పరిమళాల్ని వెదజల్ల గలగాలి. పాఠకుడికి రసానుభూతి కలిగించాలి. ఈ విషయాల్ని దృష్టిలో వుంచుకుని తిలక్ తన కవిత్వంగూర్చి అనుకున్న మాటల్ని పరిశీలిస్తే అప్పుడు తిలక్ రసహృదయం మనకు స్పష్టమవుతుంది. తిలక్ అనుభూతివాది. ఏది చెప్పినా అతడు చాలా చక్కగా, అందంగా చెప్పగలడు. సామాన్యుని జీవనాన్ని ఇతివృత్తంగా తీసుకుని, కవితాభరణాలతో అలంకరించి మనముందు అపూర్వసౌందర్య కవితాకన్యను సాక్షాత్కరింప చేస్తాడు.

కవిత్వం కేవలం సంకుచితసమాజం మార్పుకేనన్న అభిప్రాయం వచనకవిత్వం వ్రాసేవారిలో ఈనాడు కానవస్తుంది. వచనకవిత్వం ప్రయోజనం సంఘశ్రేయస్సు కావచ్చును. కాని, వచనకవిత్వంలో శృంగారరసాన్ని పోషించడం దోషం కానేరదు. తన ప్రేయసితో తిలక్ యిహలోకంలోని మోసాలను బాధలను అన్నింటిని మరచి దూరంగాపోదాం రమ్మంటాడు. దీన్నిబట్టి తిలక్‌ను కొంతమంది 'ఎస్కేపిస్టు' అనడం నేను ఎరుగుదును. సామాజికశ్రేయస్సు కొరవడనంతవరకు వచనకవిత్వంలో శృంగారరసపోషణ, సౌందర్యవర్ణన వుండొచ్చునని నా అభిప్రాయం. పైపెచ్చు, ఇది కవిత్వానికి పరిపూర్ణతను ప్రసాదిస్తుంది. తిలక్ భావకవి, రసహృదయుడు.

అతడు 'స్వేచ్ఛావిహారం'అనే గీతంలో
'సరుగుడు చెట్లనీడలలో
సరదాగా తిరుగుదాం
.........ఒక్కసారి యిల్లు విడిచి
ఉల్లాసంగా రా చెలీ'అని ప్రేయసిని ఆహ్వానిస్తూ - ఈ లోకంగురించి ఆమెతో యిలా అంటాడు.

'ఆనందాన్ని చంపేందుకు
అనంతంగావుంది లోకం.
..... ....................
అడుగడుగునా యుద్ధభయం
మలుపు మలుపునా మృత్యుముఖం
ఆకలి నిరాశరోగం
అసూయ, ద్వేషం, స్వార్థం

రోతపోని చాతగాని
ప్రభుత్వాలు ఉద్రేకాలు

అంటూ;

'కొంచెంసేపు స్వప్నంలోకి
గోర్వంకల రెక్కలతో
ఎగిరిపోవా మన్నీ మరచి
అబద్ధాన్ని ఆశ్రయించిన మఖం
నిజాన్ని నిరూపించే నరకంకన్నా

వెయ్యిరెట్లు నయం'— అని స్వప్నంలోకి ప్రేయసితో జారిపోతూ, లోకం తమల్ని 'ఎస్కేపిస్టు'లని అంటుంటే—

'—నిన్నూ, నన్నూ బలహీనులనీ
ఎస్కేపిస్టులని నిందిస్తుంది
ఊపిరాడక గిజగిజలాడే లోకం
సింధూరంకన్నా ఎరుపైన నా
హృదయాన్ని వీళ్లు చదునలేరు.
ఇల్లువిడచి ఒళ్ళుమరచి
ఒక్కసారి రా చెలీ!' అని సమర్థించుకుంటాడు.

'నువ్వులేని నీ పాటవుంది'అనే గీతంలో తన ప్రేయసితో 'ఇజాలు, రాజకీయాలు, వాదాలూ, హత్యలు, యుద్ధాలు; యింకా యిటువంటి చెత్తా చెదారం మనస్సులలో పేరుకోకముందు; పండిన మొగలిపొత్తివంటి పరిమళంగల ప్రారంభ యవ్వనపు నిండైన; ఆరోగ్యపువాకిళ్లముందు విరిసిన పంది వర్ణనం పువ్వులమధ్య; నువ్వూ నేను కూర్చుని అలాగ ఒకర్నొకరు చూసుకుంటూ; ఈ లోకంలోని బాధ లన్నింటిని మరిచిపోదాం; అంటాడు.

వచనకవిత్వంలో శృంగారరసాన్ని అత్యంతప్రతిభా వంతంగా పోషించగలిగాడు తిలక్.

'విరహోత్కంఠిత' గీతంలో ఒక విరహిణి భావావేశాల్ని చక్కని శైలిలో వర్ణిస్తాడు.

'ఈ గది స్వప్నాలతో నిండిపోయింది
నా మది వ్యగతాలతో కుంగిపోయింది.
యింకా రావెందుకు ప్రభూ!
శంకాకులమై ఈ రాత్రి పడలిపోతుంది.'

అంటూ—

'అవధరించవెందుకు పరిపక్వమైన నా
యౌవన విన్నపాన్ని
అవధరించవెందుకు అసకృదతిశయోక్తిశీలమైన
నా తనూ కావ్యాన్ని
జాగుసేయకు ప్రభూ! కడ
జాము వచ్చెనా, తెలి వెలుగు పారెనా నిష్ఫలమివన్నీ
వాసంతికా సురభిళ శ్రీమంత మీ నిశాంతమ్ము
నవ్వులయించును
ఎందుకింత నిర్దయ ప్రభూ!
ఏకాంత కుంత నిహతమ్ము రసైకమవ్వావనా
శకుంతమ్మ'—అంటూ ప్రియుణ్ణి ఆహ్వానిస్తుంది.

ఎంత చక్కని భావనా పటిమ! మనోహరమైన శైలి!!

ఈ గీతం చదువుతుంటే ప్రణయ కవితా రచనలో మన పాతకవులకు తిలక్ తీసిపోడనిపిస్తుంది.

ఈ నాడు వచన కవిత్వం ఏవో కొన్ని ఇతి వృత్తాలకు మాత్రమే పరిమితమై వున్నదనుకోవడం పొరపాటు. తిలక్‌వంటి కవులు వచన కవిత్వంలో న్నీ రసాలను పోషించ గలిగారు.

విభిన్న భావాల్ని చక్కని శైలిలో మలచి రచన సాగించాడు తిలక్. ప్రతి చిన్న సంఘటనకి అమితంగా చలించిపోయే సున్నిత మనస్కుడు ఆయన. అతనికి యుద్ధమన్నా, బాధలన్నా ఎంతో భయం. వాటిని నిరసిస్తూ ఎన్నో చోట్ల తన వ్యతిరేకతను కనబరుస్తాడు.

'వెళ్లిపొండి వెళ్లిపొండి' అనే గీతంలో సమాధుల చుట్టూ తిరుగుతూ, రోదిస్తున్న మృత వీరుల బంధువుల్ని చూసి చలిస్తాడు తిలక్. మని షిని విచిలితున్ని చేసే ఆ వాతావరణాన్ని తన కవి తలో సమర్థవంతంగా చిత్రీకరిస్తాడు.

'చీకటి పడేవేళ
చిరుతపులులు పశువుల్ని నోటకరచుకుని
పోయేవేళ

పాడుబావిలోకి పడుచు విధవలు దూకేవేళ
చచ్చిన చరిత్ర బొమికలకోసం కుక్కలు
కొట్లాడుకునే వేళ
'దెయ్యపుమర్రిచెట్టుమీద దీనంగా అరుస్తూ
పిట్టలు కళ్లు తేలవేసేవేళ

ఏదో భయం భయం
చుట్టు మరగ విషం
........మృషావిషం
దుఃఖవిషం; పొంగిపొంగి పొర్లిపొర్లి వస్తుంది.
—శవాలు మాట్లాడవు
సమాధులు చూపించవు
మృత్తిక గుర్తించదు
మిత్తికి దయవుండదు
మీ రోదన మీలోనే అణచుకుని
ఇలాగ యిలాగ యీ పాముల పుట్లమ్మట
ఈ మోడు చెట్లమ్మట, కూలిన గట్లమ్మట
వెళ్లిపొండి, వెళ్లిపొండి'

అంటూ తన బాధ నణచుకుని వాళ్లను ఓదార్చడానికి ప్రయత్నిస్తాడు. యుద్ధంపైన తిలక్‌కున్న ఏహ్యత అంతర్లీనంగా ధ్వనిస్తుంది— కవితలో. ఒక సైనికుడిగూర్చి వ్రాస్తూ, అతనిచేత యిలా అనిపిస్తాడు—

'—నే నిదివరకటి నేను కాను
నాకు విలువల్లేవు
నాకు అనుభూతుల్లేవు
చంపడం, చావటంలాంటి అలవాటయ్యింది.
కనిపించే ఈ యూనిఫారంకింద
ఒక పెద్దనిరాశ, ఒక అనాగరికత.'

యుద్ధవ్యతిరేక ధోరణులు, శాంతిపూరిత ధోరణులు మనకు అడుగడుగునా తిలక్ కవితలలో కన్పిస్తాయి. యుద్ధానికి ఆహుతులైన సహస్రకోటి సైనికులపై జాలి గొల్పేలా మనల్ని యిలా ప్రశ్నిస్తాడు.

'—ధాత్రీజనని గుండెమీద
యుద్ధపు కొరకంచుల ఎర్రని రవ్వలు
మీ రెవరైనా చూశారా
కన్నీరైనా విడిచారా...?
............................
కోటికోటి సైనికుల ఊపిన
కన్నుగుడ్ల అద్దాలలో ప్రతిఫలించే నిజాలను
'మీ రెప్పుడైనా చూశారా
కన్నీరైనా విడిచారా...?
—మీ రెప్పుడైనా మేల్కొంటారా
చీకటి తెరలను చీలుస్తారా
ప్రభాత విపంచిక పలికిస్తారా?'

సాహిత్యం ప్రజాజీవనానికి ప్రతిబింబంగా వుండాలి వాళ్ల సమస్యల్ని పరిష్కరించగలగాలి. తిలక్ బాధార్తుల జీవనాన్ని జాలిగొల్పేలా వర్ణిస్తూ—

'నేను చూశాను నిజంగా మూర్తీభవత్
దైన్యాన్ని, హైన్యాన్ని,
క్షుభితాశ్రు కల్లోల జలధుల్ని; గచ్ఛత్
శవాకార—వికారుల్ని
ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన
ప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?'

—అని ప్రశ్నిస్తూ...

'ఈ ఆర్తి ఏ సౌధాంతరాలకు వయవించ గలదు?

ఏ రాజకీయవేత్త గుండెలను
స్పృశించ గలదు? ఏ భోగవంతుని
విచలింప చేయుగలదు? ఏ భగవంతునికి
నివేదించుకోగలదు...?' అంటూ తల్లడిల్లిపోతాడు. ఈ బాధామయ జీవితాల సమస్యలను పరిష్కరించలేని తన అసహాయతను విందించుకుంటాడు అదే గీతంలో.

సాహస వంతురాలైన ఓ అమ్మాయిని చూసి
'చిన్నమ్మా!
వీళ్లంతా...
నిన్నెన్నెన్నో అన్నారు; అవమానాల పాల్జేసారు

అవినీతి అంటగట్టేరు
ఆడదానికి సాహసం పనికిరాదన్నారు
వాళ్ళందరూ భయపడిపోయిన మనుష్యులు
గతంలో కూరుకుపోయిన మనుష్యులు
'మౌఢ్యంవల్ల బలాత్ములు
అవివేకంవల్ల అవినాశులు
వీళ్ళందరు మధ్యతరగతి ప్రజలు
శ్రీమంతుల స్వేచ్ఛావర్తనకి నైతిక
భాష్యకారులు
......నిబారుగా నిలబడలేరు
దరిద్రంలో హరిద్రాశోభల్ని గుర్తిస్తూ
ఓపికలేక భార్యలకు సహనాన్ని బోధిస్తూ
ధైర్యంలేని తమ స్వభావాలకి ధర్మమని
పిలుస్తూ
బరువుగా, బెదురుగా బతుకుతున్న వీళ్ళమధ్య
డైనమైటు పేలాలి
డైనమోలు తిరగాలి' అంటాడు.

ఈనాడు వచన కవిత్వం సాహిత్యసీమలో స్వేచ్ఛావిహారం గావిస్తున్నది. ప్రజల అభిమానాన్ని సంపాదించుకుంటున్నది. కవిత్వం చక్కని రసాను భూతిని కలిగించేదిగా వుండాలి అసభ్యమైన పదాలకు కవిత్వం అతిదూరంగా వుండాలి. ఎటువంటి భావాన్నయినా, సంఘటననైనా అందంగా చిత్రీకరించి పాఠకుడి మనసుకి హత్తుకునేలా చెయ్యగలగాలి. అప్పుడే ఆ కవిత్వం పదికాలాలపాటు రాణిస్తుంది ఈనాడు దిగంబరకవులతోపాటు యింకొందరు కవులుకూడా అత్యధికభావోద్రేకంతో అశ్లీలపదాలకు చోటిచ్చి కవిత్వాన్ని రసవిహీనం గావిస్తున్నారు. ఇది కవిత్వ స్వస్థతకు సూచనమాత్రంకాదు. అర్థంలేని ప్రేలాపనలవలన కవిత్వం నూతనత్వాన్ని సంతరించుకుంటుం దనుకోవడం పొరపాటు.

ఇలాంటివాళ్లతో యిలా అంటాడు తిలక్—
—'గులకరాళ్లడబ్బా ప్రమోగించి గొప్పసంగీతం
అని దబాయించకు
......మాటలు పేర్చడం కవితకాదు;
మంత్రతంత్రం అనలేకాదు

......నిగ్రహసగ్రహాలులేని భావాశ్వాలని
బరిమీద వదలకు.
......అగ్నిజల్లినా, అమృతం కురిసినా
అందం ఆనందం...
దాని పరమావధి.'

ఈ విషయాల్ని నేడు కవిత్వం వ్రాస్తున్న యువకవులు గమనించాలి. కవిత్వంలో ఆధునికత వున్నంత మాత్రాన అది ప్రజాభిమానాన్ని సంపాదించుకోలేదు. కవితా వస్తువులో వైవిధ్యం కనబర్చాలి. శైలి సహజంగా సాఫీగా సాగిపోయి. పాఠకుడి చేత చివరంటా చదివించ గలగాలి. అతనికి రసానుభూతి కలగాలి. తిలక్ రచనలు మనల్ని చివరంటా చదివిస్తాయి. ఆలోచనలను రేకెత్తిస్తాయి. అతని కవితల్ని మనం పూర్తిగా చదివి, ఆలోచించి, అవగాహన చేసుకుంటే 'ఔరా! తిలక్!! ఎంత గట్టివాడివి!' అని ఆశ్చర్యపోతాం. తిలక్ అక్షరాలా మానవతావాది. అభ్యుదయవాది; మన సంస్కృతి పాడైపోతుందని వాపోతూ, సంకుచిత సాంప్రదాయపు బురదగుంటలలో కూరుకుపోయిన పెద్దలను వుద్దేశించి తిలక్—

'—మన సంస్కృతి నశించిపోతుందన్న మన
పెద్దల విచారానికి
మనవాడు పిలకమాని క్రాఫింగ్ పెట్టు
కున్నాడనే ఆధారం
—మన గలిగేది
కాలానికి నిలబడగలిగినది వద్దన్నా పోదు.
మరణించిన అవ్వ నగలు
మన కాలెజీ అమ్మాయి ఎంత పోరినా
పెట్టుకోదు.'
—అంటూ...
'ఏదేశ సంస్కృతి అయినా ఏనాడూ కాదొక
స్థిరబిందువు;
నైక నదీనదాలు అదృశ్యంగా కలసిన అంత
స్సింధువు'—
అని తేల్చి చెబుతాడు.

కథానిక:

# అనామకుడు

శ్రీ మధురాంతకం రాజారాం

'ఏమండోయ్ రంగనాథంగారూ! బహుకాలదర్శనం. బావున్నారా?'

'అయ్యో వరహరీ! ఎప్పుడొచ్చావు బాబూ! ఇందాకా విన్నుగురించే అనుకున్నాం. అన్నట్టు మవ్వాక్కడివేనా వచ్చింది?'

'ఒరేయ్ గోపీ! ఇదేనా రావడం? టిఫిన్లింకా పెడుతూనే వున్నారు. వెళ్ళు...వెళ్ళు...'

'రాధాపతీ! మెల్లగా దిగరా వాన్నా! అసలే మధ్య ఒళ్ళుచేసినట్టున్నావు. నీళ్ళపంపుల దగ్గర జాగ్రత్త! కాలుజారి ఎవరిపైన్నయినా పడ్డావో ప్రమాదం...'

పలకరింపులతో పరామర్శలతో పందిరిక్రింద సందడిగా వుంది. హారన్లు మోగించుకుంటూ కార్లు, గంటలు వాయించుకుంటూ రిక్షాలు, గుర్రపు డెక్కల చప్పుళ్ళతో జట్కాలు, ప్రతి నిమిషమూ ఏదో ఒక వాహనం వచ్చి పందిరి ఎదుట విడిసిపోతోంది. ఎవరొచ్చింది, ఎవరొచ్చింది అన్నట్టుగా చూపులన్నీ కొద్ది క్షణాలపాటు ఒక్కుమ్మడిగా ఆ వచ్చి నిలిచిన వాహనంవైపు ప్రసరిస్తున్నాయి. కొత్తగా కొన్న పాతకారులోనుంచి దిగి మునిసిపల్ కౌన్సిలరు మేఘనాథంగారు యింతకు మునుపే లోపలికి వెళ్ళారు. ఆ కారుకు అల్లంతదూరంలో ఆగివున్న స్కూటరు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసరు శ్రీధరమూర్తిగారిది. అదిగో, ఆ చెట్టుక్రింద పదిమంది మిత్రులతో పరివేష్టితుడై తీవ్రంగా ఏదో చర్చలో నిమగ్నుడైవున్న వ్యక్తి భూపతి. అతడు థియేటరు యజమాని. వీళ్ళేకాదు, పరకాయించిచూస్తే యింకా యిలాంటివాళ్ళెందరో అక్కడున్నారు. ఉండడంలో ఆశ్చర్య మేమీలేదు. జగన్నాథంగారు ఏకైకపుత్రికకు పెళ్ళిచేస్తున్నారు. ఆయన స్వహస్తంతో టౌనులో పంచిపెట్టిన ఆహ్వానపత్రాలే అయిదువందలదాకా వుంటాయి. అంతకు రెండింతల పత్రికలు పోస్టులో వెళ్ళాయి. జగన్నాథం గారికి భూములున్నాయి. భారీవ్యాపారాల్లో వాటా లున్నాయి. ఆఫీసుల్లో పలుకుబడివుంది. ప్రముఖులతో పరిచయంవుంది. జగన్నాథంగారి కిన్ని హంగులుండడంవల్ల అది ఆ ప్రాంతంలో చాలామందికి పిలవకపోయినా వెళ్ళవలసిన పేరంటమై పోయింది. ఇక పిలువందుకున్న బంధుమిత్రులు తండాలు తండాలుగా తరలిరావడంలో ఆశ్చర్య మేముంది?

పెళ్ళికుమార్తె ప్రసూన యింకా కాలేజిలో చదువుకుంటూవుంది. పెళ్ళయినతరువాత ఆమె చదువుకోడానికి పెళ్ళికుమారుడు అభ్యంతరమేమీ చెప్పలేదు. ఆమాటకొస్తే ఆమె జీవితాంతందాకా చదువుకుంటూవుండిపోయినా తన కేమీ అసౌకర్యం వుండదన్నాడు. ఏప్రిల్లో యం యెస్సీ పరీక్షలు వ్రాసి మేనెల్లో పెళ్ళిచేసుకుంటున్న సీతాపతికిమాత్రం చదువులపట్ల ధ్యాస వెనుకముఖం పట్టిందనే చెప్పాలి. ఏసిద్ధినైతే లక్ష్యంగాపెట్టుకుని తాయింతకాలం విద్యాసాధన చేశాడో అది ఈ పెళ్ళిద్వారా నగానికిపైగా సిద్ధించినట్టయింది. ఇప్పుడిక ఉద్యోగంచేసితీరాలన్న నిర్బంధంలేదు. 'కానీ చూద్దాం' అనుకుంటున్నాడు సీతాపతి. నచ్చిన ఉద్యోగమంటూ దొరికితే కొంత

కాలంపాటు చేసి చూడొచ్చు. మనస్కరించకపోతే చిరుగులుపడ్డ చేతిగుడ్డను గిరవాటు పెట్టినట్టుగా రాజీనామా వ్రాసి పడెయ్యనూ వచ్చు.

పెళ్లికి ప్రసూన స్నేహితురాళ్లు చాలామంది వచ్చారు. ఆ కాలేజీలో లెక్చరర్లుగూడా విచ్చేశారు. అందువల్ల ఆధునిక నాగరిక ప్రపంచంలో ఆడవాళ్ల ఆహార్యకపు తీరుతెన్నుల్లో వచ్చిన వింత వింత సొబగులన్నింటినీ ఒక్కసారిగా సంతకు తోలుకొచ్చినట్టుగా ఆ వివాహ దృశ్యాని కెక్కడలేని కాంతి వచ్చేసింది. ఈ విషయంలో వరుడైనా విస్సహాయంగా లేడు. అతడి బలగంగూడా దండిగానే వచ్చింది. నవ్వులు, కేరింతలు, వాగ్యుద్ధాలు, సిగరెట్లు పొగలు ఎక్కడైతే దట్టంగా వ్యాపించి వున్నాయో అక్కడల్లా కాలేజీ కుర్రాళ్లు గుమికూడి వున్నారని ఆ వైపు చూడకపోయినా తెలిసిపోతోంది.

ఏమైనా పెళ్లికి వచ్చిన జనంలో మరింత వైవిధ్యం కల్పించడానికి తోడ్పడింది మాత్రం జగన్నాథంగారి బంధువర్గమే! నలుగు రన్నదమ్ము లాయనకు. వాళ్లుగూడా నేల నాలుగు చెరగులా నాటిన నాలుగు జయస్తంభాలలాంటి వాళ్లు. ఒకతను మిలిటరీ ఆసుపత్రిలో డాక్టరు. ఇంకొకతను రాయబార కార్యాలయంలో ఉన్నతోద్యోగి. తమ్ముడేమో ఐ.ఎ.యఫ్.లో వుండి నెల నెలా రెండువేల రూపాయలు పుచ్చుకుంటున్నాడు. అన్నగారు బొంబేలో హోటలు నడుపుతూ అక్కడే స్థిరపడ్డారు. పోగా జగన్నాథంగారి భార్యకు అన్నదమ్ముడైతే ఒక్కడేగానీ అక్కచెల్లెళ్లు అయిదుగురు. ఒకావిడ ఇంజనీరును పెళ్లాడి ఆతడితో బాటుగా అమెరికావెళ్లి రెండేళ్లుండి యిటీవలే తిరిగొచ్చింది. ఇంకొకావిడ డాక్టరు. ఆమె మొగుడూ డాక్టరే! మిగిలిన వాళ్లల్లో యిద్దరికి లెక్చరర్లకు పెళ్లాలయ్యే యోగం పట్టింది. కడగొట్టుచెల్లెలి మొగుడుమాత్రం ఏకంగా శాసనసభలోనే సభ్యుడు. ఇప్పుడు పేర్కొన్న బంధువుల్లో చాలామందికి పెళ్లిళ్లయిన కొడుకులూ, కూతుళ్లూ వున్నారు. ఆ రెండోతరంవాళ్లకు మళ్లీ బిడ్డలున్నారు. జగన్నాథంగారి కెలాగూ ఐశ్వర్యానికి తగ్గ నిష్పత్తిలో సంతానం కలగలేదు. భగవంతుడి కామాత్రం వితరణ లేకపోయింది. అందుకు బంధువులేం చేయగలరు పాపం! వాళ్లూ ఎంతోకాలంనుంచీ వేచివున్నారు. లేకలేక యిన్నాళ్లకు జగన్నాథంగారి యింట్లో ఒక శుభకార్యం ఒనగూడింది. దీన్ని కాస్త జారవిడిస్తే మళ్లీ పాతికేళ్లదాకా యిలాంటి అవకాశం యింకొకటి లభించకపోవచ్చు. అందువల్ల వాళ్లు సకుటుంబంగా, మరికొందరైతే మిత్రసమేతంగా, యింకా కొందరు పరివారసహితంగా పెళ్లికి తరలి వచ్చేశారు.

కామాక్షి కల్యాణ మహల్ సినిమాథియేటరు గాదు. లేకుంటే ఈపాటికెవ్వడో హౌస్‌ఫుల్ అన్న బోర్డు తగిలించివుండవలసింది!

హాల్లో పెళ్లిమండపం ఎదుటవేసిన అయిదు వందల కుర్చీలు భర్తీ అయిపోయాయి. ఇంకా చాలా మంది ఎక్కడివాళ్లక్కడే నిలబడిపోయివున్నారు. ముహూర్త సమయానికి ఆట్టే వ్యవధిగూడాలేదు. ఇంకొక అయిదువందల కుర్చీలకోసం మనుషులు పరుగెడుతున్నారు

ముఖంపైన క్రమ్ముకుంటున్న చిరుచెమటను అంగవస్త్రంతో తుడుచుకుంటూ జగన్నాథంగారు ఆదరాబాదరాగా పాకశాలవైపు పరుగుతీశారు.

ట్రిచీనుంచీ వచ్చిన వంట బ్రాహ్మల జట్టుకు నాయకుడు నటేశయ్యరు కుర్చీలో సుఖోపవిష్టుడై, నోటినిండుకూ తాంబూలం పట్టించి, దానికి మద్దతుగా అప్పటికప్పుడే గంప్పెడు తంగభస్మం దట్టిస్తున్నాడు.

'అయ్యరుగారూ! అంచనా తారుమారై పోయేటట్టుంది. ముహూర్తం కాగానే కొందరు తాంబూలాలు పుచ్చుకునివెళ్లి పోవచ్చుననుకోండి! కానీ నిలిచిపోయేవాళ్ల పర్సెంటేజ్ ఎక్కువగా ఉంటుంది. మీ రిప్పుడు చేస్తున్నది వెయ్యిమందికోసం. అవసరమైతే యింకొక అయిదువందల మందికిగూడా...'

'అడేయప్పా! మీరూరుకోండిసేసార్! ఇక్కడ

ఆడుపులమీద అంశాలు మాడుతూదా వుండును. అక్కడ అన్నాలు తినడంవా ఆలస్యం, యిక్కడ అన్నాలు దిగుతూదా వుండును. మీకు కవలెందుకు సార్! పొండి, పొండి మీవేళె మీరు సూసుకొండి ..'

అయ్యరుగారి అభయ ప్రదానంతో ప్రాణాలు తెరపిన పడ్డట్టయింది జగన్నాథంగారికి!

సరిగ్గా ఆ క్షణంలోనే వెనుకవైపునుంచీ ఓచేయి జగన్నాథంగారి భుజంపైన పడింది.

కంగారు పడిపోతూ ఆయన వెనుదిరిగి చూచే సరికి హనుమంతప్ప కనిపించాడు.

'ఏమిటండీ అన్నగారూ! ఏం జరిగింది?'

'ఇప్పటికేమీ జరగలేదులే! రా, చెబుతాను...'

స్తంభం చాటుకు లాక్కెళ్ళాడు హనుమంతప్ప.

'చూడవోయ్ జగన్నాథం! నీకూ యాభై యేళ్ళు వచ్చేశాయనుకో! కానీ అదేమంత పెద్ద వయసుగాదు సభలూ, సమావేశాలు, బిజినెస్సులూ వగైరా నువ్వు బోలెడన్ని జరిపించి వున్నావు. ఐనా పెళ్ళిసంగతి వేరు. అందులోనూ కామాక్షీ కల్యాణ మహల్లో పెళ్ళి జరగడమాయె! ఇదసలే మాయా మహలు. ఏమూల ఏం జరుగుతున్నదీ మనం తెలును కోలేం. పోగా యిక్కడ మామూలుగా జరిగిపోయే తెరమరుగు వ్యవహారం ఒకటుంది...'

'అలాగా! అదేమిటో మీరే చెప్పాలి. పెద్దలు మీరుండడం అందుకే గదా!'

తన పెద్దరికం తనకు దక్కినందుకు హనుమంతప్ప ముఖంలో సంతృప్తి తాండవించింది.

'పెళ్ళికి చాలామంది వచ్చారు. అవునా జగన్నాథం?'

ఇందులో అభిప్రాయ భేదానికి తావెక్కడి దన్నట్టు జగన్నాథంగారు తలపంకించారు.

'వస్తారు, వస్తారు. ఎందుకురారు! గరిట చేతబట్టుకుని విశ్వమోహిని అమృతం వడ్డిస్తున్నా నహో అనే సరికి దేవతలంతటి వాళ్ళు బారులుతీర్చి కూర్చోలేదా? ఐతే ఒకటి. ఆ అయ్యలు కూచో వలసిందే! ఆయమ్మ వడ్డించనూ వలసిందే! కానీ రాహు కేతువుల మాటేమిటి? ముఖంచాటు చేసుకుని, చేతుల్నిమాత్రం పొడుగ్గా చాచుకుని బంతిలో బైటాయించిన రాహుకేతువుల్నిమాత్రం ఏబుద్ధిమంతుడూ కనిపెట్టలేదే!'

'అవు న్నిజమేనండీ అన్నగారూ! ఎందుకైనా మంచిది. మనం ఓ కంట కనిపెట్టివుందాం లెండి!'

'అదీ, ఆ హుషారు చాలా అవసరం! దారంట వెళ్ళే దానయ్యలు చాలామంది వున్నారయ్యా లోకంలో. పైగా యిక్కడి సత్రాల్లో అరుగులపైన పన్నులు మాడ్చే బైరాగులు బోలెడుమంది! వచ్చిన చిక్కేక్క డుందంటే, వీళ్ళు చూడ్డానికి బైరాగుల్లా వుండరు. మామూలుమనుషుల్లా వుంటారు ఇలాంటి పెళ్ళిళ్ళు జరిగాయంటే వాళ్ళకు పండగ! ఒకమాదిరి వుతికిన బట్టలు తొడుక్కుంటారు. ముఖం శుభ్రంగా గీక్కుంటారు. చడిచప్పుడూలేకుండా పెళ్ళిపిడిదిలోకి వచ్చేస్తారు. పెళ్ళివాళ్ళతో కలిసిపోతారు. సర్కారెరువూ, చక్కెరా కలిసినట్టే! నోట్లో వేసుకుంటే గానీ రుచితెలియదు...'

'అవునవును. మీరు చెప్పేశారుగా! ఇక మన జాగత్తలో మన ముందాంలెండి!'

'ఎందుకు చెబుతున్నానంటే జగన్నాథం, నిరు డిలాంటప్పుడు బెంగుళూరులో నా తోడల్లుడికూతురి పెళ్ళి జరిగింది మనోరంజనీ కళ్యాణమందిరం అని నువ్వూ వినేవుంటావు. జరిగితే ఏమైంది? పెళ్ళి కుమార్తె సూట్‌కేసు కనిపించలేదంటే! కొత్తచీరలు, నగలుఅన్నీ కలిసి యిరవైవేల రూపాయల సరుకు! తెల్లారేసరికి క్లోజ్...'

అసలీ హనుమంతప్ప ధూమకేతువులాంటి వాడని జగన్నాథంగారికి తెలుసు! లోకముక్క కని పిస్తే దేశాని కరిష్టమట! తరతరాల విశ్వాసంకదా అని పూరుకోకుండా శాస్త్రజ్ఞులు దీన్ని మూఢ విశ్వాసంక్రింద జమకట్టారనుకోండి! కానీ ఎటొచ్చీ

పులికంటే గిలే హెచ్చు! జరగబోయే ప్రమాదంకన్నా (బహుశా అది జరగకనే పోవచ్చు) హనుమంతప్పచేసే ప్రమాదసూచనవల్లనే ఒళ్లు జలదరిస్తుంది.

హనుమంతప్పను తప్పించుకుని జగన్నాథంగారు మళ్లీ పెళ్లి జరుగుతున్న హాల్లోకి వచ్చేశారు.

పూలపల్లకీలా అలంకరించిన మండపంలో పురోహితుడు ముహూర్తధారణప్పుడు కావలసిన వస్తుసామగ్రిని ఓమూలగా పేర్చి పెట్టుకుంటున్నాడు.

పెళ్లి ఏర్పాట్లపైన తాను నియమించిన వలంటీర్లు కొందరు అప్పుడే తీసుకొచ్చివేసిన కుర్చీల లోకి అతిథుల్ని సర్దుతున్నారు.

'గంట తొమ్మిది కావస్తోందండీ శాస్త్రిగారూ! టంచనుగా పదికొట్టేసరికల్లా సూత్రధారణ జరిగి పోవాలి'—ఒక పెళ్లిపెద్ద హెచ్చరిక చేస్తున్నాడు.

కాని అతిథిసత్తముల కెవరికీ ఆ అదుర్దా వున్నట్టులేదు. సూత్రధారణ జరిగేదీ, జరగక పొయ్యేదీ, మంగళవాద్యాలు మ్రోగేదీ మ్రోగకపోయేదీ, పురోహితుడి మంత్రాలు వినిపించేదీ వినిపించకపోయేదీ, ఈ గొడవేదీ వాళ్లకు కాబట్టలేదు. వేళకు సరిగ్గా తమ అవసరాలు తీరిపోతుండేవక్షంలో వాళ్ళు ఎంత కాలమైనా యిక్కడుండి కులాసా కాలక్షేపంచేసి వెళ్లేధోరణిలో వున్నారు. జగన్నాథంగారికి కాస్త చిరాకు పుట్టుకొచ్చినమాట నిజం! కుర్చీలు చూపించినా వీళ్లు కూచోరు. అందుకిదే సందర్భమైనట్టు సినిమాలపైన, రాజకీయాలపైన ఏకధాటీగా ప్రసంగాలు కొనసాగిస్తారు. బహిరంగ సభలలోనైనా డిసిప్లిన్ మెయింటెయిన్ చెయ్యవచ్చునేమోగానీ, పెళ్లిళ్లలో అది సాధ్యమయ్యేటట్టులేదు...

అప్పుడొక చిన్న సంఘటన జగన్నాథంగారి కంటబడింది. ఎవడో ఒక అపరిచిత వ్యక్తి ఖాళీకుర్చీ ఒకటి వెదికిపట్టి, అందులో కూచోబోతుండగా ఎవరో దాన్ని వెనక్కు లాగేశారు జాగరూకుడుగా వుండబట్టి సరిపోయిందిగానీ లేకుంటే అతడు దబేలున నేలపైన పడిపోయివుండవలసిందే! నిలవరించుకుని అతడు తిరిగి చూసేసరికి ఒళ్లంతా పొంటుగా, కోటుగావున్న ఒక పెద్దమనిషి ఆకుర్చీలో ఆసీనుడై వున్నాడు. సంఘటన చిన్నదే అయినా అస్థాయిలో అక్కడొక చిన్నరగడ జరిగివుండవలసింది. కానీ అవ్యక్తి పెదవి కదలకుండా తనపాటుకు తాను దూరంగా వెళ్లిపోయి కిటికీదగ్గర నిల్చుండిపోయాడు.

జగన్నాథంగారికి ఆ అపరిచితవ్యక్తిపట్ల యించుక సానుభూతి కలుగక పోలేదు. కానీ హనుమంతప్ప చేసిన హెచ్చరిక మూలంగా ఆ సానుభూతి కొద్ది క్షణాల్లో అనుమానంగా మారిపోయింది. తాను కూర్చునేదాకా వచ్చిన కుర్చీని దురాక్రమణ చేసిన వ్యక్తిపైన కించిన్మాత్రంగానైనా కోపం రాలేదంటే యితడీ పెళ్లివేడుక పాలిటికి రాహువులాంటివాడై అయివుండాలి. ఇందులో పాల్గొనడానికి ఏమాత్రం చొరవగలిగి వుండినా అతడు ఆత్మాభిమానాన్ని చంపుకుని దూరంగా వెళ్లిపోవడం జరగదు ఐనా యిప్పటికి మించిపోయిందేమీలేదు గణిత శాస్త్రంలో తెలియని రాసిని 'ఎక్స్' అనుకోవడం పరిపాటి. అలెక్కన యితణ్ణి తాత్కాలికంగా ఎక్స్ అనుకోవచ్చు. పెళ్లి ముగిసేలోగా ఈ ఎక్స్ ఎవడయిందీ ఆరాతీయాలి...

తొమ్మిదిన్నరకు మంగళ వాద్యాలు మ్రోగ సాగాయి. రేపు పరీక్షలనగా బుద్ధిగా చదువుకోడానికి కూర్చునే కుర్రాళ్ళకు మల్లే బంధుమిత్రులందరూ హాల్లో తావుచేసుకుని కూచున్నారు సకాలంలో సూత్రధారణగూడా జరిగిపోయింది. ఆ అవకాశం కొసమే వేచివున్నట్టుగా యువకు లిద్దరు తటాలున లేచి నిల్చున్నారు వాళ్ల చేతుల్లో రంగురంగుల కాగితాలున్నాయి. పంచరత్నాలు వ్రాసి తెచ్చిన యువకవి వొకవైపున పెద్ద గొంతుకతో వాటిని చదువుతుండగా మరోవైపున ఈ యువకులు కాగితాలను పంచిపెట్ట సాగారు. ఆమాత్రం సంఘటనకే సభలో ఓమూల నుంచి పెద్దగా కలకలం ప్రారంభమైంది. ఊరు కోండూరుకోండని చేతితోనే సంజ్ఞచేస్తూ జగన్నాథంగారు సందడి చెలరేగుతున్న చోటికి దగ్గరగా వచ్చేశారు. అప్పుడొకచోట నేలపైన దండిగా మూగి

వున్న పొదరిళ్ల నడుమ రెండోసారి మళ్లీ ఎక్స్ ఆయనకు కానవచ్చాడు. కనిపించడంకన్నా అతడే స్థితిలో కనిపించాడన్నదే యిక్కడ ముఖ్యం. ఆశీర్వాద పద్యాల కాగితంకోసం అతడు చేతిని చూచాడు. యువకుడొక కాగితం ఆచేతిలోపెట్టి, తీరాపెట్టిన తర్వాత తల పైకెత్తి ఆ ముఖంలోకి చూచాడు. పద్యాలు చదవ గలిగిన పరిజ్ఞానం ఆ ముఖంలో కనిపించలేదేమో, అతడు వెంటనే ఆ కాగితాన్ని కాస్త లాక్కోబోయాడు. అవతలివ్యక్తి గూడా వీలయినంతగట్టిగానే పట్టుకున్నాడేమో, యువకుడు పూడ లాగుకోజూడడంతో అది సర్రున ఏటవాలుగా చిరిగి పోయింది. సగంముక్కమాత్రమే చేతిలో మిగిలింది. ఆ ముక్కవైపు బిక్కుబిక్కుమంటూ చూస్తున్న ఎక్స్ జగన్నాథంగారికి కనిపించింది!

'అయ్యోపాపం' అనుకున్నారు జగన్నాథంగారు. ఎంతగా దండగతిండికోసం వచ్చినవాడైనా అతడికిలాంటి పరాభవంమాత్రం జరగగూడదు!

ఆ తిండి తింటున్నప్పుడు అతడి వాలకాన్ని గమనించే అవకాశం సైతం జగన్నాథంగారికి లభించకపోలేదు. ఒక్కొక్కసారి నాలుగువందలమందికి చొప్పున మూడుసార్లు వడ్డించినతర్వాత రద్దీ తగ్గింది నాలుగోసారికి డైనింగుహాల్లో సగం కుర్చీలు ఖాళీగావుండిపోయాయి. జగన్నాథంగారి ధ్యాసగూడా తిండిపైకి మళ్లింది. 'నాకూ నాలుగు మెతుకులు వడ్డించండి' అంటూ ఓ కుర్చీలో శరీరం చేరవేసిన జగన్నాథంగారికి నేరుగా ఆటువైపునవున్న వరుసలో ఓ కుర్చీలో కూర్చుని ఏ పదార్థాన్నిగానీ అపురూపంగాని తినేయకుండా చేతివ్రేళ్లతో అన్నాన్ని కెలుకుతూన్న ఎక్స్ కనిపించాడు.

ఒకటికి రెండు అనుమానాలు బిగ్గరగా వచ్చేసుకున్నాయి జగన్నాథంగారిని! తిండి బొత్తిగా నయించడంలేదంటే యితడు రెండోసారిఅయినా మళ్లీ తిండికోసం సిద్ధపడివచ్చివుండాలి. లేదా తిండికంటే మించిన గొప్పప్రయోజనం దేనికోసమో ఈ పెళ్లి పిళిదిలో పొంచివున్నవాడైనా వాలి...

నిజంనిజం! జాగ్రత్త చాలా అవసరం. నిజాన్ని నిలకడమీదనే గ్రహించాలి...

అతిథులకు వట్టినోటివిందుమాత్రమేకాకుండా కొంత కనులవిందు, వీనులవిందుగూడా కలిగేటట్టుగా జగన్నాథంగారు వివాహకార్యక్రమాన్ని రూపొందించారు. ఆనాటి రాత్రి ఎనిమిదేళ్ల అమ్మాయి ఒకతె చేసిన భరతనాట్యాన్ని వీక్షించడంకోసం పురప్రముఖులు చాలా మంది విచ్చేశారు. ఆ తరువాత ఒక చిన్నపాటకచ్చేరి గూడా ముగిసేసరికి గంట పదికావచ్చింది. మధ్యాహ్నం తిన్న ముహూర్తభోజనాలు అప్పుడే ఎలా అరిగిపోయాయోగానీ, అతిథులు మళ్లీ భోజనాలకు తయారు! నిర్వాహకుడి కొక్కడికి తప్పితే మిగిలిన వాళ్లకందరికీ పెళ్లిళ్లు హాయిగావుంటాయి కాబోలు ననుకున్నారు జగన్నాథంగారు. అందరినీ భోజనాలకు వెళ్లమన్నారు. భోజనంచేసి వచ్చినవాళ్లను తాంబూలం వేసుకోమన్నారు. తాంబూల చర్వణం చేస్తున్నవాళ్లను వెళ్లి యిష్టమైనచోట పడుకోమన్నారు. ఇక ఆ వేళప్పుడు అన్నమేం దిగుతుందని కొద్దిగా ఉపాహారంమాత్రం తీసుకున్నారు.

గంట పన్నెండు!

గదిలోకివెళ్లి పడుకోవడమొక్కడేగాని జగన్నాథంగారికి నిద్రపట్టనేలేదు. కానీ యిప్పుడాయనకు ఎంతో ఆనందంగావున్నమాట వాస్తవం. భుజాలపైన్నుంచీ కొండంతబరువును క్రిందికి దించివేసుకున్నట్టుంది. పెళ్లి అనేది వ్యక్తిగతవిషయం. పెళ్లి జరపడంలోతప్పితే పెళ్లికొడుకును ఎన్నుకోడంలో తన బాధ్యతేమీలేదు. నెలరోజులకుముందు సీతాపతి ఎవరో తనకు తెలియదు. ప్రసూనకతడితో రెండేళ్ల సుదీర్ఘ పరిచయం వుందట! ఒకరి నొకరు అర్థం చేసుకున్న తర్వాత తీసుకున్న నిర్ణయమే! కుర్రాడు బాగున్నాడు. బాగా చదువుకున్నాడు. బస్. తనకంతే కావలిసింది...

అలాగని తానీ విషయంలో యిల్లాలి అభిప్రాయాన్ని లెక్కకు తీసుకోకపోలేదు. నిజానికి ఈ సంబంధాన్ని ప్రతిపాదించింది ఆవిడే! బలపరచడం మాత్రమే తనవంతయిపోయింది. ఈడూ జోడూ

వింతో బాగుందట! అబ్బాయి, అమ్మాయి జంటగా ముందు నడిచి వెళ్తున్నప్పుడు వెనకనుంచి చూడ్డానికి వెయ్యి కళ్లు కావలసి వస్తాయట! ఆడవాళ్ల దృష్టిలో అల్లుడనిపించుకోదగ్గ మానవుడికి యింతకుమించిన అర్హత అక్కర్లేదేమో!

ఒక ఆడబిడ్డకు వివాహ సంబంధం కుదర్చాలంటే మునుపు ఏడు జతల జోళ్లరిగిపోయేవట!

కాలేజీ లెక్కువై అబ్బాయిలు అమ్మాయిలు పరస్పరం ప్రేమించుకోడమంటూ .ఒకటి ప్రారంభమైన తర్వాత యిప్పుడా బెడద చాలావరకు తగ్గిపోయినట్టేవుంది...

జగన్నాథంగారి పెదవులపైన లీలగా ఒక లేనగవు మెరిసింది.

గంట నాలుగు కొట్టేటప్పటికి జగన్నాథంగారికో విషయం జ్ఞప్తికి వచ్చింది. సింహద్వారం దగ్గర పోలిగాణ్ని కావుండమని చెప్పినట్టు గుర్తు. ఉన్నాడో లేదో? ఒకవేళ పనిచేసిన అలతలో ఒళ్లు మరిచి నిద్రపోతుంటే వుండిమాత్రం ఏం లాభం?

ఈ వూహ బుర్రలో మెదలగానే జగన్నాథంగారు లేచి చక్కా హాల్లోకి వచ్చేశారు. హాలుకు చుట్టూరావున్న గదుల్లో దేనిలోనూ దీపాలు వెలగడం లేదు. అందరూ నిద్రపోతున్నారన్నమాట! హాల్లో గూడా ఒక్కటే దీపం వెలుగుతోంది, నేలపైన పరిచిన బ్లాంకెట్లపైన పని మనుషులు కొందరు అడ్డదిడ్డంగా పడుకుని నిండుగా ముసుగు పెట్టుకుని నిద్రపోతున్నారు.

పూలు వాడిపోయినా వాటి సువాసన ఇంకా గుమ్మగుమ్మగా గుబాళిస్తున్న ఆ హాల్లో కాసేపు కూచుందామనిపించింది జగన్నాథంగారికి!

గోడకానించి పెట్టివున్న కుర్చీని తీసుకొచ్చి ఆయన తనకు నచ్చినచోట వేసుకున్నారు.

కూర్చున్న కొద్ది సేపటి కాయనకు పెళ్లి మండపంవల్ల ఏర్పడివున్న నీడలో ఒక బెంచీ వేయబడివున్నట్టు తోచింది. దానిపైన ఒకమనిషి పడుకున్న పోలికువగూడా గోచరించింది.

కప్పుకున్న బట్ట చిన్నది. అందువల్ల ఒళ్లు ముడుచుకోక తప్పలేదు. మోచెయ్యే తలగడగా ఉపకరించింది. ఏవిధంగా చూచినా అది నిద్రపట్టడానికి అనువైన సుఖశయ్య కానేకాదు.

కామాక్షి కల్యాణ మహల్లో వలభై రెండు గదులున్నాయి. పరుపులు, తలగడలు ఎన్నున్నాయో లెక్కలేదు. ఏమాత్రం ప్రయత్నించి వుండినా ఈ మానవుడికొక పరుపు దొరికివుండేదే!

కానీ పెద్దలన్నట్టు, దేనికైనా అడిగివచ్చి వుండాలిగదా!

ఇంతవరకూ తెలిసిందిగాదు. ఇక్కడ దోమల వీరవిహారంగూడా ఎక్కువగానే వున్నట్టుంది.

ఉండివుండీ ఒకదోమ అంట బొడవడంతో దురవస్థలాంటి అతడి నిద్రావస్థ మాటిమాటికీ చెదిరిపోతోంది.

అసలతడు నిద్రపోతున్నాడా అన్నదే సందేహం!

'ఏమండీ! నిద్ర పట్టడంలేదా?' జగన్నాథంగారు అప్రయత్నంగానే ప్రశ్నించేశారు.

'పరవాలేదు. ఒక్క రాత్రేగదా! ఎలాగో గడిచిపోతుంది...' మొత్తానికి నిద్రమాత్రం రాదన్న నిర్ణయానికి వచ్చిన వాడిలా అతడు లేచి కూచున్నాడు. లేచి కూర్చోగానే జగన్నాథంగారు అతణ్ణి పోల్చుకున్నారు.

ఇప్పుడిక ఏదైనా మాట్లాడకపోతే బాగుండదు. మాట్లాడ్డానికి యింకొక సబ్జక్టు ఎన్నుకోడమెందుకని ఆయన ఏకంగా కూపీలాగడానికే ఉపక్రమించారు.

'ఏ వూరండీ మీది?'

ప్రాసిక్యూటరు ప్రశ్నకు జవాబు చెప్పడానికి బొత్తిగా యిష్టం లేకపోయినా, చెప్పక తప్పించుకోలేని ముద్దాయిలా అతడు ముక్తసరిగా 'క్రొరపాడు' అన్నాడు,

'కొర్రపాడా! ఎప్పుడూ వినలేదే! ఏ జిల్లాలో వుంటుందండీ అది?'

అతడు జిల్లాపేరు చెప్పాడు. ఆంధ్రప్రదేశం లోని అన్నిజిల్లాలపేర్లూ జగన్నాథంగారికి తెలిసినవే! అందునా అతడిప్పుడు చెప్పినపేరు మరింత సుపరిచితం. పెళ్లికొడుకు సీతాపతి ఆ జిల్లావాడే!

ఐతే ఇతడు మగపెళ్లివారి తరపున మనిషై వుండాలి...

ఇప్పుడిక టాపిక్ మార్చవలసిన అగత్యం ఎదురైంది జగన్నాథంగారికి!

'మీ కీ యేడు వాన లెంతమాత్రం?'

'వానలవల్ల ఒరిగేదేమీ లేనప్పుడు అవి పడడము, పడకపోవడము రెండూ ఒకటే గదండీ?'

'అంటే? మీకు వ్యవసాయంలేదా ఏమిటి?'

'ఒకప్పుడుండేది...'

'ఇప్పుడు?'

'భూమిలో చాలాభాగం అమ్ముడైపోయింది. మిగిలింది తొండలు గుడ్లుపెట్టే మెట్టనేల. అది వున్నా లేనట్టే!'

'కావచ్చు. పల్లెటూళ్ళల్లో ఎందరో రైతులు ఎన్నోకారణాలవల్ల చితికిపోతుంటారు.'

'రోడ్ అండర్ రిపేర్'అన్న బోర్డుమచూచి మలుపుతిరిగిన కారులా జగన్నాథంగారి ప్రశ్న ఈసారి మళ్లీ విషయాంతరంలోకి వచ్చేసింది.

'బిడ్డలున్నారు గదండీ?'

'మొత్తం అయిదుగురు. ఇద్దరాడబిడ్డలకు పెళ్ళిళ్ళు చేశాను. మగబిడ్డల్లో యిప్పుడిద్దరు మాత్రమే వున్నారు...'

'అయ్యో పాపం!'

'అబ్బే, అలాంటిదేమీలేదు. ఒకడు లెక్కకు రాకుండాపోయాడనిమాత్రమే చెప్పాలి...'

'బలేగమ్మత్తుగా మాట్లాడుతారండీ మీరు! బ్లాక్‌మనీలా కన్నకొడుకు లెక్కకు రాకుండాపోవడమేమిటి?'

'అదంతేలెండి! వాడి కొక్కడికిమాత్రమే చదువు పట్టుబడుతూవచ్చింది. చనిపోతూ తల్లి గూడా వాడెంతాకా చదువుకుంటాడో అందాకా చదివించమనే కోరింది. చదువులసంగతి మీ రెరుగుదురు. ఒక్కర్ణి చదివించడమంటే ఏనుగకు మేత అందించినట్టే! ఏడాది కొక కయ్య అమ్మి వాడి చదువుపైన పెట్టవలసివచ్చింది...'

'పోనీలెండి! కుర్రాడు చదువుకున్నాడుగదా! ఏదైనా వుద్యోగం దొరికితే వాడు మిమ్మల్ని సాకక పోడు...'

ఎక్స్ నవ్వాడు—'ఈ దేశంలో మహరాజాలు బీదవాళ్లని సాకుతున్నారు. నౌకర్లని సాకుతున్నారు. కడకు బిచ్చగాళ్లనిగూడా సాకేస్తున్నారు. ఇక ఒక కొడుకు తండ్రిని సాకడంలో విడ్డూరం లేదు. కానీ తండ్రులందరికీ అలాంటి అదురుష్టం పడుతుందంటారా? నాకూ అరవయ్యేళ్లు వచ్చేశాయి. ఇప్పటిదాకా ఒకరిమోచేతి గంజికోసం కక్కుర్తి పడలేదు. మిగిలిన కొద్ది రోజులుగూడా యిలాగే గడిచిపోతాయి...'

'అయ్యో పాపం! మీ మనసుకేదో పెద్దగాయమే తగిలినట్టుంది...'

ఒతడు పైకిలేచి బెంచీని జగన్నాథంగారికి దగ్గరగా జరుపుకున్నాడు. జేబులోనుంచి బాగా నలిగిపోయిన కాగితం ఒకటితీసి ఆయనచేత పెట్టాడు.

'ఏమిటండీ యిది?'

'ఇది వాడి పెళ్లి పత్రిక. పెళ్లి అయిదు రోజుల్లో వుందనంగా నాకందింది...'

'నా కెందుకు చూపిస్తున్నారో...'

'దాన్ని చదువుకునేటంతవరకూ చదువుకున్న వాణ్ణిగాను పైగా యింగ్లీషులో వుందయె! ఎన్ని సార్లో తీసి చూచుకున్నాను. ఎందరికో చూపిం

చాను. ఎందరికి చూపించినా ఎన్నిసార్లు చదివించుకున్నా ఈ పెళ్లికొడుకు నాకొడుకే నన్న కోడానికి యిందులో ఎక్కడా దాఖలా లేదు...'

తెల్లబోతూ జగన్నాథంగారు ఆ ముసలివాడి ముఖంలోకి చూచారు ఇదేమిటో అంతుతేల్చుకోవలసిన వ్యవహారంలాగే తోచిందాయనకు. 'ఉండండుండండి. కళ్లజోడు పెట్టుకుని దీనివైనమేమిటో తెలుసుకుంటాను...' అన్నారు.

ఇంతలో నటేశయ్యరు దగ్గరినుంచి పిలుపొచ్చింది. ఫస్టురౌండుకాఫీ సిద్ధమైపోయిందట! మొదటికప్పు జగన్నాథంగారికేనంటే ఆయనకోసం ఎవరో పరుగెత్తుకొచ్చారు.

ముఖం కడుక్కుని కాఫీ సేవించాక ఆయనకు గుప్పిట్లో ఓ కాగితం నలిగిపోతున్న విషయం జ్ఞప్తికి వచ్చింది.

కళ్లజోడును అక్కడికే తెప్పించుకుని, పొట్లంలా మడిగిపోయివున్న కాగితాన్ని విప్పి ఆయన కంటికెదురుగా పట్టుకున్నారు.

వరుడిపేరు కంటబడేసరికి త్రుళ్లిపడ్డారు జగన్నాథంగారు. కన్యాదాత పేరు కనిపించేసరికి బుర గిర్రున తిరగసాగింది. వధువుపేరు దగ్గరికొచ్చేసరికి సందేహానికి తావులేకుండా విషయం రూఢిగా తెలిసిపోయింది.

సదరు ఆహ్వానపత్రికను స్థూలంగా యిలా తెనుగులోకి అనువదించవచ్చు...

'ఫలానా తేదీన ఫలానాచోట జగన్నాథంగారి అమ్మాయి ప్రసూనతో జరుగనున్న నా వివాహానికి విచ్చేయ గోరుతున్నాను. ఇట్లు, సీతాపతి, ఎం.ఎస్సీ.'

ఒకవూరికి వెళ్లదలచుకుంటే దాని ఉనికి ఎక్కడో తెలుసుకోడం ముఖ్యం. ఉత్తరం సజావుగా చేరాలంటే చిరునామా సరిగ్గా వ్రాయడం ముఖ్యం. ఉనికి తెలియని వూళ్లకు మల్లే, చిరునామాలేని జాబులకు మల్లే కొందరు మనుషులుగూడా ఆకాశం నుంచి వూడిపడడం సంభవమా?

ఆయోనిజుడైన పక్షంలో తప్పితే వరుడిలా వ్యవహరించడంలో అర్థం లేదు.

దిగాలుపడిపోయి జగన్నాథంగారు చాలా సేపటి వరకూ అక్కడే కూర్చుండిపోయారు.

ఆయన మళ్లీ లేచి హాల్లోకి వచ్చేసరికి బెంచీ ఖాళీగా వుంది.

చేవమాని మొద్దుల్లాంటి యిద్దరు మనుషులెవరో ఆపాటికేవచ్చి పెళ్లిమంటపానికి వ్రేలాడుతున్న పూలదండల నన్నింటినీ తెంపి గంపల్లోకి ప్రోగుచేస్తున్నారు.

'పెళ్లయ్యా కాకమునుపే ఏమిటిది?' జగన్నాథంగారు కోపాతిరేకంతో గద్దించారు—

జగన్నాథంగారి కోపాన్ని లెక్కపెట్టకుండా వాళ్లు తమ పనేదో తాము సాఫీగా చేసుకుపోసాగారు. లేదంటే ఆ యిద్దరిలో ఒక్కడుమాత్రం సహేతుకంగా సమాధానంచెప్పి ఆయన కోపాన్ని చల్లార్చడానికొక ప్రయత్నంమాత్రం చేశాడు—

'మరో పెళ్లివారు రాబోతున్నారండీ బాబుగారూ! ఆలోగా ఈ పని జరిగిపోవాలి...'

రెండోవాడందుకున్నాడు. 'వీటి కిక్కడ కంట్రాక్టుదారులం మేమేనయ్యా! పూలఎరువు బలే సత్తువలెండి! ఏ పైరుకువేసినా పంట యిబ్బడిముబ్బడే!'

# స్వప్న గీత

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ

గీతం విరచిస్తున్నాను
గేదంగిరేకులా గరుకుబారిన హృదయాన్ని
కర్పూరవీణగా మలచుకుని ఈ
గీతం వినిపిస్తున్నాను.

ఈ వీణకు తీగలు ఆగతాలు.
శ్రుతులు, స్మృతులు.

పల్లవి నా ప్రేయసి అధరాన్నడిగి
తెచ్చుకుంటాను—
నా చరణాలతో నడచి
నిద్రాసింధుసైకత తీరాలు
చేరుకుంటాను—

నా ఆర్ద్రనయనాంచలాలు
సవరించుకునే ప్రతిస్మృతీ,
వర్ణోజ్జ్వల ప్రభాభాసమానం
శక్రధనుఃఖండ సమానం!

ఒక ఋతుపవనం సోకినా,
వికసించే అగరుధూమ నీలోత్పలం
సుతారంగా, తనువును తాకినా,
గోప్యసంగీతం రక్తాన్ని మరిగించి,
నెత్తురు ఉప్పదనాన్ని
కన్నీరుగా మార్చినా,

# స్వప్న గీతి

నిద్రాసింధు సైకత తీరాల
నే నొక్కడినే, వర్తమానం లేకుండా
మిగిలిపోతాను.

అప్పుడు,
నాలోచనాల ఆలోచనాజలపాతం,
జలజలపూలు రాలిన పారిజాతం!
నా చుట్టూ కాలమే పరిమళిస్తుంది.
నా ముట్టిం రాత్రి కాలిమ సరిగమిస్తుంది.

ఆగీతాల శ్రుతులు సరిచేస్తూ
నా నరాల ప్రకంపనలలోంచి
అనుభూతిగీతాలు
ఆలపిస్తాను.

భవభూతిలా శోకశ్లోకాలు
ప్రలాపిస్తాను,

నేను,
నిద్రాసింధుసైకతతీరాలలో కూర్చొని,
ఆగతానాగతాల మధ్య
నీలిచారను మీటుతాను,
గీతాలను పట్టుకుంటాను.
ఈ జీవితానికిదే చాలని, సరి
పెట్టుకుంటాను.

ఇది,
ఎవ్వరికీ వినిపించని కడలిమ్రోత!
అందుచేత, వినిపిస్తున్నాను
స్వప్నాయిత శబ్దగీతి!

---

కలగూరగంప:

# కొందరు కన్నడదేశపు శాసనకవులు

కన్నడ సాహిత్యమునకు తెలుగు సాహిత్యమునకుగల సంబంధము విజ్ఞులకెల్లరకు విదితమే. కన్నడ కవులనుగూర్చిన ప్రశంస పెక్కురు విమర్శకులిదివరకే యొనరించి యున్నారు. ప్రస్తుతము నేను చెప్పబోవునది కన్నడ దేశమునందలి కొందరు శాసన కవులను గురించి. శాసన కవులనగా శాసనములు వ్రాసిన వారు మాత్రమేకాక, శాసనములలో పేర్కొనబడిన కవులుకూడ చేరియున్నారు. కవులని ప్రశంసింపబడినవారు, కవిత్వ బిరుదములతో చెప్పబడిన వారుకూడ దీనిలో చేరియున్నారు. ఈ శాసన కవులందరు కన్నడ కవులేకాదు; సంస్కృత కవులును, ఉభయ భాషా కవులునుగూడ కలరు. వీరందరను గూర్చిన ప్రశంస కన్నడదేశములందలి శాసనములలో నుండుటచే 'కన్నడ దేశమునందలి శాసన కవులు'గా పేర్కొని యున్నాడను. ఇక నీకవులను కాలము ప్రకార మొక్కొక్కరినిగూర్చి చెప్పెదను ఈ వ్యాసము వ్రాయుటకు నా కుపకరించిన గ్రంథము 'కన్నడ నాడిన కెలవు శాసన కవిగళు' అనునది. దీని రచయిత యయిన మేవుండి మల్లారిగారి కెంతయు కృతజ్ఞుడను.

## 1. కుబ్జ: క్రీ. శ. 5 వ శతాబ్దము

ఈయన సంస్కృత శాసనకవి. శివమొగ్గ జిల్లా, శికారపుర తాలూకా, తాళగుంద యను గ్రామములోని శాసన మొకదానిలో నీతని పేరున్నది. కవి నామమున్న పద్యమిది:

తస్యారపస్య తనయస్య విశాల కీర్తేః
పట్టాత యార్పణ విరాజిత చారుమూర్తేః
శ్రీశాంతి వర్మ నృపతే ర్వర శాసనస్థః
కుబ్జః స్వకావ్య మిద మశ్మతలే లిలేఖ॥

ఈ కవి కదంబ కకుస్థవర్మ కుమారుడైన శాంతివర్మ నాశ్రయించిన వాడు. శాసనారంభములో 'ఓం సిద్ధం'; 'నమః శివాయ' అనియు, అంతమున 'నమో భగవతే స్థాన కుందూర వాసినే మహాదేవాయ', 'నందతు సర్వసమంతాగతో ఒయ మధివాసః' 'స్వస్తి ప్రజాభ్యః ఇతి' అను మాటలుతప్ప శాసనమంతయు పద్యమయముగ నున్నది. దీనిలో 34 పద్యము లున్నవి కదంబ రాజుల కులపరిచయము, కాకుస్థవర్మ ప్రశస్తి యున్నవి. ఆయన మహాతటాక మొకటి నిర్మించిన విషయముకూడ నిందులో నున్నది. కాకుస్థవర్మ వర్ణన పద్యములలో నొకటి రెండిటి నుదాహరించుచున్నాను.

జ్యాయోభి స్సహ విగ్రహే ధీరేషు దయా
సమ్య క్ప్రజాపాలనం
దీనాభ్యుద్ధరణం ప్రధాన వసుభి
ర్ముఖ్యై ద్విజా భ్యర్హణమ్
యస్యైవ తత్కుల భూషణస్య నృపతేః
ప్రజ్ఞోత్తరం భూషణం
తం భూపాః ఖలు మేనిరే
సుర సఖం కాకుస్థ మత్రాగతమ్॥

నానావిధ ద్రవిణ సార సముచ్చయేషు
మత్త ద్విపేంద్ర మద వాసిత గోపురేషు
సంగీత వల్గు నినదేషు గృహేషు యస్య
లక్ష్మ్యంగనా ధృతిమతీ సుచిరం చ రేషు॥

ఈ శాసనమును పరిశీలించిన ఎఫ్. కీల్‌హార్న్ గారు ఇది 6 వ శతాబ్ది ప్రథమార్ధమునందలిదని అభిప్రాయపడిరి. (Ep. In. VIII. 24.) అయినను ఈ కాకుస్థవర్మనుగూర్చిన శాసనమొకటి 5 వ శతాబ్ది మధ్యకాలములో నుండుటచే కుబ్జకవికూడ

5 వ శతాబ్దియందే (ఉత్తరార్థము) నుండెనని చెప్ప వచ్చును.

## 2. రఘు–5 వ శతాబ్దము

పైనిచెప్పిన తాళగుంద శాసనములోని కదంబ రాజవంశావళిలో రఘుఅను నతడు కవియని కుబ్జుడు చెప్పెను. ఈ రఘు ఆ శాసననాయకుడైన కాకుస్థ వర్మయొక్క అన్న. ఏ భాషలో నతడు కవియో అందు చెప్పబడలేదు. సంస్కృతకవియని యూహింపవచ్చును. ఈ రఘుకూడ కుబ్జునికి సమకాలికుడని చెప్ప వచ్చును. అతనినిగూర్చి చెప్పిన పద్యమిది:

> ప్రతిభయ సమరేష్వరాతిశస్త్రో
> ల్లిఖితముఖోఽభిముఖద్విషంప్రహర్తా।
> శ్రుతిపథ నిపుణః కవిః ప్రదాతా
> వివిధకలాకుశలః ప్రజాప్రియశ్చ॥

## 3 శివమార దేవ-క్రీ. శ. 825

శివమారదేవుడు గాంగరాజవంశములోనివాడు. పెర్మానడి శ్రీ పురుష యనునతని కుమారుడు. గజ శాస్త్రములో నితడు ప్రవీణుడు. ఈయన 'గజా ష్టకము'ను దానిని రచించెనని, అది శివమారమతమని ప్రసిద్ధివడసినదని, దేశములో బహుళ ప్రచారము దానికున్నదని శివమొగ్గజిల్లా, నగరతాలూకా, హుంచ గ్రామములోని క్రీ. శ 1066 నాటి యొక శాసన ములో నున్నది. ఆ శాసనములోని వంశావళిని లెక్క వేసి చూచినచో శివమారదేవునికాలము క్రీ. శ. 825 ప్రాంతమని తెలియుచున్నది. ఈ శాసనములో నీ కవిని గూర్చి యిట్లున్నది.

'అంతు వీరమార్తాండ నెనిసిదాతన మగం శివ మారదేవం సైగొట్టనెం బెరెడెనెయ పెసరం తాల్ది శివమారమతవెందు గజశాస్త్రనుం మాడి, మత్తం–

> 'ఏవెల్చిదొ శివమార మ
> హీవరయాధిపన సుభగ కవితాగుణమం
> భావిశియదొ గజాష్టక
> మో వనిగె యెమొనకె వాడు మాదుదె పోళు'॥

శివమారదేవుని కవితాగుణము సుభగమైనదని యిందు వచింపబడినది.

## 4. వత్సరాజ క్రీ. శ. 860

ధారవాడజిల్లా, నవిలుగుందతాలూకా, కొణ్ణూ రను గ్రామములో క్రీ. శ. 12 వ శతాబ్దములో రచింపబడిన ఒక శిలాశాసనమున్నది. దానిలో ఆ కాలపు ధర్మ—దానాదులను తెలుపుచున్న ఒక తామ్ర శాసనమును శిలపై మరల వ్రాయుచున్నట్లు తెలుప బడినది.

'శ్రీమన్మహాస్థానం కొళనూర మహాప్రభు పులియ మరసరుం మూలుపురపంచ మతస్థానంగళుం తామ్రశాసనమంగ నోడి బరియిమెన ల్కా శాసన దొళెంతిదు ఱదం తీ శిలాశాసనముం శ్రీ వీరనంది సైద్ధాంతిక చక్రవర్తిగళు బరెయిసిదరు.'

ఇచట వచింపబడిన తామ్రశాసనము రాష్ట్ర కూట రాజయిన మొదటి అమోఘవర్షునిది. ఆ శాసన కాలము శకవర్షము 782. ఇది సంస్కృతభాషలో వ్రాయబడినది. పద్యాత్మకము. దీనిని వ్రాసినవాడు వత్సరాజ యను నతడు. వాళభకాయస్థవంశజుడైన శ్రీహర్షకుమారుడు, ధర్మాధికారియని ఈ క్రింది గద్యమువలన తెలియుచున్నది.

'లిఖితం చైత ద్వాళభ కాయస్థ వంశజాతేన ధర్మాధికరణ సేనభోగిక వత్సరాజేన శ్రీహర్ష సూనునా గ్రామ పత్త శాధికృత లేఖ కరణ వంస్తి నాగ వర్మ పృథ్వీలామ భృత్యేన.'

## కవిరాజ రాజ క్రీ. శ. 930

కళస యను గ్రామము ధారవాడజిల్లా, శిగ్గాలు తాలూకాలో నున్నది. అచట రాష్ట్రకూట రాజుల లోనివాడగు వాల్లవ గోవిందుని కాలమునాటి శాసన మొకటి యున్నది. (ఎపి.ఇండికా × 111—329). అది 930 నాటి శాసనము. దీనిని వ్రాసిన కవి 'కవిరాజ రాజ' యని బిరుదు కలవాడు. అతని అసలు పేరు తెలియదు. తన్ను గూర్చి యితడొక కంద పద్యమున చెప్పికొనినాడు. ఇతనిది కాడియూరు.

> 'కవిరాజరాజ విబుధ
> ప్రవరం శ్రీ కాడియూర నళ్ళియ కమళో

ధ్రువ వంశ ప్రోత్తముదం
నవీన వణకొనెయినెసెయ అభివణికసువెం॥'

ఈతని 'కవిరాజరాజ' బిరుదము సామాన్యముగనున్నను, కవిరాజును కవికంటె తాను శ్రేష్ఠుడని సూచించినట్లుగ నూహింపవచ్చునని మల్లారిగా రభిప్రాయపడుచున్నారు. అయినను దీనిని నిశ్చితముగ చెప్పుటకు వీలులేదు.

మరియొకచోట నీ కవి కాడియూరి జనులు తనపై నభిమానముతో ప్రశంసించుచున్నారని చెప్పియున్నాడు. అది శాసనమందలి గద్యభాగమున నున్నది. ఈ శాసనములో 76 పంక్తులున్నవి. నలుపది పద్యములున్నవి. కాడియూరిని, అచ్చటి కొండలను, జనులను విశదముగ నీ కవి వర్ణించియున్నాడు. రాజులు సామంతులు, ధర్ములు—దాతలు, ఆచార్యులు—మహాజనులు మొదలగువారిని వర్ణించుట సామాన్యముగ శాసనములలో కన్పించును. ఊరి సామాన్య జనుల గుణస్వభావములను, రీతి—నడతలను సహజరీతిలో వర్ణించి యీ కవి స్వాభిమానమును చక్కగ వ్యక్తపరచినాడు.

ఈ శాసనములోని యొక పద్య ముదాహరించు చున్నాడను:

'భరత మహీమండళ కా
భరణ కుంతళధరాతళం తద్విషయ
క్కెర డఱునూఱు లలాటం
పురికర జనపద మదక్కె నవపవిముకురం॥'

మిగిలినవారిని గురించి తర్వాత వివరింతును.

—ఆర్వీ యస్. సుందరం.

## అముద్రిత ప్రబంధము :
## సుప్రభా పరిణయము

ఆంధ్రభారత కవితారీతి ఆంధ్ర ప్రబంధ కవితారీతికి మార్గదర్శకమైన విషయం విజ్ఞులకు విదితమైనదే. అసలా భారత రచనలోని శయ్యాసౌభాగ్యం అలంకార ప్రధాన రచన, వర్ణనల తీరు తియ్యందనాలు మున్నగునవి ప్రబంధ రచనా రీతికి మూలములై యున్నవి.

అట్టి ప్రబంధ రచన శ్రీకృష్ణదేవరాయలను ఆకర్షించుటచేతనే ఆ ఆంధ్ర భోజుడు పెద్దనార్యునిగూర్చి

'.........కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశల సుధామయోక్తుల పెద్దనార్య!'

అని అర్థించినాడు. ఇట్టి రచనా సిద్ధికై పెద్దన కవి ప్రబంధ కవితారీతికి మార్గకవితారీతిని జతచేసి, శిరీష కుసుమపేశలమైన ప్రబంధ రచనా నిర్వహణలో సంపూర్ణముగ చరితార్థుడైనాడు.

ఇట్టి మనుచరిత్ర కవన రీతులను ప్రధానముగా చేసికొని వెలసినదే ప్రస్తుత సుప్రభాపరిణయ ప్రబంధము.

ఇది మూడాశ్వాసముల శృంగార ప్రబంధము. దీనికర్త మహీధర గోపాలకృష్ణకవి. తూర్పుగోదావరిజిల్లా అమలాపురం తాలూకాకు చెందిన కేశనకుర్రు గ్రామం ఈయన నివాసం.

అష్టావక్ర మహర్షి సుప్రభను వివాహమాడడమనేదే ఇందలి ముఖ్యేతివృత్తం.

మునిపల్లె అనే ఊరిలో వదాన్యుడు అనే విప్రుడు ఉంటాడు. అతడువేదవేత్త, కర్మిష్ఠి. అతనికి ఈశ్వరవరముచే కలిగిన కన్యకపేరు సుప్రభ. ఈమెయే ప్రస్తుత ప్రబంధనాయిక.

ఈమెకు క్రమంగా పెళ్లీడు రాగా తండ్రి తగిన వరునికోసమై వెదకుతూంటాడు. ఇట్టి సమయంలో అష్టావక్రుడుఅనే మునికుమారుడు—సుగుణరాశి—వేదాధ్యయన సంపన్నుడు ఒకరోజున భిక్షాటనం చేస్తూ వదాన్యుని ఇంటికి వస్తాడు. ఇతడు యువ

కుడుగాన తగిన యువతిని వివాహం చేసికోవాలనే భావం ఇతనిలో పొటమరించిఉంది. తలిదండ్రుల ఆజ్ఞపై సుప్రభ భిక్ష వేయడానికి మునియువకుని వద్దకు వస్తుంది. ఈమెను చూడగానే యువకుడు ఈ యువతిని పరిణయమాడదలచి ఈమె తలిదండ్రుల తో తన తలంపును విన్నవించుకొంటాడు. వదాన్యుడు ఆ యువకునితో 'నీవు ఈమెను వివాహ మాడదలచినచో ముందుగా నీవు హిమనగమునకువెళ్లి అక్కడఉన్న ఒక స్త్రీని చూచిరావలె'నని షరతు పెడతాడు. ఎట్టకేలకు షరతును అంగీకరించి అష్టావక్రుడు కతిపయ ప్రయాణాలతో హిమనగమునుచేరి అచటి కుబేరపురిలోని విశేషాలను తిలకిస్తూ క్రమంగా ఉత్తరదిక్కునగల ఆ దేవకాంతను కనుగొంటాడు ఆమె తన హావభావాలు చూచి ఆ యువకునిపై తన మోహాన్ని ప్రకటిస్తుంది. ఇచ్చటి సన్నివేశాలు, వీరి సంభాషణలు వరూథినీ ప్రవరాఖ్యుల ప్రవర్తనలను సంభాషణలను పూర్తిగా అనుకరించి ఉంటాయి తుదకు ఆ యువకుడు ఆమె మోహవాగురలో చిక్కక తన బ్రహ్మచర్యాన్ని కాపాడుకుంటాడు. అప్పుడాకాంత ఆ యువకునితో తాను ఉత్తరదిక్కునకుచెందిన కాంతననియు, వదాన్యుడు అతనిని బ్రహ్మచర్యవ్రతదీక్షావిధిని పరీక్షించుటకే తనవద్దకు పంపినాడనియు, తాను అతని బ్రహ్మచర్య దీక్షకు సంతసించాననియు, వెంటనే వెళ్లి సుప్రభను వివాహమాడమనియు తెలిపి ఆమె వెడలిపోతుంది. అష్టావక్రుడును తిరిగి క్రమంగా మామ యింటికి వస్తాడు. వచ్చిన ఆ వరునికి వదాన్యుడు తన తనయ నిచ్చి వివాహము చేస్తాడు.

మనుచరిత్రలోని కవిత్వముతో ఈ ప్రబంధ కవితకుగల సంబంధము తెలియుటకై రెండు ప్రబంధాలనుండి రెండు ఉదాహృతులుచూపి విరమిస్తాను.

మనుచరిత్రలో హిమనగమును వర్ణిస్తూ పెద్దనార్యుడు

'అట జని కాంచె భూమిసురు
డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద
భంగతరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానుకూల
పరిఫుల్ల కలాపకలాపి జాలమున్
కటక చరత్కరేణు కరకంపిత
సాలము శీతశైలమున్'
(మను—ఆశ్వా 2, పద్యం 3)

ఇదే సందర్భంలో సుప్రభా పరిణయంలో

'అటఁజని బ్రాహ్మణుండు గనె
నభ్రతటోపసరద్వియద్ధునీ
చటుల తరంగ మంగళ తుషార
కణోన్నత మంజరీలస
త్తట నికటాభిరామ సురదారు
సమాజ విసర్గళ ద్రజః
పటల విరాజమున్ తుహిన
పర్వతరాజ మపారతేజమున్.
(3 ఆశ్వా, 3 పద్యం)

ప్రవరాఖ్యుడు హిమనగంపై ఒక కోనలో ఒక భవనంబును చూచిన సందర్భంలో

'కాంచి తదీయ విచిత్రతో
దంచిత సౌభాగ్య గరిమ కచ్చెరు వడి యా
క్కాంచన గర్భాన్వయమణి
యించుక దరియంగ నచటి కేగెడు వేళన్'
(ఆశ్వా 2, పద్యం 23)

ఇదే సందర్భంలో ప్రస్తుత ప్రబంధంలో

కనిముని మనమున నిదియొక
ఘను సదనంబనుచు దలచి కౌతుక మెసగన్
జనవన తద్దివ్యనికే
తనమున నొక్కింత జేవ దవ్వునకేగన్
(ఆశ్వా 3, పద్యం 72)

ఇట్లీ ప్రబంధము మనుచరిత్రలోని సన్నివేశములను, ఆ సన్నివేశములలో అనే కవితా రీతులను అనుకరించి ప్రతిబింబించి ప్రౌఢకవితా శ్రేణికి దగ్గఱగ నున్నది.

వదాన్య లిట్టి యముద్రిత ప్రబంధమును అచ్చొత్తించి ప్రకాశములోనికి దెచ్చినచో నుపయోగము కలుగును.

—ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి.

# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల విజయ యాత్రలు

## శ్రీ నోరి నరసింహశాస్త్రి

(గత సంచిక తరువాయి)

### 17

శ్రీ బెల్లముకొండ రామారావుగారితో వివాదము శ్రీ కొప్పరపువారితో తగాదాలో శాఖగానే పుట్టినది. కాని దాని నడక పరిణామము వేరువిధముగా కొనసాగినవి. అప్పటి నియోగి బ్రాహ్మణ పండితులలో నిస్సందేహముగా శ్రీ రామారావుగారు అగ్రేసరులు. హయగ్రీవానుగ్రహముచే యౌవనముననే విద్యలు గ్రహించి, సంపన్నుడును ఉదారుడునుగనుక స్వగ్రామమగు పైడిపాడులో విద్యార్థులకు సుఖభోజనము పెట్టి విద్య గరపుచుండిన పుణ్యాత్ముడు. ఆయన యందు నియోగులకేకాక వైదికలోకమందును విశేష గౌరవముండెడిది. సంస్కృతములో కావ్యరచనచేసిన కవి.

వారు అనూచానముగా శ్రీ వైష్ణవగురువుల వలన తప్తచక్రాంకనము పొందిన కుటుంబములోని వారు. ఐనను శ్రీ వైష్ణవులు భోజనాదులలోను శ్రాద్ధాదులలోను వేరుగానుండి తమ్ము పంక్తిబాహ్యులుగా చూచుట వారి కిష్టముకాక, విశిష్టాద్వైతము వదలి స్మార్తపక్షము వహించి విశిష్టాద్వైతమును తీవ్రవాక్కులతో ఖండించుచు ఎన్నో సంస్కృత గ్రంథములు రచించిన విద్వాంసులు. వారు ప్రత్యక్షముగా ఎన్నడు శ్రీ తిరుపతి కవులతో వివాదమునకు దిగలేదు. కాని పరోక్షముగా వివాదము కలిగినది.

వరహారావుపేట శతావధానములో శ్రీ తిరుపతి కవుల ప్రత్యర్థి ఒకరు రామారావుగారిని అడిగి 'పశ్యాపశ్యో నపశ్యతః' అను సమస్యనుతెచ్చి పూరింపుడని పృచ్ఛకుడుగా కవుల నడిగెను.

కవులిద్దరిలో ఎవరన్నారోగాని — బహుశః శ్రీ వెంకటశాస్త్రియేయై యుండును—అది తప్పు కనుక పూరింపవీలులేదనిరి. ఆ భ్రాంతివారికి ఆవేశములోనో తొందరలోనో కలిగియుండును. ఆ పృచ్ఛకుడువెళ్లి శ్రీ రామరాయల కిది చెప్పగా, వారు కౌముది చూచుకొని తప్పులేదని నిశ్చయించుకొని అబ్బాతనికి ధైర్యము చెప్పిరి. మర్నాడా పృచ్ఛకుడు తిరిగివచ్చి, 'సమస్యలో తప్పులేదని విద్వాంసులన్నారు. తప్పేమిటి?'అని నిగ్గదీసెను. ఆ విద్వాంసుడెవరో సభకువస్తే తప్పు నిరూపింతుమని కవులనిరి. ఆ సమస్య కష్టమైనదవుటచే కవులు తప్పించుచున్నారని వారి యభిమానులుగూడ కొందరు భావించుటచే, దానిని చక్కగా నిట్లు పూరించి వారిని తృప్తిపరచిరి.

'యః పశ్యతి జగత్సర్వం
యో నపశ్యతి సర్వతః
తౌ వుభౌ పరమాత్మానం
పశ్యాపశ్యో న పశ్యతః'

శ్రీరామరాయలు ఎదుటపడలేదుగాని వారి పక్షమున ఇతరులు కవులను వాదసభ కాహ్వానించిరి. అట్లు వ్రాసిన వారిలో శ్రీరామరాయల వైదిక శిష్యులును గలరు.

'రామరావు పత్రికలోన వ్రాలుచేసి
పంపుచో నుత్తరం బీయవలయు ననియు
పట్టి శశ్శోభటిగాంగ్రడతో వాదమేల
యనియు భావించి ప్రతిపంప మంబ మేము'

అని కవులు ఊరకుండిరి.

ఈ వాద మంతటితో నాగలేదు. ఆంధ్రదేశ ములోగల ఉద్దండ వ్యాకరణ పండితులకు ప్రతి కక్షులు ఈ సమస్యను తీసికొనిపోయిరి. మహా మహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు సమ స్యలో తప్పులేదనిరి. వారట్లు చెప్పినది యెరుగక వారి శిష్యులైన జయంతి భగీరథశాస్త్రిగారు సమ స్యలో తప్పున్నదనిరి.

వశ్య శబ్దము తప్పనియు ఉపసర్గ పూర్వక వశ్యశబ్దము సాధువనియు కాశికావృత్తికారుని మతము. కౌముది రెండును సాధువు లనెను. కాశికా వృత్తి కారుడు ప్రాచీనతరు డగుటచే కౌముదీకారునికంటె ఎక్కువ ప్రామాణికుడని శ్రీ తిరుపతి కవుల వాదము. కౌముదీకారుని మతను మహాభాష్య సమ్మత మని ప్రతిపక్షుల సిద్ధాంతము. ప్రతిశాస్త్రములోను కొన్నిపట్టులలో ఆచార్యులకు మతభేదములున్నవి. ఈ వాదములో శ్రీ తిరుపతి కవులు తొందరపడినను, కాశికావృత్తికారుని బలముతో కొంత మర్యాదగా బయటపడ గలిగిరి.

ఈ సమస్య తగవు ప్రారంభమైనది. 1911 సం. అక్టోబరులో అంతకుముందు నాలుగు నెలల కిందట తిరుపతి కవులకు శ్రీరామరాయలు తాము రచించిన కృష్ణలీలా తరంగిణి యను సంస్కృత కావ్యమును పంపియుండిరి. దానిని కవులిప్పుడు పైకితీసి అందులోని అసభ్య భాగములను బయట పెట్టిరి ఆ భాగములు అసభ్యములుకావని శ్రీరామ రాయలయందు గౌరవమున్నవారుగూడ సమర్థించుట సాధ్యముకాదు. చుక్కలలో అక్షరాలు వదలి నాల్గిం టిని ఉదాహరిస్తున్నాము.

1. 'సనంద తనయః కరపంకజేన పస్పర్శ శ్రీ——వ్.

2. 'మయి మూత్రణాయ సదవాద్భహిర్గతే...

3. 'నవనీతచోర తవ శి......మాహరామి ......మమ శి...చుంబన మిదమ్.

4. సుభగే త్వదీయ మయి శోభనం భ—ం దర్శయ'

శ్రీ కృష్ణలీల వర్ణనములోగూడ నిటువంటివి అసభ్యములు కావనలేము గదా!

ఈ విధముగా అసలు వాదనుమ ప్రక్కదారి పట్టించుటలో, శ్రీ తిరుపతి కవులకు వాద ప్రతివాద ములలో గల చాకచక్యము ప్రస్ఫుటమగును.

## 18

ఇక శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారితో శ్రీ వెంకటశాస్త్రికి జరిగిన తగాదా విచిత్రమైనది. శ్రీపాదవారు సంస్కృతాంధ్రభాషలలో పండితులే గాక వేదము శ్రౌతముకూడా అధ్యయనము చేసిన పుణ్య మూర్తులు ఒక్కచేతిమీదుగా మహాభారతము, రామాయ ణము భాగవతము అనువదించి శతాధిక గ్రంథకర్తలైన కవిసార్వభౌములు. మహామహోపాధ్యాయ బిరుదాం చితులు. వారివద్ద శ్రీ వెంకటశాస్త్రి మేఘసందేశము ఐదు నెలలు శుశ్రూషచేసి కొంత చెప్పుకొనిరి. ఈ విషయ మాయన దాచక ఎప్పుడును ప్రకటించుచునే యుండెను.

శ్రీకృష్ణ భారతముపై కొందరు కుశంకలు లేవదీయగా మహాసభలో శ్రీ వెంకటశాస్త్రి వానిని ఖండించి శ్రీపాదవారిని సమర్థించిరి. శ్రీపాదవారికి గండపెండేరము సమర్పించు సభకువెళ్లి శ్రీ వెంకట కవి స్వయముగా గురుపాదమునకు బిరుదుటండె నలంకరించిరి. శ్రీ వెంకటశాస్త్రిగారికి గండపెండే రము సమర్పించు సభలో శ్రీపాదవారుండుటచే వారి యనుమతిలేనిది తామది గ్రహింపమని చెప్పగా శ్రీపాదవారు 'వెంకటశాస్త్రిగారు అందుకు తగిన వారే'యని ప్రకటించిరి. ఆ గురుశిష్యులమధ్య తగాదా వచ్చుట ఆశ్చర్యకరమే! ఐనను వచ్చినది.

శ్రీపాదశాస్త్రిగారు కొంత అమాయికులు. లోకము 'వెర్రివెలనాటివా'రని చమత్కరించు నానుడికి ఉదాహరణప్రాయులైనవారు. ఎవరో ఏదో శ్రీ వెంకట శాస్త్రిగారిపై వారి చెవిలో నూదిరి.

బొబ్బిలి పట్టాభిషేక కావ్యములో సహస్రాధికదోషము లున్నవని శ్రీపాదవా రారంభించిరి. వాద ప్రతివాదములు ఒకరి శబదోషము లొకరు చూపుట సమర్థించుకొనుట ఇత్యాదులు సాగినవి. ఏమైననేమి? అట్టి పెద్దలమధ్య కలహము తగదని వారి యభిమానులు రాజీచేసిరి. దానినిగూర్చి తుదకు శ్రీ వెంకట శాస్త్రిగారు 25—6—1931 ఆంధ్రపత్రికలో శాంతివ్యాస చర్చలో వ్రాసిన మాటలు ఆ వివాద స్వరూపమును సూత్రప్రాయముగా ప్రదర్శించును.

'విస్తరంబికనేల విపుల యలుకయు
దృణహుతాశనమ్ము దీర్ఘమగునె
అన్నమాట కస్మదాచార్యవర్యుండె
ప్రథమమగు నుదాహరణము తెలియ.'

వారి తగాదా మధ్యలో శ్రీపాదవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పద్యప్రయోగమును ఖండించుట, శిష్యుని శ్రీ వెంకటశాస్త్రిగారు సమర్థించుటతో రామాయణములో పిడకల వేట్లాటయు జరిగినది.

వారిద్దరిమధ్య పరోక్షముగా మరియొక తగాదా కూడా వచ్చినది. మదరాసు ప్రభుత్వమువారు ప్రథమాంధ్రాస్థాన కవిని నియమింప నిర్ణయించినపుడు వీరిద్దరిలో ఎవరిని నియమించుటాయని మంత్రులాలోచించిరట. తుదకు ప్రభుత్వము శ్రీ వేంకట శాస్త్రినే వరించి గౌరవించినది. ఆతర్వాత కొద్ది నెలలకే వారు పరమదించగా, వెంటనే రెండవ యాస్థాన కవిగా శ్రీ పాదవారిని ప్రభుత్వము వరించినది. ఆ రెండు పట్టప్రదాన సభలకును ఈ వ్యాసకర్త ప్రేక్షకుడుగా వెళ్లెను.

శ్రీ వెంకటశాస్త్రిగారి పట్టప్రదానము బెజవాడలో రాజమర్యాదలతోడనేగాక అశేషాంధ్రజనములయు కవిపండితులయు గౌరవాభిమానములతో జరిగినది.

శ్రీపాద వారిది మదరాసులో పెద్దలతో నిండిన శ్రీ రాజాజీహాలులో రాజమర్యాదలతో మాత్రమే జరిగినది.

## 19

కొందరు పూర్వపుణ్యవిశేషమువలన తమకు ప్రాప్తించిన ప్రతిభను నిగ్రహించుకొను సంయమము లేక బళ్లకు లారీలకు ఎత్తింతురు. వారు జీవించియుండగా వారు పలికిన ప్రతియక్షరము తలదాల్చు భక్తులుందురు. విస్తారరచనలు చేసినవారి రచనలు తరుచుగా వారితోనే అంతరిస్తవి. పూర్వపుణ్య విశేషము పరిపక్వమై జీవయాత్ర గడిపినవారిలో తిరుపతి వేంకటేశ్వరులు అగ్రగణ్యులు శ్రీ తిరుపతి గతించి 50 సం.లూ, శ్రీ చెళ్లపిళ్ల గతించి 20 సం లూ గతించినవి. అప్పుడే వారి ప్రియశిష్యులొకరు వారి కావ్యములలో రసముపాలు తక్కువ యనెను. వారి భారతనాటకాలూ, బుద్ధచరితమూ కలకాలము నిలుచునను సద్విమర్శకులున్నారు. శ్రీ దేవీభాగవతమును, శ్రవణానందమునుగూడ వాటిలో కలుపువారును గలరు.

ఏవి యేమైనను శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల విజయ యాత్రలు మాత్రము ఆంధ్రదేశ మెన్నటికినీ మరువదు. వారిద్దరూ కలసి 40 సం.లు, శ్రీ వెంకటశాస్త్రి 60 సం.లు అప్రతిద్వంద్వముగా ఆంధ్రభూమిలో కవితా సామ్రాజ్య మేలినారు వారి విద్వద్విజయయాత్రలు బహుముఖ ప్రజ్ఞా విభాసితములు. శ్రీనాథుని యాత్రలకంటె విస్తారమైనవి ఆంధ్రభాష యున్నంతకాలము శ్రీనాథుల విజయ యాత్రలతోపాటు, శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల విజయయాత్రలును ఆంధ్ర సహృదయుల స్మృతులలో ధ్రువముగా ఉండగలవు.

మరియొక విశేషముకూడా ఉన్నది. శ్రీ తిరుపతి కవుల ఆంధ్ర కవిత్వము సంగతే ఇంతవరకు ప్రస్తావింపబడినది. వారి సంస్కృత కవిత్వమెంతో ప్రౌఢమైనది. వెనుక నుదాహృతమైన వానికితోడుగా

వారి వేసవర్గాగ్రహార శతావధానములోనుండి యాదృచ్ఛికముగా గ్రహించి మరి రెండు ఉదాహరిస్తున్నాము.

మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యుల నామప్రయుక్త శ్లోకః

'సత్యాసక్తం' సదాపాణి న్యస్తచారు సుదర్శనమ్
యశోదయా లాల్యమానం కృష్ణం కృష్ణం నమా
సమస్యా పూరణం: మ్యహమ్'
'పాణిన్యపఠితే సూత్రే సభాయాంకుకవి ర్యథా
సాకం సుకవిభి స్తద్వత్ శ్యామస్వానాసమంస్థితః॥

ఈ పై శ్లోకమువల్ల తిరుపతి కవులకు పాణిని అష్టాధ్యాయి ఎంత కంఠస్థమో ఎంత సద్య స్ఫూర్తిగా భాసించేదో అభివ్యక్తమవుతుంది.

ఇట్టి చక్కని శ్లోకాలు వారు శతావధానాలలో రాజసభలలో మహాసభలలో శతాధికముగా చెప్పినారు. వారు బ్రహ్మగురువులయొద్ద వ్యాకరణాధ్యయనము చేయుచుండగా 'ధాతు రత్నాకర'మను చంపువును 'పాణినీయోపయోగ మగుగతిని' రచించిరి. అందులో 'రామకథ క్రమముగా ధాతువుల్ గ్రాలనమరు'నట. 'వీథి' నొకదానిని రచించిరి. కాశీ సహస్రము చెప్పిరి. శుకరంభా సంవాదము వ్రాసిరి. వారి సంస్కృత కావ్యాలు చదివే భాగ్యము ఈ వ్యాస కర్తకు లభింపలేదు. శతావధానాదుల శ్లోకములను బట్టి అవి యుత్తమ కావ్యములై యుండునని అనుమేయించుచున్నాము. వారి శిష్యులు అభిమానులు వారి సంస్కృత కావ్యాలను చాటువులను సేకరించి నాగరాక్షరములతో ముద్రించి ప్రకటించి వారి యశస్సు ఆసేతుహిమాచలము వ్యాప్తము చేసినచో వారి శతవార్షిక జయంత్యుత్సవములు మరింత సార్థకములు కాగలవు.

## 20

శ్రీ తిరుపతి - వేంకటేశ్వరకవు లిద్దరును పుణ్యపురుషులు. శిష్టాచార మెన్నడును కట్టులో గూడ విడనాడని ఆచారవంతులు. వారెన్నడు అశాస్త్రీయ ప్రవర్తనకు అవినీతి కార్యములకు ఒడిగట్టి యుండలేదు. ఇద్దరును గురుభక్తి, భగవద్భక్తి కలవారు. వారిలో తారతమ్యమెన్నుట ఉచితము కాదనవచ్చును కాని, వ్యక్తు లిద్దరైనప్పుడు అట్టి విచారణ రాక తప్పదు.

వారిద్దరిలో పూర్వపుణ్య విశేషము గాని ఈ జన్మలో చేసిన తపఃఫలముగాని శ్రీ తిరుపతిలో కంటె శ్రీ వెంకటశాస్త్రిలో ఎక్కువ అభివ్యక్తమైనదనుట సత్యదూరము కాదు. శ్రీ తిరుపతి మా వెలనాటివాడు, మా హరిత సగోత్రికుడు కూడాను. శ్రీ వెంకటశాస్త్రిది ఆరామ ద్రావిడశాఖ భారద్వాజ గోత్రము. కావున మనకు శాఖాభిమానము, గోత్రాభిమానమూ అంటగట్ట వీలులేదు.

శ్రీ తిరుపతి బలశాలియైనను 43 సంవత్సరములే జీవింపగా బలహీనుడైన శ్రీ వెంకటశాస్త్రి 80 సంవత్సరములు — దాదాపు సహస్రమాసములు — జీవించెను.

శ్రీ తిరుపతి ఈ లోకములోని చిన్నప్రభువు వద్ద ఆస్థానకవి. శ్రీ వెంకటశాస్త్రి అన్నవరస్వామి ఆస్థానకవి, తుదకు చెన్నరాష్ట్రాంధ్రాస్థానకవి.

శ్రీ వెంకటశాస్త్రి, తనకూ తన కుటుంబమునకు ఎన్నోమారులు జబ్బులు చేయగా, ఆరోగ్య కామేశ్వరి, ఆరోగ్య భాస్కరస్తవము, మృత్యుంజయ స్తవమువంటి కావ్యములు చెప్పి వ్యాధి విముక్తులైరి. శ్రీ తిరుపతిశాస్త్రి జబ్బు చేసినప్పుడు సూర్యనారాయణస్తవము రచించిరి గాని వారివి స్వామి యనుగ్రహింపకుండుటచే మృత్యువశులైరి.

శ్రీ వెంకటశాస్త్రి శరన్నవరాత్రములలో కామేశ్వరీపూజ యెన్నడు విడనాడలేదు. వారు మహాశివరాత్రినాడు అస్తమించుటయు వారి పుణ్య విశేషమునకు నిదర్శన మనవచ్చును,

మరి రెండు సంఘటనలుకూడ శ్రీ వెంకటశాస్త్రియందు పూర్వ పుణ్యమెంతగా ఫలితమునకు వచ్చినదో నిరూపించును.

ఒకటి శ్రీ శాస్త్రిగారి వివాహము. అది

చిత్రముగా జరిగినది. అప్పుడాయనకు 19 సం.లు. బ్రహ్మగురువులు కిర్లంపూడి వార్షికమునకు వెళ్లినప్పుడు ఒక విధముగా గురువులే శ్రీ వెంకటశాస్త్రి వివాహము నిశ్చయించి పెళ్లి ఖర్చులకు జమీందారిణి బుచ్చి సీతమ్మగారిని చూడబోయి పరిచారికల అధినేత్రియగు కామాక్షి యనుదాసితో రాణిగారికి కబురు చేయుమనిరి. అది విని కామాక్షి అమ్మగారి అనుజ్ఞతో ఈ శుభకార్యము నేనే చేయించి పుణ్యము పొందెదననిచెప్పి, అట్లే రాణిగారి యనుజ్ఞపొంది ధనమంతయు వెనుదీయక వెచ్చించి తాను తరించితిననెను. స్నాతకపు ఖర్చంతయు గురువులు వసతి చేయు తేజోమూర్తుల అన్నపూర్ణమ్మగారు భరించిరి. ఇది 1889 లో.

తర్వాత 1932 లో శ్రీ వెంకటశాస్త్రి గొర్సనాపల్లి వెళ్లగా, అక్కడ శ్రీ పంతము సూర్యారావు శాస్త్రిగారిని పిలిచి బహూకరించి 'మీరు పూర్వమెప్పుడో ఇక్కడ పెళ్లిలో ఊరేగితిరట. అప్పటికి నేను పుట్టకుండుటచే చూడలేకపోతిని. ఇప్పుడూరేగించి చూతును' అని ఊరేగించెను.

ఎంత పూర్వజన్మ పుణ్యము పండినిది ఇంత సర్వజనానురాగము పొందుట సాధ్యమగును!

శ్రీ తిరుపతి నిర్యాణమునకు విలపించుచు, 'నన్ను ఒంటరిగా విడిచి స్వర్గపురికి వెళ్లినావు. అక్కడి ధ్రురులతో కలహము కలిగినప్పుడైనను నన్ను స్మరింపవా?' అనిరి. సరిగా శ్రీనాథుడు, 'దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ, అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి' అన్నట్లుగానే. పురుషపుంగవుడైన ధర్మరాజుకే ఈ మానవదేహముండగా రాగద్వేష మలినమైన అజ్ఞానము వదలలేదు గదా, దిగ్విజయ యాత్రలతో జీవితము గడపిన శ్రీనాథునికి శ్రీ వెంకటశాస్త్రికి అట్టి అజ్ఞానము క్షంతవ్యమే.

స్వర్గసుఖము రాగద్వేషాలకు అతీతమైనదని గ్రహించిన పిమ్మటనే నిజమైన స్వర్గసుఖమనుభవించినాడు ధర్మరాజు. అది ఆయన సాధించిన విజయాలన్నిటికంటె సర్వోత్కృష్టమైన విజయము. శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల ఇష్టదైవమైన కామేశ్వరి ఈ జంటకవులకట్టి "రాగద్వేషాతీతమైన ఉత్కృష్ట విజయము స్వర్గములో ప్రసాదించుగాక!



# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ : నలుగురు కొత్త విశిష్ట సభ్యులు

**తి. రా.**

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీకి ఒక విశిష్ట సంప్రదాయం వుంది. ఆయారంగాలలో అగ్రగణ్యులను విశిష్టసభ్యులుగా ఎన్నుకొని గౌరవించడమే ఈ సంప్రదాయం. ఈ విశిష్ట సభ్యత్వం యాభైయయిదుసంవత్సరాల తర్వాత ఆరంభమయి డెబ్బయ్యయిదు సంవత్సరాలదాకా ఉంటుంది. ఒకొకప్పుడు, యోగ్యత పరభాగం చెందినప్పుడు, వయఃపరిమితి అపవాదం చెందడమూ వుంటుంది. ఈసారి ఆ అపవాదమాత్రం వర్తించి అకాడెమీ విశిష్ట సభ్యత్వం వరించిన జ్ఞాన వయోవృద్ధులు డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారొకరు. ఎనభై సంవత్సరాల ముదిమిని కూడా సరకుచేయక ఈ అపవాదశాస్త్రం విశిష్ట సభ్యత్వ సుమదామం ఆయన గళసీమను అలంకరించింది.

కొందరికి ముదిమిలో 'చిదిమిన పాల్గారు' చిరుత్రప్రాయం పునరావృత్త మవుతుందని మనస్తత్వవేత్తల మాట. ఇది నేలటూరి వారి విషయంలో నిజం; ముమ్మాటికీ నిజం. కాకపోతే, ఈ ఎనభయ్యవపడిలో ఆయన 'గట్టుదాటి గుట్టదాటి ఘనమయిన అడవిదాటి' బొమ్మలగుట్ట ఎక్కి, పంపమహాకవి తమ్ముడు జినవల్లభుని శాసనం కనుగొని, ఆంధ్ర కర్ణాటక సాహిత్య చరిత్రనే తారుమారు చేయగలిగేవారా? పంపమహాకవి సమాధి కనుగొనగలిగేవారా? జిల్లా వృత్తాంతదర్శినీ సహాయ సంపాదకులుగా కాళ్లకు బలపాలు కట్టుకొని ఊరూరూ, పల్లెపల్లే తిరిగి అమూల్య విషయాలు సేకరించి, ఆంధ్రజాతి చరిత్ర సంస్కృతి భండారాన్ని నింపగలిగేవారా?

జిల్లా వృత్తాంత దర్శినీ సహాయ సంపాదకులుగా కరీంనగర్ జిల్లాలో పర్యటిస్తున్నప్పుడు 'కొండమీద ఏదో సదికె కనిపిస్తుండాది దొరా!' అని ఎవరో చెప్పగానే, ముళ్లకంపలు కొట్టించి, దారిచేసుకొని కొండఎక్కి సమాధి కనుగొని, ఎవరిదో, ఏ ప్రాగైతిహాసిక జీవిదో అనే కుతూహలం తన వయస్సుకు రెట్టింపు ఏళ్ళు పొడవు సాగగా సమాధిని కడిగించి పంచమహాకవి సమాధి అని సమాధి మీది పంక్తులను చదివినప్పుడు, కలిగిన పరమానందాన్ని ఆనంద బాష్పాలతో, మృదహాసాల మధురిమతో చెబుతున్నప్పుడు వినే అవకాశం కలవారు ఆశ్చర్యపడి ఆ ఆనందంలో మునిగిపోక పోవడం సాధ్యంకాదు.

కొత్తవిషయాలు కనుగొనడం పరిశోధన రంగంలో అందరికీ సాధ్యంకాదు. పరిశ్రమించగా పరిశ్రమించగా హఠాత్తుగా ఒక్కవిషయం స్ఫురిస్తుంది. అది అనంతజ్ఞానవాహిని అవుతుంది. అశోక శాసనాలు దేశమంతా వున్నాయి, ఢిల్లీలోని శాసనాన్ని అక్బర్ చక్రవర్తి చదివించడానికి ప్రయత్నించాడు. కాని, సాధ్యంకాలేదు. గత శతాబ్దంవరకు ఎవ్వరూ ఆ లిపిని చదువలేకపోయారు. కాని, గత శతాబ్దంలో కలకత్తా టంకశాలలో నాణేల పరిశీలకుడుగా పని చేస్తున్న ప్రిన్సెప్అనే యువకుడు పాతనాణేలు చూస్తూ, చూస్తూ, కాకతాళీయంగా దొరికిన మెనెండర్ గ్రీక్—బ్రాహ్మీ ద్విభాషానాణకాన్ని పోల్చి చూచుకొన్ని మూడు అక్షరాలు కనుగొని, అనంతరం క్రమంగా బ్రాహ్మీశాసనాల వర్ణాలన్నిటినీ చదవగలిగి ప్రపంచ చరిత్రకే మహోపకారం చేశారు. ప్రిన్సెప్ సేవ అజరామరంగా నిలిచిపోయింది ప్రపంచచరిత్రలో,

అలాగే, నేలటూరివారు పంపసోదరజినవల్లభుని శాసనం కనుగొనడంతో ఆంధ్రకన్నడ సాహిత్యచరిత్రే మారిపోయింది. పంపమహాకవి వేంగీదేశంనుంచి వచ్చినవాడని, కర్నాటక పరిశోధకులు అంగీకరించినా ఆతనిపూర్వులు వలసవచ్చి, కన్నడదేశంలో స్థిరపడివుంటారని భావించారు. తదనుగుణంగా సిద్ధాంతాలు చేశారు. కాని, నేలటూరివారు జినవల్లభుని శాసనం కనుగొని — తమ తొలి తెలుగువ్యాసం 'చాళుక్యులచరిత్రలో కొన్ని సందేహములు' అన్నదానిని 1928 లో 'భారతి'లో ప్రచురించినట్లే — శాసనప్రతిబింబాలతోసహా వ్యాసం రెండు సంవత్సరాల క్రితం భారతిలో ప్రచురించగానే, పరిశోధకులు ఆశ్చర్యంతో కన్నులు పెద్దవిచేసుకున్నారు; కన్నడ పరిశోధకులు ఆగ్రహావిష్టులయ్యారు. 'కన్నడ ప్రప్రథమ మహాకవి తెలుగుదేశంలో, వేములవాడను పాలించిన చాళుక్య అరికేసరి ఆస్థానంలోని వాడా? అసంభవం!' — అన్నారు. కన్నడనాడులోని విశ్వవిద్యాలయాల చరిత్రాచార్యులు, చరిత్ర పరిశోధకులుతండోపతండాలుగా వచ్చిచూచారు. కొండమీద శాశ్వతంగావున్న శిలాక్షరాలు తిరుగులేని ఆధారం నేలటూరి వారికి. ఆ పరిసరాలలోనే మరేదయినా ఆధారం దొరక్కపోతుందా, అనే ఆశ వుండనే వుంది. బోధన్‌లో పంప కవివరుని సమాధి దొరికింది. దానితో అది కన్నడ కవి తెలుగుదేశంలో పుట్టి, తెలుగుదేశంలో మని తెలుగుదేశంలో పరమపదించాడని, తెలుగుదేశంలోని కొంతప్రాంతాన్ని పాలించిన కన్నడరాజు ఆస్థానంలోని వాడేగాని, కన్నడనాడులో పుట్టినవాడుకాదని నిశ్చయమయింది.

నేలటూరివారు నెల్లూరుజిల్లా నేలటూరిలో 1891 లో జన్మించి, ఎం. ఏ., పి. హెచ్‌డి పట్టభద్రులై, వేదం వెంకటాచలయ్యర్, లక్ష్మణరావు, వీరభద్రరావుగార్ల కృషితో ప్రోత్సాహితులయి చరిత్ర పరిశోధనకోసం తమిళ, కన్నడ, పారసీక భాషలను పండితులవద్ద నేర్చుకొని, కళాశాలాచార్యులుగా, విశ్వవిద్యాలయాచార్యులుగా ఎక్కువపదవులు నిర్వహించి, పల్లవ, చాళుక్య, చోళ, కాకతీయ, విజయనగర, నాయక, వెలుగోటివంశ చరిత్రలలోని నిగూఢాముల్య విషయాలను తెలిపే నైక గ్రంథ,వ్యాసరచనా వ్యాసంగం ఇదివరకు కొనసాగించడం ఒక ఎత్తు; పంపమహాకవి ఉనికి కనుగొని చరిత్రనే మార్చిన ఈ మహాకార్యం మరొక ఎత్తు. జినవల్లభుడు తాము తెలుగువారమని తెలుగు దేశంలో వున్నవారమని సూచించడానికా అన్నట్లు తన శాసనం చివర తెలుగులో మూడు కందపద్యాలు చెక్కించాడు. దానిలో మొదటిది:

'జినభవనంబు లెత్తించుట
జిన పూజ ల్సేయుచున్కి జినమునులకు న
త్తిన యన్నదానంబీవుట
జినవల్లభు బోలఁ గలరె జిన ధర్మపరుల్'.

ఇది నేలటూరి వారికి మరొక అంత సాక్ష్యం, ప్రతివాదులకు తిరుగులేని సమాధాన లక్ష్యం.

నేలటూరివారు దేనిలో దిగినా అంతుచూడనిదే వదలరు. సాహిత్యంలోను వారిది అపారజ్ఞానం. మహామహోపాధ్యాయ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు సాహిత్యంలో ఆయనకు ప్రోత్సాహకులు. ఆయన ఆముక్తమాల్యద వ్యాఖ్య వ్రాస్తూ, నేలటూరివారికి ఏవో పదాలు ఇచ్చి ఇతర కావ్యాలలో వాటికి ప్రయోగాలు ఏరమన్నారట; ఏరి యిచ్చారు. ఆయన సాహిత్య విమర్శ వైదుష్యానికి దక్షిణాంధ్ర వాఙ్మయచరిత్ర, వాఙ్మయవ్యాసమంజరి నికషాలు. ఆయన నన్నెచోడుని కుమారసంభవానికి వ్యాఖ్య వ్రాస్తున్నారు. అది ముద్రితమయితే దానితో చారిత్రక, భాషావిషయక విశేషాలెన్నో మనకు తెలుస్తాయి.

'ఈ నూతన పరిశోధనతో నాకు నూతనోత్తేజం కలిగింది భగవంతుడు అనుగ్రహిస్తే, మరికొన్ని అమూల్య విషయాలు నానుండి వెలికిరాకపోవు' అన్నారు నేలటూరి వారు. వారు నూరేళ్లూ నిరోగులై వుండి, నిరంతరాయంగా పరిశోధనలు జరుపుతూ చరిత్రగతినే మార్చే మరెన్నో అపూర్వ విషయాలను కనుగొనగలరనే ఆంధ్రావళి అత్యంత గాఢంగా విశ్వసిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ మరి ముగ్గురు ప్రముఖులను విశిష్టసభ్యత్వంతో గౌరవించింది. వారు — శ్రీయుతులు వానమామలై వరదాచార్యులు, దువ్వూరి వెంకటరమణశాస్త్రి, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి గార్లు.

శ్రీ వానమామలై వరదాచార్యులుగారి సమున్నత సౌమ్యమూర్తిని చూడని, శ్రావ్యగంభీరకంఠాన్ని వినని తెలంగాణా పౌరుడుండడు శ్రీ వరదాచార్యులు గారు, తమ కవితను పల్లెపల్లెకు వినిపించి, తెలంగాణా ప్రజలను సాహిత్యోన్ముఖులను కావించినవారిలో ఒకరు.

ఆచార్యులుగారు 1912 ఆగస్టు 16 వ తేదీన మడికొండలో జన్మించారు. భక్తిపాండిత్యభరితమయినవంశం. పితృపాదులు శ్రీ బక్కయ్యశాస్త్రిగారు సంస్కృతాంధ్రద్రవిడ సాహిత్యంలోను, జ్యోతిర్వేదాంతశాస్త్రాలలోను ఉద్దండ పండితులు, పౌరాణికులు. 'బ్రతికి బక్కయ్యశాస్త్రి పురాణం వినవలె' అనే నుడి ఆ ప్రాంత ప్రజల నాలుకపై నాట్యమాడే నానుడి. శ్రావ్యమయిన కంఠం, పలు భాషల పాండిత్య సంస్కారం శ్రీ వరదాచార్యులు గారికి పైతృకం. దీనికితోడు సుప్రసిద్ధ కవిపండితులు శ్రీ కాళోజీ రంగారావుగారి వద్దను, అగ్రజులయిన శ్రీ వరదాచార్యులవద్దను సాహిత్యాంతేవాసిత్వం ఆచార్యులవారిని తీర్చిదిద్దాయి. మరొక అగ్రజులు—'రైతు రామాయణం' రచించిన శ్రీ జగన్నాథాచార్యులుగారు—శ్రీ వరదాచార్యుల వారి దృష్టిని పల్లెటూరి సమస్యలవైపు మళ్లించారు. దానితో శ్రీ వరదాచార్యుల వారి కవిత పల్లెటూళ్ల పచ్చందనంతో, జానపదుల జిలుగు కమ్మరపు పలుకుల వెలుగులతో తెలుగు తల్లికి నూతన నీరాజన మయింది.

ఆయన ఖండకృతులు పెక్కు—మణిమాల, జయధ్వజముఅనే సంపుటాలుగా, గేయాలు 'ఆహ్వానము' అనే సంపుటంగా, తెలుగువారికి అందాయి. ఆయన 'విప్రలబ్ధ' విశిష్టగేయకృతి. రజాకార్ల దురంతాల తర్వాత ఒక ముస్లింబాలిక ఒక విప్రునికి లభించి—విప్రలబ్ధఅయి—అతని పోషణలో పెద్దదై ఒక నయవంతుని పెండ్లాడి, హిందూముస్లిం సమైక్యానికి దోహదకారిణి అవుతుంది. ఈ గేయకావ్యంలోని ఊహాలు అపూర్వాలు—గ్రామీణపరిసరసౌరభ ఘుమఘుమారంభాలు—

'షష్ఠిచంద్రుడు తాను చదలచుక్కలతోడి
తెల్లపిల్లలకోడి తిరిగినట్లుంటాడు.'

అట.

'ఇనుని తాపమువలన కనుల చీకటిక్రమ్మ
పడియున్న సుకుమార ప్రకృతిసుందరి నోట
గగన మాతయు తనదు ఘనకుచమ్మను పిండి
పాల్పోయునవి శశియొ పండు వెన్నెల గాయ.'

ఇలా ఎన్నో.

ఆచార్యులుగారి పోతన చరిత్రము మహాకావ్యం. అది వారికి వివిధ కళలలో—సంగీత నాట్య చిత్ర రచనాదులలో—గల ప్రతిభకు, పదప్రయోగ పాండితీ ప్రౌఢమకు, రసరామణీయకానికి నిదర్శనమై 'కవికోకిల, కవివతంస, కవిశిరోవతంస, మహాకవి శిరోమణి, ఉత్ప్రేక్షా చక్రవర్తి, అభినవ పోతన' మున్నగు బిరుదాలకు ప్రదర్శనమయింది. పోతన చరిత్రములోని ఏ పద్యమయినా,

'గాలిన్ దేలుచు మబ్బుతెట్టె
టులనో కన్పించనా నల్లియే
పోలేరమ్మకు బోనమున్ని సరిపి
మున్ మున్ గోత పట్టించుటే
మేలా' నంచు వచించె బోతనకు
సామీ యంచు కేల్మోడ్చి మి
న్నాలోకించుచు బాలికా
పపుడు లాభాకాంక్ష లేపారగన్'

అని కమ్మచ్చులో లాగిన కాంచన తంత్రివలె సాగి హృదయాన్ని ఆనందమయ లోకాలకు తీసుకోని పోతుంది.

శ్రీ వరదాచార్యులవారింకా షష్ట్యబ్దికూడా నిండనివారు, రాజయక్ష్మరాహు వినిర్ముక్తులు కనుక అపూర్వపాండిత్య పాటవంతో అసంఖ్యాకకావ్యాల ఉమెతలు అందిస్తారు. సందేహంలేదు.

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి రూపం రమణీయం, వాక్కు రమణీయతరం, రచన రమణీయతమం. కనుకనే వారి బాలవ్యాకరణ సమీక్షకూడా 'రమణీయము'అనే పేరుపెట్టుకొంది.

'యద్యపి బహు నాధీషే
తధాపి పఠ పుత్ర వ్యాకరణం,

స్వజనః శ్వజనో మాభూత్
సకలం శకలం, సకృత్ శకృత్.'

అని అభియుక్తోక్తి. 'అబ్బాయీ, ఎక్కువగా చదువుకోకపోయినా వ్యాకరణం తప్పక చదువు. ఎందుకంటే, శబ్దస్వరూపం తెలుస్తుంది. స్వజనం అనడానికి శ్వజనం (కుక్కలు)అని, సకలం అనడానికి శకలం అని, సకృత్ అనడానికి శకృత్ (పురీషం)అని అన కుండా వుంటావు'. కాని, వ్యాకరణం అనాదిగా సూత్రబద్ధం, క్లిష్టావబోధం, 'బోర్' కావడం వల్ల విద్యార్థులదృష్టి ఎప్పుడెప్పుడు వ్యాకరణపాఠం మంచి వెలుపలికి పోదామా అని వుంటుంది. అలాటి దానిలో ఆసక్తి కలిగించి, వేలాదిశిష్యులను వ్యాకరణ వేత్తలుగా చేసిన ఆచార్యులు, పరమాచార్యులు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు. ఆయన వ్యాకరణపాఠం విద్యార్థులకు అమృతపు ఆమెత; చదువుకు అడ్డురాని ఆటవిడుపు.

దువ్వూరివారు తూర్పుగోదావరిజిల్లా ద్రాక్షారామకు సమీపంలోని మసకపల్లి గ్రామంలో 1898 మార్చి 25 న జన్మించారు. బాల్యంలో మాతామహులవద్ద సంస్కృత కావ్య నాటకాలు చదివి, పిదప పిఠాపురంలో శ్రీ వేదుల సూర్యనారాయణ శాస్త్రిగారివద్ద సిద్ధాంత కౌముది మొదలయిన వ్యాకరణ గ్రంథాలు పఠించి, తర్వాత విజయనగర మహారాజ సంస్కృత కళాశాలలో వ్యాకరణ విద్యా ప్రవీణ, ఉభయభాషా ప్రవీణ పరీక్షలలో వుత్తీర్ణులయ్యారు. మొదట విజయనగర సంస్కృత కళాశాలలోను, చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలోను, ఆచార్యులుగా వుండి,అనంతరం దాదాపు 25సంవత్సరాలు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆనర్సు తరగతులకు అధ్యాపకులై అందరి మన్ననలు పొంది, వేలాదిగా విద్యార్థులకు విద్యాదానం, ముఖ్యంగా వ్యాకరణ విద్యాదానం చేశారు.

దువ్వూరి వారి గొప్పకృషి బాల వ్యాకరణ సమీక్ష అయిన 'రమణీయం'. ఇది ఆంధ్రపాణిని అన దగిన చిన్నయసూరి హృదయానికి దర్పణం, వ్యాకర ణాధ్యేతలకు సంతర్పణం.

దువ్వూరివారు ఈ 'రమణీయము' ఉపోద్ఘాతమన దగిన పూర్వభాగంలో చిన్నయసూరి జీవిత సంగ్రహం తెలిపి, అతని రచనా ప్రణాళికను, పాండితీపటిమను, శీలసౌమ్యతను, ఉక్తిలాలిత్యాన్ని, అనువాద వివేచనమును అత్యంత రమణీయంగా వివరించారు. శ్రీ శిష్ట్లా కృష్ణమూర్తిశాస్త్రిగారి హరికారికావళిని చిన్నయసూరి అనువదించారనే చిన్న అసూరుల వాదాన్ని తుత్తునియలు చేశారు. చిన్నయసూరి ప్రాచీన సంస్కృత వైయాకరణుల గ్రంథాలను ఎంతగా మథించారో, అష్టాధ్యాయి వ్యాఖ్యాతలను అనుపదం ఛాయవలె ఎంతగా అనుసరించారో తెలిపే పట్టులు పఠితలకు చాల సంతోషాశ్చర్యాలు కలిగిస్తాయి. క్రియాపదిచ్ఛేదం మొదటి సూత్రం వివరణ మచ్చుకు:—

'ధాతువునకు. ఇది యధికార సూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపబడు నయ్యది ధాతువున కగునని యెఱుఁగునది.'

దీనికి దువ్వూరివారి వివరణ చూడండి.

'ఈ యధికారసూత్ర ప్రయోజనమును వివరించుచు సూరి పయినివ్రాసిన వాక్యము గమనింపుడు. పాణినీయమున ప్రాచీన గ్రంథములగు కాశికావృత్త్యాదులలో నిట్టి సందర్భమున 'ఇత ఊర్ధ్వం య దనుక్రమిష్యామః త ద్ధాతో రితి వేదితవ్యం.' అను వాక్యము కాననగును. ఈ వాక్యమందలి పదముల క్రమమునయిన మార్చకుండ, అదే వరుసలో తు-చ తప్పకుండ రచించిన సూరి వాక్యమునకు వృత్తికారుని వాక్యమునకు గల పోలిక గుర్తింపుడు.'

ఈ విధంగా దువ్వూరివారు చిన్నయసూరి అసమాన పాణినీయ వేతృత్వాన్ని తులనాత్మకంగా చూపే ఘట్టాలు ఈ రమణీయముతో కోకొల్లలు.

దువ్వూరివారి ఆచార్యత్వానికి మరొక తార్కాణ 'కలభాషిణి'. ఇది పింగళి సూరన్న కళాపూర్ణోదయానికి సరళ హృద్య గద్య రచన.

దువ్వూరివారు తమ మధురవాక్కులతో, మధురతర పాఠ ప్రవచనాలతో, ఆంధ్రప్రదేశమంతటా తామరతంపరగా వ్యాపించిన శిష్యప్రశిష్య సంతతితో ఆచిరాయువుగా ఉండాలని అందరూ ఆకాంక్షిస్తుంటారు.

శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామిగారు ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం. పైకి పరస్పరం సంబంధం కనిపించని వివిధ విద్యలు పుక్కిటబట్టి, వివిధానేకోద్యోగాలు నిర్వహించి, రసపిపాసతో సాహితీ సమితి ప్రముఖులై అనేక సాహిత్య ప్రక్రియలలో రచనలు సాగించి సహృదయులను ఓలలాడించినవారు.

తెనాలి సమీపంలోని బుర్జిపాలెంలో 1892 సెప్టెంబరు 9 వ తేదీన పండితవంశంలో జన్మించారు. తెనాలి ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసం చేశారు. ఎలెక్ట్రికల్, మెకానికల్ ఇంజినీరింగులు చదివి, కొంతకాలం పర్మనెంట్ హైవేస్ శాఖలో పనిచేశారు. రసహృదయులు అందువల్ల ఆ కొలతలు, మట్టితట్టల మనుష్యులు వారి మనసుకు నచ్చలేదు. ఆ పని వదలి, సమర్థులయిన ఆచార్యులవద్ద — శ్రీయుతులు కంభంపాటి రామమూర్తి శాస్త్రి, దెందులూరు పానకాలశాస్త్రి, కురుగంటి రామశాస్త్రి, జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్యులు, ద్రావిడ లక్ష్మినారాయణశాస్త్రి గార్లవద్ద — వ్యాకరణ, న్యాయ, వేదాంత, పూర్వ మీమాంసాశాస్త్రాలు అధ్యయనం చేశారు. జ్యోతిర్వేదాయుర్వేద ధర్మశాస్త్ర, మంత్రతంత్ర వాస్తుశాస్త్రాలలో సాటిలేని ప్రజ్ఞ సంపాదించారు. పలుభాషలు నేర్చారు ఇంతటి ప్రతిభాసంపన్నులు కనుకనే, దేశంలో నవ్యసాహిత్యవికాసానికి మూలస్తంభమయ్యారు.

మరొకవంక లలితకళలు అభ్యసించి చిత్రాలు గీచారు. సంగీతసాధన చేశారు. భరతశాస్త్రంలో ఆరితేరి, తెనాలి రామవిలాససభలో ప్రధాన నాట్యాచార్యులై నాటకప్రయోగంలో నవ విధానం ప్రవేశపెట్టారు. ఈ నాటకప్రయోగానుభవం చలనచిత్ర రంగంలో ఉషాపరిణయం, విప్రనారాయణ చరిత్రలను కళామయం చేయడానికి తోడ్పడింది.

త్రిపురారిభట్లవారు క్రీడలలోను నిపుణులు. చదరంగం, ఈత, మున్నగువాటిలో సాటిలేని కుశలులు. వీటన్నిటివలననే ఆయనను 'చిన్నసైజు విజ్ఞాన సర్వస్వ' మంటారు సాహితీసమితివారు.

త్రిపురారిభట్లవారి ఈ విజ్ఞానమంతా బీరుపోకుండా తెనాలి సంస్కృతకళాశాల నిర్వాహకసంఘం వారిని అధ్యక్షులుగా వరించి, విద్యార్థులకు, రచయితలకు మహోపకారం చేసింది. ఆయన పన్నెండేండ్ల పాటు ఆ పాఠశాలను నిర్వహించి, వందలకొలది విద్యార్థులను విద్వాంసులుగా, వివిధవిద్యాపారీణులుగా తీర్చారు.

సాహిత్యంలో పెక్కుప్రక్రియలలో వారి లేఖిని నిరాఘాటంగా విహరించింది. ఖండకావ్యాలు, కథానికలు, నవలలు, వ్యాసాలు ఎన్నో అనువాదాలూ వున్నాయి — కపాలకుండల, అన్నదమ్ములు, మొదలయినవి నవలలు. కుంతల, సాగరకుమారి, ముక్తావళి, నవమాలిక, భాసకథావళి— కథాకదంబాలు. ఏకోత్తరశతి అనే పేర రవీంద్రుని గీతాలను అనువదించారు. వ్యాకరణ పారిజాతం, వ్యాకరణ చింతామణి విద్యార్థి సందోహానికి కల్పవృక్షాలు. చైతన్యచరితామృతం, రాజాగణేశ, రత్నావళి, మొదలయినవి ఇంకా ముద్రణ పొందాలి.

ఆయనను ఆంధ్రప్రజ ఎన్నోరీతుల గౌరవించింది. 'వేదాంతపారీణ' అనే బిరుదిచ్చింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయనను వివిధసంఘాలలో సభ్యునిగా నియమించి మన్ననచేసింది. తెనాలి పురపాలకసంఘం ఆయన కాపురమున్నవీధికి త్రిపురారిభట్లవారివీధి అని పేరుపెట్టి తన ఉచితజ్ఞతను వ్యక్తపరచింది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ తన సంప్రదాయానుసరణలో ఈ నలుగురు పెద్దలను విశిష్ట సభ్యత్వంతో సన్మానించడం ప్రశంసించదగింది.

# గ్రంథ విమర్శలు

## యుగసంకేతం

(మాదిరాజు రంగారావు ప్రతులకు: ఆంధ్ర సారస్వతపరిషత్తు, బొగ్గులకుంట, హైదరాబాదు)

మనిషికి కావలసిన ముఖ్యావసరాలు మూడు— అవి కూడు, గుడ్డ, గూడు. ఏదేశప్రజలకైనా ఈ అవసరాలు తప్పనిసరి. మనదేశ విషయం ఆలోచించినా ఈ మూడే అందర్నీ ఆందోళనపరిచేవిగా ఉన్నాయి. ఈ అవసరాలు తీర్చమని అడిగే హక్కు ప్రజలకుంది. తీర్చాల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది. ఏప్రభుత్వాలు ఎంతెంతవరకు ఈ అవసరాలు తీరుస్తున్నాయి—తీర్చ నందువల్ల వచ్చే పరిణామాలు ఏఏదేశాల్లో ఎలా ఉన్నాయి అన్నది స్వల్పంగా ప్రపంచ రాజకీయజ్ఞానం ఉన్న ప్రతివ్యక్తికీ అర్థమయ్యే విషయం. ప్రపంచ పటాన్ని మన ముందుంచుకు ఆలోచిస్తే, ప్రపంచంలోని సమస్యలన్నీ కేవలం భౌతికంకాదని,మరికొన్ని ఉన్నవన్నది స్పష్టం అవుతుంది. మానవుని భౌతిక, మానసిక సంఘర్షణ సార్వకాలికం ఈ సమస్యపోతే మరొకటి. సమస్యల్లేని యుగమేది? సాంకేతికంగానూ, ఆర్థికం గానూ పురోగతి సాధించిన దేశాల్లోనూ సమస్య లున్నాయి. అలజడులున్నాయి. మౌలికమైన భౌతిక సమస్యలు, ఆర్థిక అభివృద్ధిద్వారానూ, వర్గరహిత సమాజ నిర్మాణంద్వారానూ పరిష్కరింపబడవచ్చు. కాని ఆంతరంగికమైన సమస్యలు—ఆవేదనలు వేనితో పరిష్కరింపబడాలి? అందుకే మానవుని భౌతికాభి వృద్ధితోపాటు మానసికవికాసం అత్యవసరం. మానసి కంగా పరిపక్వంగాని ఏజాతి, ఏదేశప్రజలు సమున్నత సంస్కృతివృక్షాన్ని చివరికంటా కాపాడుకోలేరు. అందుకే ప్రతివ్యక్తి తన నిత్యజీవితావసరాలు తీర్చు కునేందుకు ఎంత పోరాడవలసిఉందో, వ్యక్తిగత వికాసం, తద్వారా జాతిజాతినే మేల్కొలిపే ప్రయత్నం కూడా అంతే అవసరం.

ఈ విషయాన్నే ఈ యుగసంకేతం ప్రతి పాదిస్తుంది.

'జ్వలించనీ విప్లవంతో ఈ దేశం
అవతరిస్తుం దింతకన్న మంచిదే సత్వరం'

అంటారు

విప్లవం అంటే ఏమిటి? కత్తులు కటా ర్లతో యుద్ధరంగానికి బయలుదేరమనా! కాదు— 'మెలకువ నా విప్లవం' అని జవాబు. తాను మేల్కొనిఉండటమేకాక, ప్రతివ్యక్తి తనలో తాను మేల్కొనిఉండాల్సిన అవసరం ఎంతో ఉందంటారు.

ఆత్మశుద్ధిలేని, నిజాయితీలేని శుష్కనినాదాల వల్ల బోర్డు కవిత్వాలవల్ల వచ్చే ఉపయోగం చాలా తక్కువ. జీవితం, ప్రపంచం అంటే సరైన అవగాహన ఉండి సమగ్ర దృష్టితో బ్రతుకుబాటను చూపించ టమే కవి ముఖ్యలక్షణం—

'రేపటి అభ్యుదయకోసం
అగ్నియై మేల్కొంటాను
ప్రగతిశీలం నా వర్తనం'

*          *          *

'ప్రతిమూల ప్రతిధ్వని తప్ప
ఎక్కడోకాని అసలు ధ్వని విన్పించదు'

ప్రతివ్యక్తి తనకుతాను అపరిచితుడై శూన్యంలో అంధకారంఇసుకదిబ్బల్లో కూరుకు పోతున్నాడు. అటు రాజకీయంగానూ, ఆర్థికం గానూ, సామాజికంగానూ - ఇటు మానసికంగానూ అంతా అల్లకల్లోలంగా అయోమయ స్థితిలో ఉండి పోయింది. ఇచ్చటన్నీ 'లాంతరు ముఖాలు' పగటి వేషగాడి వతుగా జీవితాలు దొర్లుతున్నాయి.

'మెలకువలో స్వప్నంవెంట—పరుగెత్తేమనం'
శవాలులేచి తిరగటం ఆరంభించాయి

ఆత్మలు ముడుచుకుని పడుకొన్నని'
అందుకే

'ఎండకాలం దాహంతో గుక్కెడు అవనివలె
ఉన్నది మానవత దైన్యంతో ప్రమాదంలో'

కాబట్టే ఈ దేశం ఆ దేశం అనే ప్రసక్తి లేకుండా అన్ని దేశాల్లోనూ—

'ఉన్మత్త ఝంఝూ సంగీతంలో
జ్వాల దహంకారానికి ప్రతిఫలంగా
అగ్నికాహుతియౌ భవనాలు
శ్మశానాలుగా మారే పట్టణాలు'

ముఖ్యంగా మనదేశ స్థితి—

చల్లారిన శ్మశానంవలె ఉం
దట్టంగా పొగక్రమ్మిన రాజకీయం
ఎన్ని వికృత రూపాలు ధరిస్తుంది
మనిషికి మానవుడు కన్పించటం లేదు—
ఎన్నో యుగాలు వెలిగించిన సంస్కృతి
ఇప్పుడు వెలిగిస్తుంది శ్మశానాన్ని'

ఇది ఈనాటి ప్రపంచ చిత్రం. నిస్తబ్దత అంతటా క్రమ్ముకుంది. అది జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ ఆవరించింది.

అందుకే

'జ్ఞానానికి దూరంగా
విజ్ఞానానికి దగ్గరగా
తన చుట్టూరా తిరుగుతున్న
లౌకిక జీవితవలయం'లో
బందీయై ఎలుగెత్తి

ఘోషిస్తున్న మనిషిని రక్షించగలిగేది … ఒక్క మార్గం—

అది —

'మానవుడు ప్రసరించవలసిందే
అతడు గమనం సాగించవలసిందే
స్థూలప్రకృతినుండి సూక్ష్మస్వభావం వరకు
వైయక్తిక వలయంనుండి విశ్వాత్మలోకి'

ఈ విశ్వజనీనమైన దృష్టి ప్రతి ఒక్కరూ అలవర్చుకోవలసిన అవసరాన్ని ఈ మాటల్లో చెప్పారు —

'ప్రతి మనిషీ ముఖ్యంగా తనలో తాను
మేల్కొనవలసిన అవసరం ఎంతో ఉంది'

కదలే ఈ శవాలకన్న, శిలామయజగత్తుకన్న కదలలేని చెట్టు—నిదురలో సైతం మెలకువలో వుండే చెట్టు--హృదయంతో మాట్లాడే చెట్టు కవికి, ఆదర్శవంతం కావటంలో ఆశ్చర్యం లేదు!

'ఊహకు చేతకూ
ఆశకూ ఆశయానికి సంబంధం' వేకూర దిక్కడ.

రెక్కలు దాల్చిన కొండలు ఎగురుతున్నాయి—మేఘాలస్థానంలో, చెట్లలో పచ్చదనం మాయమైపోతున్నది: నదులతో తరగలు అణగిపోతున్నాయి. మనుషుల్లో చేవ చచ్చి, పొగగొట్టాలుగా తయారయి పొగజారిన లాంతరు ముఖాలతో తిరుగుతున్న దేశం ఇది.

'అపశకునపు టూళలు, ఉద్రేకపు టరువులు
గుండ్రాళ్ల దొర్లింతలు, గులకరాళ్ల కలవరింతలు
ముళ్ళ కంపల ఈడ్పులు, నిదురలో కలవరింతలు
సుడిగుండాల తిరుగుళ్లు, ఆవలింతల త్రేన్పులు'

లోతుగా ఆలోచించే ప్రతివారికి ఇదే ఈనాటి ప్రపంచపు తీరు అన్పించకమానదు. నటనే జీవితమై, యంత్రంగా బ్రతకటమే ధ్యేయమై, పతనావస్థకు చేరటమే గమ్యమైపోయిం దిక్కడ. ఎవ్వరూ బ్రతకరు అసలు ప్రాణాలున్న వ్యక్తుల్లా కన్పించరు. సజీవ శిల్పాలు ఇవి. అందుకే ఇలాంటి ముఖయంత్రాలను నియంత్రించటానికి ఈ గీతం వ్రాయాల్సిన అగత్యం ఏర్పడింది.

సంఘంలో ఎక్కడ నీతిఉందో, ఎక్కడ నిజాయితీ ఉందో కరిగారికి బాగా తెలుసు.

గుడిలో పూజారి మడిలోకన్నా
కూలివాని గుండెల్లో ధర్మం ఉందని
వేదికపై శాస్త్రి ప్రవచనంలోకన్నా
సామాన్యుని బ్రతుకులో సత్యం ఉందని'

అందర్ని నిలదీసి అడుగుతున్నారు. ఇన్నాళ్ల

స్వాతంత్ర్యం తర్వాత ఇన్ని ప్రణాళికల పరిణామం తర్వాత మనం సాధించేదేమిటి? మనదేశంలో సమృద్ధిగా ఉంది ఏమిటి?

'చెప్పండి ఈ దేశంలో సమృద్ధిగా ఉన్నది
ఎక్కడ చూసినా అసంతృప్తి ఆందోళన
విప్లవం రెక్కలు విప్పిన వాతావరణం
ఎవడికి పుట్టిన బిడ్డరా ఈ స్వాతంత్ర్యం'

కాబట్టే గాంధీగారన్నటు మానసిక స్వేచ్ఛ పొందని ఏ జాతికూడా సతతోన్ముఖవాతుందేతప్ప ప్రగతి సాధించలేదు. విశృంఖలతని స్వేచ్ఛ అనుకుంటుంది, ప్రభుత్వం, ప్రజ. ఈ నాటి ఈ స్వేచ్ఛ---కట్టేసి కట్టేసిఉన్న గొడ్డు, ఒక్కసారి వదలగానే బజారునపడి, అడ్డమైన కసుగందుల్ని తొక్కుకుంటూ—పైరు పంటల్ని నాశనం చేసినట్లుగా ఉంది. అందుకే ప్రతివ్యక్తి ఆచరణలో 'ఈ మరుభూములపై ఉల్లోలతరంగమై ప్రవహించమని ఉద్బోధ.

'గతంలోని తప్పిదాలను
నెమరువేస్తూ కూర్చోకు,
ద ● గీతాల మడతల్లో
చుట్టలు చుట్టుకుని పరుండకు'

దానివల్ల ప్రయోజన మేముంది? 'విప్పిన ఎదకంటిచూపు విశాలమై ప్రసరని' అనేదే వీరి ఆశయమున్నా—

దుఃఖితుల కన్నుల్లో
దాగి ఉంటుంది రాత్రి
వారి ఆశలలో
పరచుకుంటుంది ఉదయం'

ఆత్మస్థైర్యంతో అన్నమాటలు చూడండి—

'నిరాశలో మేల్కొంటాను
ఆశతో జయిస్తాను
నేనే యుగ సంకేతాన్ని'—

వీరి ఉద్దేశ్యంలో ముఖ్యంగా ఈ యుగ లక్షణం-మనోజీవనసంస్కార సాహిత్యరాహిత్యం. ఆర్థిక స్వాతంత్ర్యంకంటే అంతరంగవికాసమే ముఖ్యమని; అది లేకపోవటంమూలానే నమ్మకంచచ్చి, తన నీడ జూచి తానే బెదురుతున్నాడు మానవుడు. ఒకరకమైన భయం వాయువులో మనం బంధింపబడ్డాం. మూర్ఛాస్థితికొచ్చేశాం. కాబట్టి కాలాన్ని గురించి మాట్లాడినందువల్ల ఉపయోగంలేదు.

'చీకటితో పోరాడే వెన్నెల' గురించి ఆతోచించాలి.

ఈ దేశం, దానియొక్క మనుషుల వేదనలు, బాధలు, సమస్యలు తనవే — నేలవిడచిన సాముకా దితనిది—

'నా కాళ్లు నేలలో పాతుకొని ఉన్నాయి
నా హృదయం భూమి గుండెకు హత్తుకునిఉంది.'

అధ్యాన్నపు అంధకారంలో తారట్లాడు జీవుల మేలుకొలిపే బాధ్యత ఇతనిది. కాబట్టే పలాయనం కా దితనిది సమస్యలున్నాయి కాని సమస్యాపరిష్కార మార్గాల్లోనే భేదం. ఇతను ముందు మనిషి purify అయి తన్నుతాను reform చేసుకుంటేతప్ప, ప్రగతిఅనేదానివల్ల ఉపయోగంలేదు అంటారు. మరి కొంతమంది మనిషికి ఆర్థిక స్వాతంత్ర్యం రానంత వరకు ఏంజరిగినా లాభంలేదు అంటారు. పరిష్కార మార్గం భిన్నం. అంతే!

'దేశమంటే ఏమిటి
ఒక చిటికెడు మట్టి
మట్టిలోని పరిమళం
మనకు మిగిలే సంస్కృతి.'

దేశాన్నిగూర్చి వీరి నిర్వచనం ఇది. ఈ సంస్కృతి పల్లవించటానికి, పెంపొందటానికి ఆకలి తీర్చుకోవటంకాకుండా, అంతరంగాలు వైశాల్యంచేసి శుభ్రమైనగాలి-వెలుతురు, ప్రసరింపజేయాలంటారు. కాని కొంతమంది పొట్టకే గతిలేదు మరి 'పరిమళం' మాకెందుకయ్యా— ముందు పొట్టసంగతి ఆలోచించవయ్యా?' అంటారు. వారి మాటేమిటి??

'కవిత్వం ఈనాడు
వల్లమాలిన ఓపికతో

చెల్లని నియమరేఖలతో
గణ యతి ప్రాసల కట్టుబాట్లతో కాక
ఉద్వేగపు కొలతతో
ఆవేదనా శీలంతో
అనుభవ పరమార్థంగా
స్వేచ్ఛాభావన పొందిన రూపం'

అంటారు.

నిర్వచనం బాగుంది. ఈ నిర్వచనానికి వీరి ఎన్ని గేయాలు ఒదుగుతా యన్నది ప్రశ్న? గణ యతి ప్రాసల్ని పాటించకుండా రాయటమే వచన కవిత్వం కాదు. నిజానికి ఇందులోని గేయాలు చాలా మట్టుకు బుద్ధిజనితల్లాగా కన్పడతాయి. చింతన లోంచి పుట్టుకొచ్చినట్లు కన్పిస్తాయి. spring లా పొంగి గుండెలను చించుకొని వచ్చినట్లు మాత్రం కన్పించవు; కాబట్టే చాలా గేయాలు మామూలు స్థాయిలో – కేవలగద్యాన్ని త్రోసిరాజన లేకపోయ్యాయి. వీటిని చదివి అర్థంచేసుకోవాలంటే 'వల్లమాలిన ఓపిక' మాత్రం తప్పనిసరి. అసలు వచనగేయ లక్షణం చదువరి సహనాన్ని పరీక్షించటం కాదు— ఝుమ్మని భావాన్ని ఎదలో దించేయాలి. వచన గేయాలు రాస్తూ ఒక రకమైన పాఠకుల్ని మన సులో పెట్టుకు రాయననటమేమిటి — అటువం టప్పుడు చిత్ర, బంధ కవిత్వాలకి—దీనికి తేడా ఏమిటి? పూర్వం ఏ కవి రాసిన ఎంతటి గొట్టు పద్యమైనా నిఘంటువు సహాయంతో అర్థం ఎవ్వ రైనా చేసుకోగలరు—మరి ఈ గేయాలు బోధపడ టానికి నిఘంటువుకాదు బహుశా రచయితే వచ్చి చెప్పితేతప్ప అర్థంకావు –

ఈ రకమైన attitude వచన కవిత్వానికి లోతు తెచ్చిపెడుతుందా?

అందునా అభ్యుదయ భావనని ప్రచారం చేసే టప్పుడు ఎంత సులభంగా అర్థమయితే అంత మంచిది. చదువరి రచయిత ఎత్తులకు ఎప్పుడూ ఎగరలేడు—అంతమాత్రాన రచయితని, కవిని సామా న్యుని 'లెవెల్'కి దిగిరమ్మని చెప్పటంకాదు. కానీ సామా న్యుని దృష్టిలో ఉంచుకొమ్మనే—

'అర్థం అయ్యేగుణం' అన్నదాంతో ఈ సంపుటిని రంగారావుగారి ఇతర సంపుటాలతో పోల్చి చూస్తే—ఇది చాలా మెరుగు.

'పొద్దుపొడిచి
మలపటం మరచిన వీథిదీపాలు
చంద్రుని ఫోర్జరీ సంతకంలోని
అక్షరాలవలె వెలుగుతున్నాయి.'

ఇలా ఊహించగలిగిన కవి — కొన్ని గేయాల్ని చాలా నీరసంగా లాగి లాగి వచనంకన్నా హీనంచేసి ధ్వంసంచేశారనిపిస్తుంది.

ఒక రకమైన Mystic experience ని అనువదించటంలో రంగారావుగారి రంగారావుగారే సాటి Brevity is the soul of wit అన్నది కవి కూడా మరిచిపోరాని విషయం సోదిగా చెప్పుకు టూ పోతే, సాగతీస్తూ ఉంటే విసుగుతో పుస్తకం అవతల పారేస్తాడు చదువరి. ఉద్దేశ్యమే దెబ్బతింటుంది. 'సిగరెట్స్' చాలామంచి గేయం. వాతావరణం కల్పించటంలోనూ. ఆ చిన్నగేయం ఓ మాంచి బిగువైన సినిమాలా, గొప్పచిత్రంలా, కళాఖండంలా ఉంటుంది. ఈ బిగువే అంతటా కన్పించదు— ఏమైనా తన త్రోవ తను వేసుకున్న రంగారావుగారు ఇంకా చైతన్యవంతమైన గేయాల్ని అందిస్తారని ఆశించవచ్చు—

—కె శివారెడ్డి.

# ఏది సత్యం ఏ దసత్యం

(న వ ల)

(రచన : శ్రీమతి సి. ఆనందారామం ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ—బందరు—సికింద్రాబాదు—మద్రాసు. వెల 2—50. పేజీలు—172.)

నానాటికి మారిపోతున్న సామాజికవ్యవస్థలో మానవుడు కలసిపోయి మానవత్వంలోని మహిమను పరిశీలింపలేక, మంచిని చెడును నిర్ణయించుకోలేక అర్థంగాని ఆలోచనలను పెంచుకొని ఏది సత్యమో ఏ దసత్యమోయని నిరూపించుకోలేనివాడవుతున్నాడు. చదువు సంధ్యలున్నను సంస్కారం లబ్బని కొందరు తెలిసీతెలియని ఆవేశంలో మునిగి ఊహాసౌధాలు నిర్మించుకొని హాయిగా అందులో జీవితాన్ని గడపాలని కలలు కంటారు. కలలు కనటమేగాని వారి జీవితాల్లో అనుకొన్నవిధంగా జరగదు. కల్పించుకొన్న ఊహలకు వ్యతిరేకంగా ఘటనలు ప్రాప్తించినట్లయితే తాను ఎంతగానో దిగజారి తనచుట్టూ ఒక విషవలయాన్ని నిర్మించుకొంటాడు దానినుండి విముక్తి కలగాలంటే మరో జన్మ ఎత్తవలసిందే, లేకపోతే సాధ్యంకాదు. సందిగ్ధావస్థలో మానవుడు సతమతమైనపుడు ఏది సత్యమో ఏ దసత్యమో గ్రహింపలేని అసమర్థుడై అసంతృప్తితో అనుక్షణం అలమటిస్తూ ఉంటాడు జీవితాంతం అతని మనుగడ పెరగక తరిగిపోతూ ఉంటుంది. ఈ నవలలో నాయకుడైన 'మౌళి' జీవితం యిలాగే అడుగడుక్కు ఆపదల పాలౌతుంది.

కల్యాణికి—మౌళికి హఠాత్తుగా పరిచయం ప్రారంభమై చివరకు యింటినుంచి తప్పించుకొని రిజిష్టర్ మేరేజి చేసికొనేస్థితికివచ్చింది. మగవాడినని ధీరుడనని నిరూపించుకోవాలని తాపత్రయపడ్డాడు మౌళి తనచేసే ప్రయత్నం ఏదీ కలసిరాలేదు చివరకు తన భార్యపైన ఆధారపడి జీవింపవలసిన అవసరం కలిగింది. అవసరాన్నిబట్టి ఆలోచింపలేక వ్యర్థమైన నమ్మకంతో తన అభ్యుదయాన్ని పాడు చేసికొని, ఎదుటివారినిచూచి ఓర్వలేక కచ్చితంగా తన నిర్ణయాన్ని వ్యక్తంచేయక భార్యను నిందించటం మొదలు పెట్టాడు. భార్యాభర్తలమధ్య దాంపత్యం వక్రించింది. కనిన కలలు చెదరిపోయాయి. ఊహలు భగ్నమయ్యాయి. మాటలు కలవలేదు. తనువులు వేరైపోయాయి. భర్తను భార్య అర్థంచేసికొని ప్రవర్తించినా భార్యను భర్త గుర్తింపలేకపోయాడు. అంతా అయిపోయినతరువాత అయ్యోఅంటే ప్రయోజనం ఏమీలేదు—బాధ, వ్యధ తప్ప. చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకొన్నాడు మౌళి. క్లుప్తంగా కథ యిది.

శ్రీమతి ఆనందారామంగారి నవలల్లో శిల్పం ప్రతిఘటనలో వ్యక్తమవుతుంది. చెప్పదలచిన భావాన్ని ఘాటుగానే వివరిస్తారు. కాని సాంప్రదాయ బద్ధమైన సంసారాన్ని నిలబెట్టాలన్న కుతూహలం ఎక్కువ. ధర్మాధర్మాలకు, న్యాయాన్యాయాలకు, మంచిచెడులకు, రాగద్వేషాలకు సంఘర్షణ చూపించి తత్త్వభావంలో పాఠక ప్రపంచం నిమగ్నమగునట్లు చేయగల సామర్థ్యమున్నది.

'మీరు చాలా ధనికులని నాకు తెలుసు. కాని మీ ఐశ్వర్యంమీది ఆశతో మీ అమ్మాయిని చేసికొంటానన లేదు. మీరలా అనుకుంటే ఇప్పటికయినా మీ అభిప్రాయాన్ని మార్చుకోండి. ఇల్లరికపుటల్లుడిలా పడి ఉండడానికి నా కెంతమాత్రం యిష్టంలేదు. ఎప్పటికైనా నా స్వశక్తిమీద బ్రతుకుతానే కాని ఎవరి ఔదార్యాలు నా కక్కర్లేదు' అన్నాడు మౌళి కల్యాణి తండ్రితో.

మౌళి ఆత్మస్థైర్యం కలవాడు కనుకనే ఆ విధంగా మాట్లాడాడు. పేదరికాన్ని అనుభవిస్తున్నాడు. ఈ పేదరికంలో ఆలంబయిస్తే లభించింది. ఆ సంతోషంలో ఏమీ ఆలోచించకుండ కల్యాణితో లేచి పోవాలని కంగీకరించాడు. మాట అయితే గట్టిగా మాట్లాడేడుకాని సాధింపలేక పోయాడు. వాస్తవంగా అతని దగ్గరే ధైర్యం ఉండినట్లయితే లేచిపోయే అవసరం ఉండి ఉండేదికాదు. జీవితాన్ని ఒకవైపునే చూడటం ప్రారంభించాడు కాని వేరొక

వైపు చూచుటకు ప్రయత్నించ లేదు. తాడూ బొంగరం లేనివాడు, తనస్థితిని గూర్చి ఆలోచింపక కల్యాణి మాటకు తలవంచి అనుసరించాడు. రాబోయే పరిణామాలను నిర్ణయించుకొలేని అశక్తుడైనాడు. డిగ్రీఉన్నా ఉద్యోగం సంపాదింపలేకపోయాడు. తన ద్వారా నిరుద్యోగపరిస్థితిని తెలియజెప్పాడు. సహృదయత లేనివాడు. సహనం కోల్పోయినవాడు. తను యేమి మాట్లాడుతున్నాడో తనకు తెలియదు.

ఆదర్శంగా జీవించాలన్న కుతూహలంవల్లనే ఆ ఆదర్శానికి అతిదుర్బలత్వం చుట్టుకొన్నది. ఆదర్శమనుకొని తనగొంతు తానే కోసికొని యితరుల గొంతు కోయడానికి సాహసించినవాడు మౌళి. పొట్ట కోసం వసంతరావు మాటకు ఎదురుచెప్పలేకఊకొట్టాడు. చేసినది తప్పు తనదైనా యితరులమీద అంటే భార్యపై రుద్దాడు. సంస్కారహీనుడైన మౌళి తాను తినక భార్య తింటూంటే చూచి ఓర్వలేని దౌర్భాగ్యుడయ్యాడు. ఇద్దరూ కలసి బతుకాలన్న ఆలోచన నశించింది. కల్యాణి పైన పగ తీర్చుకోవాలన్న తాపత్రయం కలిగింది. భార్య జీతంమీద బతకాలంటే యిష్టపడనివాడు కల్యాణితో ఏలా రావటానికి ముందుకువచ్చాడో ఆలోచింపవలసిన విషయం. అంత మానాభిమానాలున్న వాడైతే కల్యాణికి లొంగే వాడుకాదు. కావాలని వచ్చిన కల్యాణిని దూషించే హక్కు అతనికి లేదు కలలు నిండించుకొన్న కల్యాణికి తీరవిద్రోహం చేయుటం అతని కర్తవ్యం కాదు కాల పరిణామంలో చుట్టూ ఉన్న వాతావరణాన్ని చూచి గ్రహింపక వ్యర్థమైన అసహనంతో అణగారిపోయాడు.

కల్యాణి పేరుకు తగినట్లుగా జీవితం గడపలేదు. యౌవనంలో ఉండటంచేత ఎందుకు, ఏమి అని ప్రశ్నించుకోకనే మౌళిపై మోజు పెంచుకొన్నది. ప్రేమాయణ ప్రారంభంలో తననుతాను నిరూపించుకోలేక ఆవేశంతో ప్రియుడైన మౌళిచెంతకు చేరింది. మౌళి మాటపరసకేదోఅన్నను దానిని లెక్కచేయలేదు. మౌళి మాట్లాడిన మాటనుబట్టి చాలమంచివాడనే భావనయేగాని మంచిపక్కన చెడు ఉంటుందని ఊహించుకోలేకపోయింది.

మౌళి మాటలకు లొంగిపోయింది. ఆ మరుక్షణం దాసోహమన్నది. కన్నతల్లిదండ్రులకన్న మౌళి గొప్పవాడని పిచ్చిగా నమ్మింది. తల్లిదండ్రులు చూపే వాత్సల్యంకంటె మౌళి చూపించే ప్రేమ ఉన్నతమని అమాయకంగా భావించింది. ఇంత అమాయకురాలిని ప్రియుడు గట్టిగా ఆటంకంపెట్టలేక సరే అన్నాడు. కల్యాణి స్వార్థంసంగతి తెలియక పరార్థంకొఱకు పరుగుబెట్టింది. ఆ పరుగులో అన్నీ ఎదురుదెబ్బలే తగిలాయి. అయినా వెనుతిరిగిచూడకుండ ముందుకు నడచింది. తాబేటి నడకలాంటి స్వభావంకల్గిన మౌళికి కే అందించి ముందుకు నడిపించాలని తన సామర్థ్యాన్ని ప్రదర్శించినా, ఆమె ప్రదర్శించిన సమర్థతకు ప్రాధాన్యం కలగకపోగా విపరీతదృక్పథానికి, వికృత ఆలోచనలకు మార్గం ఏర్పడింది.

కల్యాణి అంతుపట్టని సమస్యల్లో చిక్కుకొన్నను పుట్టింటివారినిగురించి ఒక్క మాటకూడ మౌళితో అనలేదు. తన ప్రియుడే సర్వస్వంగా భావించినా మౌళిమాత్రం ఆలాగా భావింపక ఆమెను సాధించటం మొదలుపెట్టటం అతని వక్రబుద్ధికి ప్రతీకగా కల్యాణి ఋజుమార్గప్రవర్తనకు గీటురాయిగా వున్నది. ఆమె ముందడుగువేసినను ప్రతిఅడుగులో అసంతృప్తి, అసహనం చూచి భయపడిపోయింది. లేచి వచ్చినందుకు కల్యాణిమాట నెగ్గలేదు తన ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరలేదు సంతోషించాలన్న ఉబలాటం జారిపోయింది తనమాట వీగిపోయింది. పగిలిన ప్రతిమ లాంటి వ్యక్తిఅయిన మౌళిని ఏవిధంగానైనా అతికించాలని ప్రయత్నించిందికాని ఫలితం పొందలేకపోయింది.

'ఆదర్శాలను అనుసరించాలన్న ఉత్సాహం ఉంది కాని ప్రతికూలపరిస్థితుల్లో సహితం స్థిరంగా నిలబడి వితర్కించుకోగల మనోనిబ్బరంలేని మౌళిని మార్చాలని కల్యాణి అతని పాదాలమీద వాలిపోయింది. ప్రయోజనం లేకపోయింది. అతనిముందు తన ప్రతాపాన్ని చూపలేని అశక్తురాలై ఓడిపోయింది. ఓర్పుఉన్నదానిని చూపించినా ప్రయోజనం లేకపోవటంతో మౌళికి దూరమయింది. పరిస్థితులు కలసి

వస్తాయని దగ్గరకుచేరినా లేనిపోని ఆపోహలకు, కోపతాపాలకు గురైంది. తప్పించుకోలేని వలయంలో అటుయిటు తిరిగింది. ఎ తతిరిగినా తనకు ఆనందం లభించలేదు. కావాలని పెళ్ళిచేసికొన్న మౌళికే పనికి రాకపోయానుగదా అని బాధపడి ఆ బాధలో తన జీవన తరంగాలనే కోల్పోయింది. జీవంలేని మనిషి జీవంఉన్న ప్రాణిని సరిగా చూడకపోయినా ఆ ప్రాణి మనిషిని నిందించలేదు, తిట్టలేదు;కాని మార్పు రావాలని నిరీక్షించింది.

కల్యాణి---మౌళి పాత్రలకు రచయిత్రి చక్కని రూపకల్పన చేసారు. ఈ పాత్రలకు తోడుగా మైథిలి-నారాయణమూర్తి, సరోజిని - వసంతరావు, భ్రమరాంబ—శివరామయ్య...సుమిత్ర మొదలగు వారిని రంగస్థలం మీదకు తీసికొని వచ్చారు. మైథిలి—సరోజిని—భ్రమరాంబ, సుమిత్ర మొదలగు వారికంటె కళ్యాణి విరుద్ధమైంది. వీరందరూ తమ భర్తల దగ్గర ఎలాగో కాలక్షేపం చేసినా సుమిత్ర భర్తగా ఎవ్వరినీ పొందలేక కుమారిగా ఉండిపోయింది మైథిలికి తన తపస్సు ఫలించి నారాయణమూర్తి భర్తగా ప్రాప్తించాడు. వసంతంలాంటి వసంతరావును సరోజిని పొందింది భ్రమరంవంటి భ్రమరాంబకు ఏండ్లు దాటీదాటని శివరామయ్య దొరికాడు.

ఇందులో రచయిత్రి మౌళిని మార్చటానికి కల్యాణి అనుమతితో సుమిత్రను అతని ప్రక్కన నిలబెట్టించి రకరకాలైన ఘటనలు కల్పించారు. ఈ కల్పనలో ఔచిత్యం కన్పించటం లేదు.

కల్యాణి యింటినుంచి వెళ్ళిపోయినప్పుడు ప్రేమ - వాత్సల్యమూర్తులైన తల్లిదండ్రులు ఆమెను గురించి అన్వేషించినట్లు కన్పించదు. కల్యాణితల్లి చావుబతుకుల మధ్యనున్న కల్యాణిని తీసికొని రావాలన్న తాపత్రయం ఆ కుటుంబ సభ్యులలో యెవ్వరియందు లేదు ఈ విధంగా జరగనే జరగదు. అసంభవాన్ని సంభవంగా చూపించడంచేత కొంత అసంతృప్తి కల్గుతున్నది.

ఆనందారామంగారు తమ నవలాద్వారముగ ఏది సత్యమో, ఏది అసత్యమో అను నిర్ణయాన్ని పాఠకులకు వదలిన మౌళిని - కల్యాణిని ఒక్కటిగా చేసి చూపించినట్లయితే జీవితంలో ఒక గొప్ప సత్యాన్ని పరిశీలించినట్లుండేది. రచయిత్రి కథను ఏ ఆటంకం లేకుండా ముందుకు నడిపించారు. చక్కని శైలితోకూడిన రచన. సత్యాసత్యాలమధ్య నలిగిపోయిన జీవితాల స్వరూపం నవలలో స్పష్టంగా ప్రాణం పుంజుకొన్నది

ఇందులో కొన్ని ముద్రరాక్షసాలు ఉన్నాయి.

## కొడిగట్టిన దీపాలు

(రచయిత్రి—శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుత వల్లి. ప్రచురణ యం. శేషాచలం అండ్ కంపెనీ మద్రాసు—మచిలీపట్టణం—సికింద్రాబాదు. మూల్యం రెండు రూపాయలు పేజీలు 183.)

మనసులు తెలిసికోకుండా వ్యక్తులు ప్రవర్తించినట్లయితే ఆశయాలు కొడిగట్టిన దీపాలుగా మారిపోతాయి నాటికి చమురుపోస్తూ ఉండాలి. అడుగడుగునా చమురుపోస్తూ కొడిదులిపేస్తుండక పోతే వెలగలేక ఆరలేక నిర్జీవకాంతులనే యిస్తాయి. బాధలో అనుభూతి చరిత్ర అర్థమైనట్లుగా సుఖంలో అర్థంగాదు. కాలం కలిసివస్తే గుడుక్కుతినేవాడు అధికారియైపోతాడు. అవకాశాలను సద్వినియోగం చేసికొని ఆదర్శాలను నిలిపినపుడు మానవ జీవితాల్లో కొడిగట్టిన దీపాలుండవు. ఆరోజుకోసం ప్రతివ్యక్తి నిరీక్షించాలి.

గవరయ్యకు కష్టపడి సంపాదించటం తెలియకపోయినా సంపాదించిన దానిని ఎలా ఖాళీ చెయ్యాలో బాగా తెలుసు.

పల్లెలో తమ జీవితాలను గడుపుకొంటూ కలవారు మిగల్చిన అడుగూబొడుగు సేవించి భూమి మీద నిలబడినా సుఖం లేదు అంతకన్న సంతోషం లేదు. గవరయ్యకు 'నారాయణ' అనే కుమారుడున్నాడు. పనిచేస్తూనే చదువుకొని పైకివచ్చాడు.

తండ్రి కలప వ్యాపారం పెట్టాడు. ఆ వ్యాపారాన్ని నారాయణ చూసుకొంటున్నాడు. అందరూ మొదట్లో నారాయణకు చదువెందుకని బుగ్గలు నొక్కుకున్నారు. అట్టివారి పరిస్థితి దిగజారి పోయింది.

వ్యక్తిత్వం మానవత్వానికి గీటురాయి. ఇది కొందరికి లోపించటంచేత బుద్ధికి బూజుపట్టి సత్యాన్ని అసత్యంగా అర్థం చేసికొని అనుమానాలు పెంచుకొని ఆదర్శాలను వమ్ము చేసికొంటారు. అప్పుడే వారి మాటలకు కుంగిపోయేస్థితి వస్తుంది. కాని అన్నమాటలు ఆచరణ పూర్వకంగా చేసిచూపినపుడు మంచిని యింటినుంచి గెంటలేరు, పోయున్న ప్రాణాన్ని బలవంతంగా నెట్టివేయలేరు.

నారాయణపాత్ర ఒక చిక్కుసమస్యలో చిక్కుకొనిపోయింది. స్వయంకృషితో సాధించిన విజ్ఞానాన్ని వికృతంగా ప్రదర్శించకుండా లోకరీతి కనుగుణంగా నడచుకొనటంచేత సమస్యనుండి తేలికగా బయటపడగల్గాడు.

గవరయ్య వ్యాపారంచేయుటం చాల చిత్రం. తండ్రి ప్రారంభించిన వ్యాపారం చూచి నారాయణకే ఆశ్చర్యం కలిగింది. తండ్రి కొడుకూ వ్యాపారం సాగిస్తున్నారు. వీరికి పోటీగా 'చలపతి' అదృష్టం కలసివచ్చింది. 'నమ్మయ్య'కు అల్లుడై వ్యాపారానికి అధిపతి అయ్యాడు. సంపదఉంటే అంతస్థులు అడ్డురావు. ఎంతపనికిరాకపోయినా ఆ సమయానికి ఎదుటివారికి చాల నచ్చినవాడిగానే ఉంటాడు. మనుష్యులు కల్పించినదానికే ప్రాధాన్యంగాని సహజంగా లభించినదానికి ప్రాధాన్యంలేదు.

మహేశం చిత్రమైన మనస్తత్వం కల్గినవాడు. యశోదఅనే అందమైనభార్య ఉన్నది. ఆమె అందంగా ఉంటుందన్నసంగతి మహేశాని కేమాత్రం తెలియదు. యశోద బాగా పాడుతుందని అందరికి తెలుసుకాని పుస్తెకట్టినవానికిమాత్రం తెలియదు. నిజానిజాలు చూడక ఆవేశానికి లొంగిపోయే స్వభావమతనిది. అర్థంలేని ఆలోచనకు బానిసై కార్పణ్యాలు ఛిగించుకొని చేయరానిపని చేసాడు.

మహేశాన్ని ఎరుగున్నవారు 'నీకు అందమైన భార్య ఉన్నది. జీవితంలో అంతకన్నా ఆనందం ఏమున్నద'ని ఎవరైనాఅంటే ఆ వ్యక్తికి సమాధానం చెప్పలేక యింటికొచ్చి భార్యపైన ఎగిరిపడటం, తిట్టటం, కొట్టటం చేస్తాడు. ఇలాంటి మూర్ఖులు ఏపనైనా చేస్తారు. అయితే యశోద పాత్రపైన సానుభూతి కలుగుతుంది. సృష్టికర్త యిచ్చిన అందం భర్తపాలిట దయ్యమయినది. ఊహించరాని పరిస్థితులు ఉత్పన్నమైనపుడు 'మంచి'ని గుర్తించక అనవసరంగా ఎదురుగా కావ్పించే వ్యక్తిని రూపుమాపాలని ప్రయత్నం చేస్తారు. మహేశం అర్థం చేసికొని అడుగుముందుకు వేసివుంటే ఈ దుష్కృత్యాన్నిచేసి ఉండే వాడుకాదు.

భార్యా భర్తలు సుఖంగా జీవయాత్ర సాగిస్తున్నప్పుడే అందం ఆనందం కలుగుతాయి. అందులో ఎవ్వరు వెనుకబడినా యావజ్జీవితమే వెనుకబడిపోతుంది. నేటి మన సమాజంలో రకరకాలైన స్పర్థలువచ్చి కొన్ని కుటుంబాలు విడిపోతున్నాయి. ఆ కుటుంబాల్లోకూడ అవాంతర పరిస్థితులేర్పడి ఎవరికి వారు విడిపోవటం జరుగుతూనే ఉన్నది. అయితే మహేశంలాంటి పురుషులు, యశోదలాంటి స్త్రీలు అచ్చటచ్చట కానవస్తారు.

నవలలో నాలుగు రకాల జంటలను రచయిత చిత్రించారు. సంపదపై మోజు, సంగీత సాహిత్యాలపై ఆసక్తిఉన్న విశ్వనాథానికి పల్లెటూరు అమ్మాయి దేవకి భార్య అయింది.

అందం అంటే సహించలేని మహేశానికి అందచందాలున్న, బాగాపాడే యశోద భార్యగా లభించింది అయితే ప్రయోజనం పొందక మూరుడై పోయాడు మహేశం. యశోద భర్తతో కాపరం చెయ్యలేనని, తన వ్యక్తిత్వం చూపించుకోవాలని యిల్లు వదలి వచ్చేసింది.

రవణ సంసారంఅంటే తెలియకముందే బాల విధవగా ఉండిపోయింది.

వర్గభేదాలమాట అటుంచి ప్రేమే ప్రధానంగా భావించి మంగళను వివాహమాడిన చలపతి సమాజాని కొక పాఠం చెప్పాడు.

కులానికి తక్కువవాడని లోకం ఎంతగాఅన్నను గుణానికేమాత్రం తక్కువవాడుకాదు నారాయణ. ఉన్నతభావాలున్నవాడు. అయితే తాను 'రవణ'ను వప్పించి పెళ్ళిచేసికోలేకపోయాడు. సమాజపు కట్టుబాట్లను వ్యతిక్రమింపలేని రవణ నారాయణను వివాహమాడటానికి అంగీకరించకపోయేసరికి నిరాశుడైపోయాడతడు.

వీరంతా వివిధములైన సమస్యలు ప్రపంచంలో ఉన్నారు. ఒకరి మనస్తత్వం మరి ఒకరికి సరిపడకపోతే ఎవరికివారు దూరమైనారు. వారి మనసుల్లో తీరని అఘాతపుఆలోచనలు బయలుదేరాయి. పరిష్కారం కుదుర్చుకోలేకపోయారు. ఆలోచనలను వికృతంగా పెంచి పోషించుకొన్నారు. ఇకను తమలోతాము సమాధానపడి ముందుకు రాలేకపోయారు. మహేశం యశోదను రమ్మని పిలవలేదు; మహేశం కావాలని యశోద అతనిదగ్గరకూ చేరలేదు. అన్నీ ఉన్నా ఏమీచేయలేని విశ్వనాథం దేవకికి సహాయపడలేకపోయాడు. ఎంత ప్రయత్నించినా విశ్వనాథం ప్రేమను పొందలేక కుమిలిపోయింది దేవకి. మంచితనాన్ని గుర్తించి తెలియకుండ వలపు పెంచుకొన్న 'రవణ' సాహసించి నారాయణను వివాహమాడలేకపోయింది. చదువు సంస్కారం అబ్బిన నారాయణ రవణను తనదిగా చేసికొనలేకపోయినందుకు చాల బాధపడ్డాడు. చలపతి—మంగళ అనుకొన్నది అనుకొన్నట్లుగానే జరిగిపోయింది. అందరి మనసుల్లో అజ్ఞానం కరుడుగట్టి కొడిగట్టింది. కాని అట్టి అజ్ఞానం చలపతి—మంగళలను చేరలేదు. అందుకనే వీరుగాక తక్కినవారందరూ కొడిగట్టిన దీపావలె కాంతివిహీనులైపోయారు.

రచయిత్రి భావాలు బాగానే ఉన్నాయికాని రవణ—నారాయణలకు వివాహంచేసిఉంటే సబబుగా ఉండేది. ఈనాడు దేశంతో విధవావివాహాలు జరిగిపోతున్నాయి. అయినా యిలాగున వెనుకంజవేసేవారు లేకపోలేదు. ప్రధానపాత్రలైనవుడు వాటికి కాస్త ఊపిరిస్తే అవి కొడిగట్టిన దీపాలలో ఉండేవికాదు గదా.

సామాజిక వాతావరణాన్ని ఆధారంచేసికొని అందంగా వ్రాయగలశక్తి శ్రీమతి అచ్యుతవల్లిగారికున్నది. ఆసక్తి కలిగించి సొంతం నవలను చదివింపగల నేర్పు ఉన్నది.

—రామమోహన్.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1, Editor: S. Sambhu Prasad.